
శ్రీమతే రామానుజాయ నమః
శ్రీరామానుజ శ్రీసూక్తి సుధ
( కాంచీ మహావిద్వాన్ ప్ర.భ. అణ్ణంగరాచార్య స్వామివారి ద్రవిడోపనిషత్
ప్రభావ సంగ్రహమనే గ్రంథం నుండి స్వీకరింపబడి, ఆంధ్రీకరింపబడింది )
అనువాదం
పండితరత్న, వేదాన్తవాచస్పతి
ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి
భగవద్రామానుజ సహస్రాబ్ది మహోత్సవ శుభారంభ స్మృతి చిహ్నిక
సమర్పణము
త్రైవర్ణిక వైష్ణవ గోష్ఠి, విజయనగరం
2016

శ్రీమతే రామానుజాయ నమః



# శ్రీరామానుజ శ్రీసూక్తి సుధ

( కాంచీ మహావిద్వాన్ ప్ర.భ. అణ్ణంగరాచార్య స్వామివారి
ద్రవిడోపనిషత్ ప్రభావ సంగ్రహమనే గ్రంథం నుండి
స్వీకరింపబడి, ఆంధ్రీకరింపబడింది. )

అనువాదం

పండితరత్న, వేదాన్తవాచస్పతి

ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి

భగవద్రామానుజ సహస్రాబ్ది మహోత్సవ శుభారంభ స్మృతి చిహ్నిక

సమర్పణము

త్రైవర్ణిక వైష్ణవ గోష్ఠి, విజయనగరం

2016

# శ్రీరామానుజ శ్రీసూక్తి సుధ

**(అనువాదం : ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి వారు)**


| | | |
|---|---|---|
| ప్రథమ ముద్రణ | : | మే, 2016 |
| ప్రతులు | : | 500 |
| సందర్భం | : | శ్రీరామానుజ సహస్రాబ్ది చిహ్నంగా నిర్వహింపబడిన ఇరామానుశ నూత్తందాది ప్రబంధానుసంధాన సమాపన కార్యక్రమం |
| వేదిక | : | అనంతపద్మనాభస్వామి దివ్యాలయం, పద్మనాభం, విజయనగరం జిల్లా. |
| వెల | : | అమూల్యము |
| అన్నిహక్కులు | : | అనువాదకునివి |
| ముఖచిత్రం | : | భగవద్రామానుజులు, శ్రీ పెరుంబూదూర్. నమ్మాళ్వార్, కాంచీ ప్ర.భ. అణ్ణంగరాచార్యస్వామివారు |


**ఈ గ్రంథం విజయనగరంలోని త్రైవర్ణిక గోష్ఠి భక్తిపూర్వకంగా సమర్పించిన పవిత్ర ద్రవ్యంతో ముద్రింపబడింది.**

**విజయపుర త్రైవర్ణిక వైష్ణవగోష్ఠ్యా సమర్పితా కుర్యాత్ ।**
**మోదం శ్రీరామానుజ సూక్తిసుధేయం ప్రపన్నానామ్ ॥**


| | | |
|---|---|---|
| డి.టి.పి. | : | జయలక్ష్మి, చంద్రశేఖర్, తిరుపతి. |
| ప్రింటింగ్ | : | సి.ఎన్. ప్రింటర్స్, ప్రకాశంరోడ్ తిరుపతి. |

శ్రీమతే రామానుజాయ నమః

# శుభారంభము

న చేద్రామానుజేత్యేషా చతురా చతురక్షరీ ।
కామవస్థాం ప్రపద్యన్తే జంతవో హన్త! మాదృశః ॥

సహృదయులగు భాగవతోత్తములకు సవినయముగ అంజలిస్తూ చేయుచున్న చిన్న విన్నపము. భగవద్రామానుజులు జగద్గురువులు అనుమాట ముమ్మాటికీ సత్యము. **"సత్యం సత్యం పునస్సత్యం యతిరాజో జగద్గురుః".** సకల లోకోద్ధారకులు వారే అనుటకు సంశయమే లేదు. అటువంటి మహనీయులు ఈ భూమండలమునందు అవతరించి 999 సంవత్సరములయినవి. సహస్రాబ్ది సమీపించినది. ఆనందమయ మగు సమయము ఆసన్నమయినది. జగదాచార్య పరిచర్యను గావించి జన్మను ధన్యము చేసుకొనే సదవకాశము లభించినది. **"సిరి రా మోకాలొడ్డుటయా!"** అటువంటి అవివేకులమా! మనము! సదాచార్య సమాశ్రయణ పరులమయి, ఆచార్యాభిమానమును పరిపూర్ణముగ చూరగొన్న శ్రీమంతులము కదా! ఈ సదవకాశమును అందిపుచ్చుకుందాము అనుకున్నారు, శ్రీత్రైవర్ణికవైష్ణవ రామానుజకూటము, విజయనగరముగోష్ఠివారు. భగవద్రామానుజ సహస్రాబ్ది కైంకర్యములకు శుభారంభము గావించినారు. తమకు గల సత్సంప్రదాయనిష్ఠను సత్కార్యాచరణతో మరొక పర్యాయము ఋజువు చేసుకో గలిగిన ధన్యులయినారు.

1967వ సంIIలో మా నాయినగారు ఉ.వే. శ్రీమాన్ డాII కందాళ వేంకటాచార్యస్వామివారు ఉద్యోగరీత్యా విజయనగరము చేరినారు. వారి ఆచార్యులు ఉ.వే. శ్రీమాన్ తె.కం. గోపాలాచార్యస్వామివారు విజయనగరమునందుగల త్రైవర్ణిక వైష్ణవ రామానుజకూటము గోష్ఠివారికి సంప్రదాయగ్రంథకాలక్షేపమును కావించమని వారిని ఆదేశించినారు. ఆచార్య ఆజ్ఞను పాటించి నిరంతరాయముగ 30 సంIIలు మూడు తరములవారికి సద్గ్రంథ కాలక్షేపమును అనుగ్రహించినారు. సదాచార్యలాభమువలన రామానుజకూటము గోష్ఠివారు సత్సంప్రదాయనిరతులయినారు. తరతరములుగ ప్రపన్నులు, సమాశ్రయణపరులు, రామానుసేవా

నిరతులు అయిన వారికి సదాచార్య లాభము నూత్నశోభను కలుజేసినది. త్రైవర్ణిక వైష్ణవకులమునకు, విజయనగరముగోష్ఠికి విశిష్టత చేకూరినది.

మా తండ్రిగారు 1999లో పరమపదించినారు. వారి ఆజ్ఞను శిరసా వహించి, పెద్దల ఆమోదముతో ఈ దాసురాలు ఆ బాధ్యతను స్వీకరించినది. వారు చూపిన మార్గమును అనుసరిస్తూ సంప్రదాయసేవను యథాశక్తిగ చేయుచున్నది. ఈగోష్ఠి వారికి విధముగ సుమారు 49 సం॥ల నుండి ఆచార్య సంబంధము కొనసాగు తున్నది. ఆచార్యవైభవమును ఇనుమడింప జేయాలనే శ్రద్ధ పెంపొందించు చున్నది. **"గురుం ప్రకాశయేత్ ధీమాన్"** అన్నారు కదా!

భగవద్రామానుజులు సహస్రాబ్ది సందర్భముగ ఎన్నెన్నో కైంకర్యములను చేసుకొనగలిగే శక్తి మంతులము కావాలి- అనే ఆశ అంకురించినది. కలియుగమున నామ సంకీర్తనమునకు మించినది మరొకటి లేదు. ముందుగ భగద్రామానుజ వైభవానుభవము కావిస్తూ, వారి నామమును అనుసంధానము చేయాలని అనిపించినది. దానికి అనుకూలమయినది, ప్రపన్న గాయత్రిగా ప్రసిద్ధ మయినది, ప్రతిపాశురమునందు (రామానుజ) చతురక్షరిని పొందుపరచుకున్నది, రామానుజ దివ్యవైభవామృతమని చెప్పదగినది - తిరువరంగత్తముదనార్లు అనుగ్రహించిన 108 పాశురములు గల "ఇరామానుశనూత్తందాది" దివ్యప్రబంధము. దానిని 108 సార్లు అనుసంధానము చేయుచు భగవద్రామానుజారాధనముగ 108 వాగ్రూపమగు పుష్పములను స్వామిపాదారవింద సన్నిధిని సమర్పిస్తూ సహస్రాబ్దిని స్వాగతించ వలెనని ఆచార్య సూచనగ అనిపించినది. గోష్ఠివారికి తెలియజేయగ వారు చాల ఆనందముగ స్వీకరించినారు.

భగవత్సంకల్పము, భగవద్రామానుజుల అనుగ్రహము, స్వాచార్యకటాక్ష ముతో సహస్రాబ్ది స్వాగతోత్సవ కార్యక్రమునకు రూపకల్పన జరిగినది. పరమా చార్యులగు ఉ.వే. శ్రీమాన్ తె.కం. గోపాలాచార్య స్వామివారి తిరునక్షత్రము (జ్యేష్ఠ) పుష్య బహుళ ఏకాదశి నాడు అస్మదాచార్యులు, పితృపాదులయిన ఉ.వే. శ్రీమాన్ డా॥ కందాళ వేంకటాచార్యస్వామివారి స్వగృహమగు భాగవతాభిమాన వసతి యందు వారి నిత్యారాధన పెరుమాళ్ళు సీతాలక్ష్మణ హనుమత్సమేత

శ్రీరామచంద్ర స్వామివారి సమక్షమున "ఇరామానుశనూత్తందాది" దివ్యప్రబంధాను సంధాన మును ప్రారంభించుకొనినాము.

ఈ కార్యక్రమమును నిర్వహించుకొనుటలో శ్రీత్రైవర్ణికవైష్ణవ రామానుజ కూటము, విజయనగరముగోష్ఠివారి శ్రద్ధ అభినందనీయము. అందరు తమ తమ గృహములందు రామానుజ కైంకర్యమును చేసుకొనుటకు ఆసక్తి చూపినారు. అదృష్టవంతులకు లభించినది. కార్యము, ఫలము అందరివి. నిర్వహణ బాధ్యత మాత్రము కొందరిది. శ్రద్ధగ, ఇష్టముగ, ఉత్సాహముగ, ఆదరముగ అందరూ పాల్గొనినారు. నోరారా, మనసారా భగవద్రామానుజ నామమును గానము చేసినారు. క్రొత్తగ్రహారము వేంకటరమణమూర్తి ఆలయం ఆండాళ్ గోష్ఠివారు కూడ కొంతమంది శ్రద్ధగ అన్వయించినారు.

విజయనగరమునకు సమీపమునందున్న సింహాచలము, శ్రీకూర్మము, శ్రీరామతీర్థము దగ్గరగల ఎంబేరయ్యగుళ్ళు వంటి ఎంబెరుమానారులు నడయాడిన ప్రదేశములు. వారికి అభిమాన స్థలములు అయిన పవిత్ర క్షేత్రములనందు కూడ దివ్యప్రబంధానుసంధానము చేసుకొనినారు. అది ఒక విలక్షణమును దివ్యస్మృతిగ మనసున నిలుపుకొనగలిగినాము. అచ్చట గల భాగవతోత్తముల సహకారమునకు సదా కృతజ్ఞులము. ఉగాది పర్వదినమున నిత్యకాలక్షేపకూటమగు రామానుజ కూటమునందు ఈ కార్యక్రమమును నిర్వహించు కొనుట, ఆరోజు శుక్రవార మగుట శుభసూచకముగ అనిపించినది.

అస్మదాచార్యుల అవతార స్థలమగు పద్మనాభమునందుగల శ్రీఅనంత పద్మనాథస్వామివారి దేవస్థానమునందు ఈకార్యక్రమ పరిపూర్తిని చేసుకొనవలె నని, ఈ విధముగ స్వాచార్యముఖోల్లాసమును కలిగించవలెనని భావించినాను. సహస్రాబ్ది సందర్భముగ భగవద్రామానుజ వైభవమును మారుమూల గ్రామాలలో కూడా ప్రచారము చేయవలెనని పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చినజీయరు స్వామివారి ఆదేశము. కనుక పద్మనాభమువంటి చిన్న గ్రామమునందు సహస్రాబ్ది స్వాగతోత్సవ కార్యక్రమ మును నిర్వహించుట ఉచితమని అనిపించినది.

ఈ సత్కార్యజ్ఞాపికగ ఒక గ్రంథమును ప్రకటించుకొనవలెనని కోరిక కలిగినది. మా నాయనగారి తిరునక్షత్ర జ్ఞాపికలుగ ఎన్నో గ్రంథములను తమ ఆంధ్ర వివరణములతో మాకు అందించుచున్న ఉ.వే. శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్య స్వామివారిని ప్రార్థించినాము. వారు **"శ్రీరామానుజ శ్రీసూక్తిసుధ"** అను ప్రస్తుత గ్రంథమును సిద్ధము చేసినారు. వారి ఆత్మీయతకు, అభిమానమునకు, దాసోహములు సమర్పిస్తున్నాము. సదా మమ్ములను ప్రోత్సహిస్తూ, మంగళా శాసనములను అనుగ్రహించిన పరమభాగవతోత్తములయిన ఉ.వే. **శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్య స్వామివారికి, ఉ.వే. శ్రీమాన్ రంగాచార్య స్వామివారికి** కృతజ్ఞతతో దాసోహములు సమర్పిస్తున్నాము. సహస్రాబ్ది అంతా సదా రామానుజ సేవాభాగ్యవంతులమయేటట్లు మంగళాశాసనము చేయవలసినదిగ పెద్దలను ప్రార్థిస్తున్నాము.

**రామానుజార్యదివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతామ్ ।**

ఇట్లు, నివేదించు
భాగవత పదరేణువు
**కె.వి. జానకి**
విజయనగరము



## రామానుజ సహస్రాబ్దిని ఆహ్వానిస్తూ 108 పర్యాయములు
## ఇరామానుశనూత్తందాది దివ్యప్రబంధ అనుసంధానము

**తే.04-02-2016** ది అనగా మన్మధ నామ సంవత్సర పుష్యబహుళ ఏకాదశి నుండి
**తే.03-05-2016** ది అనగా దుర్మిఖినామ సంవత్సర చైత్ర బహుళ ఏకాదశి వరకు

| క్రమ సంఖ్య | పేరు / స్థలము | తేది | వారము | ఆవృత్తులు |
|---|---|---|---|---|
| 1 | అస్మదాచార్య గృహము భాగవతాభిమానవసతి శ్రీ ఉ వే శ్రీమాన్ డా కందాళ వేంకటాచార్య స్వామి (పరమపద వాసి) చిత్రానీళ దంపతులు | 04-02-2016 | గురువారం (పరమాచార్యులు శ్రీఉ వే శ్రీమన్ తె కం గోపాలాచార్య స్వామి వారి తిరునక్షత్రం) | 3 |
| 2 | శ్రీమాన్ దాసరి యతిరాజ సంపత్కుమార్, ఆండాళ్ళమ్మ దంపతుల గృహము, విజయనగరం | 05-02-2016 | శుక్రవారం | 3 |
| 3 | శ్రీమాన్ మద్ది మురళీ క్రిష్ణ, రుక్మిణి దంపతుల గృహము, విజయనగరం | 12-02-2016 | శుక్రవారం | 4 |
| 4 | శ్రీమాన్ దాసరి బద్రి శ్రీనివాస్, నాగలక్ష్మి దంపతుల గృహము, విజయనగరం | 18-02-2016 | గురువారం (భీష్మ ఏకాదశి, ఆర్ద్ర | 4 |
| 5 | శ్రీమాన్ దాచేపల్లి మురళీక్రిష్ణ, సుబ్బలక్ష్మి దంపతుల గృహము, విజయనగరం | 19-02-2016 | శుక్రవారం | 3 |
| 6 | శ్రీమాన్ దాసరి పూర్ణానందస్వామి, రమణకుమారి దంపతుల గృహము, విజయనగరం | 26-02-2016 | శుక్రవారం | 3 |
| 7 | శ్రీ వరాహ లక్ష్మీనృసింహస్వామివారి దేవస్థానం, సింహాచలం, విశాఖపట్నం జిల్లా | 01-03-2016 | మంగళవారం | 5 |
| 8 | శ్రీమాన్ దాచేపల్లి జోగి జగన్నాధం, సుబ్బలక్ష్మి దంపతుల గృహము, విజయనగరం | 04-03-2016 | శుక్రవారం | 3 |
| 9 | శ్రీమాన్ నాగులకొండ కేశవనారాయణ, పద్మావతి దంపతుల గృహము, విజయనగరం | 05-03-2016 | శనివారం, ఏకాదశి | 4 |

| | | | | |
|---|---|---|---|---|
| 10 | శ్రీమాన్ దాసరి సింగప్పెరుమాళ్, సీతమ్మ దంపతుల గృహము, విజయనగరం | 11-03-2016 | శుక్రవారం | 3 |
| 11 | శ్రీమాన్ మంచుకొండ శ్రీనివాస్, నాదమ్మ దంపతుల గృహము, విజయనగరం | 15-03-2016 | మంగళవారం, పెరియపెరుమాళ్ తిరునక్షత్రం | 3 |
| 12 | శ్రీమాన్ దాసరి యతిరాజ సంపత్కుమార్, ఆండాళ్ళమ్మ దంపతుల గృహము, విజయనగరం | 17-03-2016 | గురువారం, ఆర్ద్ర | 6 |
| 13 | శ్రీమాన్ నాగులకొండ మాధవక్రిష్ణ, నరసయ్యమ్మ దంపతుల గృహము, విజయనగరం | 18-03-2016 | శుక్రవారం | 3 |
| 14 | శ్రీమాన్ నాగులకొండ వేంకట రామానుజయ్య, మణెమ్మ (పరమపద వాసి) దంపతుల గృహము, విజయనగరం | 19-03-2016 | శనివారం, ఏకాదశి | 4 |
| 15 | శ్రీమాన్ నాగులకొండ వేంకట శింగరయ్య, రాజయ్యమ్మ దంపతుల గృహము, విజయనగరం | 25-03-2016 | శుక్రవారం | 3 |
| 16 | శ్రీ కూర్మనాధస్వామి దేవస్థానం, శ్రీకూర్మం, శ్రీకాకుళం జిల్లా | 29-03-2016 | మంగళవారం | 6 |
| 17 | శ్రీమాన్ నాగులకొండ వేంకట గణపతిరావు, ఆండాళ్ళమ్మ దంపతుల గృహము, విజయనగరం | 01-04-2016 | శుక్రవారం | 3 |
| 18 | శ్రీమాన్ మట్టపల్లి వెంకట రమణ (నానాజీ), పెరిందేవి దంపతుల గృహము, విజయనగరం | 02-04-2016 | శనివారం | 3 |
| 19 | శ్రీమాన్ బంగారు హనుమంతరావు, జయశ్రీ దంపతుల గృహము, విజయనగరం | 03-04-2016 | ఆదివారం, ఏకాదశి | 4 |
| 20 | శ్రీ త్రైవర్ణిక వైష్ణవ రామానుజకూటం, విజయనగరం | 08-04-2016 | శుక్రవారం, ఉగాది | 3 |
| 21 | శ్రీమాన్ వజ్రపు జగన్నాధం, దుర్గ దంపతుల గృహము, విజయనగరం | 10-04-2016 | ఆదివారం | 3 |

| | | | | |
|---|---|---|---|---|
| 22 | శ్రీమాన్ నాగులకొండ వెంకట శ్రీమన్నారాయణ (పాండు), సీతమ్మ (పరమపద వాసి) దంపతుల గృహము, విజయనగరం | 12-04-2016 | మంగళవారం | 3 |
| 23 | శ్రీమాన్ దాచేపల్లి సుబ్బారావు, విమల దంపతుల గృహము, విజయనగరం | 13-04-2016 | బుధవారం, ఆర్ద్ర | 4 |
| 24 | శ్రీమాన్ దాచేపల్లి సన్యాసిరాజు, తిరువేంగళమ్మ దంపతుల గృహము, విజయనగరం | 15-04-2016 | శుక్రవారం, శ్రీరామనవమి | 3 |
| 25 | శ్రీమాన్ మంచుకొండ శ్రీమన్నారాయణ, రంగనాయకమ్మ దంపతుల గృహము, విజయనగరం | 17-04-2016 | ఆదివారం, ఏకాదశి | 4 |
| 26 | ఎంబేరయ్య గుళ్ళు, శ్రీ లక్ష్మీ నృసింహ స్వామివారి దేవస్థానం, రామతీర్థం దగ్గర | 19-04-2016 | మంగళవారం | 3 |
| 27 | శ్రీమతి నాగులకొండ రేణుక (కొడుకు శ్రీనివాస్, కోడలు శ్రీవిద్య) గృహము, విజయనగరం | 20-04-2016 | బుధవారం, దేవప్పెరుమాళ్ తిరునక్షత్రం | 3 |
| 28 | శ్రీమాన్ అయ్యగారి రాజప్రసాద్, సుధారాణి దంపతుల గృహము, విజయనగరం | 21-04-2016 | గురువారం, మధురకవి ఆళ్వార్ తిరునక్షత్రం | 3 |
| 29 | శ్రీమాన్ దాసరి శ్రీనివాస్, బద్రి ఆండాళ్ దంపతుల గృహము, విజయనగరం | 22-04-2016 | శుక్రవారం | 3 |
| 30 | శ్రీమాన్ నాగులకొండ వెంకటరాయులు, సుబ్బలక్ష్మి దంపతుల గృహము, విజయనగరం | 29-04-2016 | శుక్రవారం | 3 |
| 31 | శ్రీ త్రైవర్ణిక వైష్ణవ రామానుజకూటం, విజయనగరం | 30-04-2016 | శనివారం, శ్రవణం | 2 |
| 32 | శ్రీ శ్రీ శ్రీ అనంత పద్మనాభస్వామి వారి దేవస్థానం మరియు శ్రీ శ్రీ శ్రీ కుంతీమాధవస్వామి వారి దేవస్థానం, పద్మనాభం, విశాఖపట్నం జిల్లా అస్మదాచార్యుల జన్మస్థలం | 03-05-2016 | మంగళ వారం | 1 |
| | మొత్తం ఆవృత్తులు | | | 108 |

న్యాయవేదాన్త విద్వాన్, ఉభయవేదాంతభాస్కర
**ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్య స్వామివారు,**
భారద్వాజభవనం, కోవెలవీథి, నరసాపురం



# శుభాభినందనం

వాన్తికழும్శోలై మదిళరజ్గర్ వణ్పుకழ்మేల్
ఆన్ఱ తమిழ்మఱైకళ్ ఆయిరముమ్ - , ఈన్ఱ
ముదఱ్ఱాయ్ శడకోపన్ మెయ్మ్మాల్ వళర్త్త
ఇదత్తాయ్ ఇరామానుశన్.

ఇది పరాశరభట్టర్ అనుగ్రహించిన తిరువాయ్మొழிతనియన్ పాశురం. ఆకాశాన్ని తాకే తోటలను, ప్రాకారాలను కల శ్రీరంగంలోని శ్రీరంగనాథుని కల్యాణగుణాలనుగూర్చి అనుగ్రహింపబడిన, ద్రావిడవేదరూపమైన వేయి పాశురాలను కృపజేసిన కన్నతల్లి నమ్మాழ்వార్లు. వాటిని సామర్థ్యంతో పెంచి వర్ధిల్ల చేసిన (ధాత్రి) పెంపుడు తల్లి శ్రీరామానుజులు - అని దీని అర్థం. దీనివల్ల ఆழ்వార్ల దివ్యప్రబంధాల ప్రచారానికి శ్రీరామానుజులెంత కారణభూతులో తెలుపబడింది. శ్రీరామానుజులు తమ గ్రంథాలలో అనుగ్రహించిన పలు సూక్తులకు, వివరణలకు, సమన్వయాలకు ఆழ்వార్ల దివ్యప్రబంధసూక్తులు, విశేషించి, నమ్మాழ்వార్ల సూక్తులు మూలమని అభిజ్ఞులైన పూర్వాచార్యుల అభిప్రాయం. విశిష్టాద్వైత సిద్ధాంత ప్రతితంత్రార్థమైన శరీరశరీరిభావం, కప్యాసశ్రుతివివరణం, భగవద్గీతలో చతుర్విధ అధికారుల వివరణం, మాధ్యమికమతం మొదలైన పలు మతాల నిరసనం మొదలైన పలు అంశాలలో శ్రీరామానుజులు శఠకోపుల సూక్తుల భావాలను అనుసరించారు, అనువదించారు.

ఈ అంశాన్ని కీర్తిమూర్తులు, నిత్యస్మరణీయులైన **కాంచీ మహావిద్వాన్** ప్ర.భ. అణ్ణంగరాచార్య స్వామివారు ద్రావిడంలో సోదాహరణంగా, సప్రమాణంగా వివరించగా, దానిని శ్రీరామానుజ సూక్తిసుధ అనే పేరుతో కుమారుడు చి॥ శింగరాచార్యులు ఆంధ్రీకరించాడు.

విజయనగరంలోని త్రైవర్ణికవైష్ణవగోష్ఠివారి సంప్రదాయాభినివేశం, వారు చేసే సేవ పెద్దలందఱి మెప్పును పొందుతున్నది. శ్రీరామానుజ సహస్రాబ్ది సందర్భంలో ఈ గోష్ఠివారు ఇరామానుశనూఱ్ఱన్దాది అనుసంధానాన్ని 108 సార్లు భగవద్రామానుజముఖోల్లాస కైంకర్యంగా చేసికోవడం వారి అకుంఠిత సంప్రదాయ దీక్షకు ఒక ఉదాహరణం. ఈ సందర్భంలో వారు శ్రీరామానుజ సూక్తిసుధ అనే లఘుగ్రంథాన్ని ప్రచురించడం ముదావహం. వీరిని నేను హార్దికంగా అభినందిస్తూ, వీరి ఆచార్యభక్తి ఇనుమడించాలని మంగళాశాసనం చేస్తున్నాను. ఈ గోష్ఠిసభ్యులను సదా ప్రోత్సహించి మార్గనిర్దేశనం చేసే శ్రీమతి కె.వి. జానకమ్మగారి కృషి అభినందనీయం. స్వస్తి.

నరసాపురం — ఇట్లు, అనేక మంగళాశాసనాలతో

10-4-2016 — **ఈయుణ్ణి రంగాచార్యులు**

ఉభయవేదాన్త వాచస్పతి, ద్రావిడ వేదాన్త విశిష్టపండిత, పండితరత్న
ఉ.వే. శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్య స్వామివారు
స్థానాచార్యులు, శ్రీఆదికేశవఎంబెరుమానార్‌స్వామివార్ల కోవెల
నరసాపురం



స్వస్తిశ్రీర్దిశతాత్

# శ్రీరామానుజసూక్తిసుధాస్వాదము

వాழ్‌ి యెతిరాశన్ వాழ్‌ి యెతిరాశన్
వాழ్‌ి యెతిరాశన్ ఎన వాழ్‌త్తువార్, వాழ్‌ియెన
వాழ్‌త్తువార్ వాழ్‌ి యెన వాழ్‌త్తువార్
తాళిణైయిల్ తాழ్‌త్తువార్ విణ్ణోర్‌తలై. (ఆర్త్రిప్రబంధం-1)

(స్వామి యెంబెరుమానార్లు కాలతత్త్వము ఉన్నంతవఱకును మనకు దర్శన మీయవలెను. వారి యాజ్ఞ సర్వత్ర అప్రతిహతంగా వ్యాప్తి జెందవలెనని పల్లాండు పాడువారికి పల్లాండు పాడువారు నిత్యసూరి నిర్వాహకులగుదురు. లేదా, నిత్య సూరులు వారి శ్రీచరణాల్ని శిరసా వహింతురు.)

ఇది శ్రీరామానుజదాసానుదాసుల వైభవం. శ్రీవైష్ణవసంప్రదాయానికి ఉభయ వేదాన్త సంప్రదాయమని పేరు. సంస్కృత - ద్రావిడవేదాన్తాల్ని ఆచార్యసన్నిధిలో శ్రవణం చేసి ప్రచారం చేసేవారికి ఉభయవేదాన్తప్రవర్తకులని వ్యవహారము. **"ఉభౌ చ తౌ వేదాన్తౌ చ ఉభయవేదాన్తౌ"** అనే విగ్రహవాక్యంలో ఉభశబ్దానికి ఉభయా దేశం వ్యాకరణ నియమసిద్ధం. రెండిటికి సమప్రాధాన్యాన్ని ఉభయశబ్దం తెలుపు తుంది. ఆ రెండును సంస్కృత-ద్రావిడవేదాన్తాలు. **"శెన్దిఱత్త తమిழ్‌ోశై వడ శొల్లాగి"** - భగవానుడు సంస్కృత ద్రావిడ వేదస్వరూపుడని తిరుమంగై ఆழ్వార్ల శ్రీసూక్తి. అపేక్ష గలవారికి తనలోని అర్థాన్ని స్పష్టంగా తెలిపే ద్రావిడసూక్తి - అధికారులకు షడంగసహకారంతో స్వార్థాన్ని ప్రకాశింపజేసే సంస్కృతసూక్తి, ఇట్లు ఉభయవేదాల సహకారంతో జ్ఞాతవ్యార్థాలు స్పష్టంగా అవగతములగును. వస్తు దర్శనానికి రెండు నేత్రాలు ఆవశ్యకములు గదా! ఆ రెండిటిలో ఎడమకన్ను

కుడికంటికి సహకరింపగా పదార్థదర్శనం సులభమగును. "స్వం సంస్కృతద్రావిడ వేదసూక్తై:" అని శ్రీరంగనాథుని ప్రకాశాన్ని గూర్చిన భట్టపాదుల దివ్యసూక్తి.

మన పూర్వాచార్యులైన నాథయామున యతిరాజ పరాశరభట్టపాద వేదాన్త దేశిక వరవరమునీంద్రాదులు ఆళ్వార్ల దివ్యప్రబంధాలలోని మహార్థాల్ని, స్వారస్యాన్ని తమ గ్రంథనిర్మాణకౌశలానికి నిదానంగా భావించారు. ఉభయ వేదాన్తాలను పరస్పర సహకారంతో నెట్లు భావన చేయాలో తమ రచనలలో చూపించారు. శ్రుతప్రకాశికా భట్టర్ "**ప్రమాణం చ ప్రమేయం చ**" అనుశ్లోకం ద్వారాను, స్వామి మణవాళమహామునులు "**ఆళ్వార్‌గళ్ వాళి**" అను పాశురము లోను ఉభయవేదాన్తాలను మన పూర్వాచార్యులు భావనచేసి వ్యాఖ్యానించిన రీతిని తెలిపి, వారి కృషి లోకోజ్జీవనహేతువని తెలిపియున్నారు. జగదాచార్యులైన భగవద్రామానుజులు ఆళ్వార్ల శ్రీసూక్తులలోని స్వారస్యమాధుర్యాల్ని అనుభవించి, నవనిధులవంటి తమ నవదివ్యగ్రంథములలో వానిని చొప్పిల్లచేసియున్నారు.

శంకర భగవత్పాదులు, ఆనందతీర్థాచార్యులు తాము మహామేధావులైనా, సకలశాస్త్రపారంగతులైనా శ్రుతివాక్యాలకు భగవత్ గీతాదులలోని శ్లోకాలకు సరసములైన అర్థాల్ని అనుగ్రహింపలేకపోయినారు - అని మధ్యస్థుల తీర్పు. దీనికి కారణ ఒకటియే. అది వారికి ఆళ్వార్ల శ్రీసూక్తులు కర్ణతాడితములు కాకుండుటయే. ఇది విజ్ఞుల నిర్ణయం. ఆళ్వార్ల శ్రీసూస్తులలోని మధురభావాల్ని భగవద్రామానుజులు తాము ప్రసాదించిన గ్రంథములలో ఎట్లు అనుభవించారో కొన్ని విషయముల ద్వారా తెలియవచ్చును. అందు కొన్ని మాత్రం -

1. జీవునకు జ్ఞానానందములు, శేషత్వం లక్షణము. వీనిలో అంతరంగ ధర్మమేది? అనుదానిని "**అడియేనుళ్లాన్**" అను జీవస్వరూప నిష్కర్ష సూక్తిద్వారా తమ ఆచార్యులైన తిరుక్కోట్టియూర్‌నంబి అనుగ్రహింపగా, కూరత్తాళ్వాన్ వలన తెలిసి, "**శేషత్వమే జీవునకు అంతరంగ ధర్మ**"మని శ్రీభాష్యంలో శ్రీరామానుజులు అనుగ్రహించారు. **శేషత్వే సతి జ్ఞాతృత్వం జీవలక్షణం** - అను శ్రీరామానుజుల దివ్యసూక్తిని అనుసరించియే శ్రీపిళ్లైలోకాచార్య స్వామివారు "**శేషత్వమే ఆత్మావుక్కు స్వరూపమ్ - శేషత్వమిల్లాద పోదు స్వరూపమిల్లై**" అని ముముక్షుప్పడిలోను,

**"అహమర్థత్తుక్కు జ్ఞానానందంగళ్ తటస్థమెన్నుంబడి దాస్యమితే అంతరంగ నిరూపకమ్"** అని శ్రీవచన భూషణదివ్యశాస్త్రంలోను కృపజేసినారు.

2. భగవద్గీతలో శిష్టాచారప్రాధాన్యాన్ని వివరించే **"స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే"** అను శ్లోకంలోని **'యత్'** శబ్దాన్ని ప్రమాణం అనుదానికి విశేషణంగా అన్వయించి, దేనిని ప్రమాణంగా స్వీకరిస్తారో - అని ఇతర భాష్యకారులు వివరించారు. భగవత్ భాష్యకారులయితే, **"యత్ప్రమాణమ్"** అనుదానిని సమస్త పదంగా గ్రహించి **"యావదధికం ప్రమాణమ్"** అని అభిభాషించినారు. దీనికి శ్రీగోదాదేవి అనుగ్రహించిన తిరుప్పావైలోని **"మేలైయార్ శెయ్వనగళ్ వేణ్డువన"** అను పాశురమే మూలము.

3. **"వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః"** అను భగవద్గీతా శ్లోకంలోని భావాల్ని తెలుపుతూ ఇతర భాష్యకారులు **"ఇదం సర్వం వాసుదేవః"** - ఈ ప్రపంచ మంతయూ వాసుదేవ స్వరూపం- అనే భావన కలిగిన వ్యక్తి దుర్లభుడని వ్యాఖ్యానించినారు. శ్రీరామానుజులు పైవిధంగా వ్యాఖ్యానింపక, **"మమ సర్వం వాసుదేవః"** - నాకు ధారకపోషక భోగ్యములంతయు వాసుదేవుడని భావించి, ప్రవర్తించే మహాత్ముడు సుదుర్లభుడని గీతాచార్యుని హృదయంగా, రసఘనంగా వివరించినారు. దీనికి ఆధారం - **"ఉణ్ణుమ్ శోఱు పరుగు నీర్ తిన్నుమ్ వె*ర్రి*లైయుమ్ ఎల్లామ్ కణ్ణన్"** అనే స్వామి నమ్మా*ళ్వా*ర్ తిరువాయ్మొ*ళి* దివ్య సూక్తియే. స్వామి నమ్మా*ళ్వా*ర్లను సేవింపక తన అవతార సమాప్తి అగుచున్నదని శ్రీకృష్ణభగవానుని నిర్వేదమట. శ్రీకృష్ణనిర్యాణానంతరం (అవతార సమాప్తి) మండలం తర్వాత నమ్మా*ళ్వా*ర్ల అవతారం కదా.

4. శరణాగతి గద్యలోని శ్రీరంగనాథుని దివ్యభూషణాన్ని వర్ణించునపుడు- **"కిరీట - మకుట - చూడావతంస"** అని మూడు భాగాలుగా కిరీటాన్ని భావించుట. స్వామి సౌలభ్య పరత్వ ప్రణయిత్వ సూచకమని, లోకాల్ని కొలచుట సౌలభ్యానికి, కిరీటధారణం పరత్వానికి, కిరీటమున కట్టు ముఖబంధం ప్రణయిత్వానికి సూచకమని స్వామిమణవాళమహామునుల ఆచార్యహృదయ వ్యాఖ్యానసూక్తి. దీనికి మూలం - **"పారళన్ద పేరరశే! ఎమ్విశుమ్బరశే! ఎమ్మై నీత్త వఞ్జిత్త ఓరరశే! అరుళాయ్"** అనే స్వామి నమ్మా*ళ్వా*ర్ల తిరువిరుత్త పాశురం (80)

5. చివరగా - భాష్యకారులు శ్రీరంగనాచ్చియార్ పురుషకార పురస్సరంగా నంబెరుమాళ్ సన్నిధిలో కైంకర్యలాభంకొఱకై శరణాగతి చేసి (గద్యలో) **"మదీయానాది.... మనోవాక్కాయై:"** ఇత్యాది చూర్ణికలచే స్థూలసూక్ష్మరూపమైన ప్రకృతిని, అహంకార మమకారములను తొలగించి, పరభక్త్యాదులను దాసునికి కల్గింపవలసినదని ప్రార్థించినారు. దీనికి ఆధారం - **"కణ్ణార్కడల్శూ*ழ்* అడియే నిడరై క్కళైయాయే"** అనే పెరియతిరుమొ*ழி*లోని దశకం (1-10) - అని వ్యాఖ్యాతృ సార్వభౌములైన పెరియవాచ్చాన్పిళ్ళైగారు ఏతత్‌దశక వ్యాఖ్యానావతారికలో కృపజేసి యున్నారు.

భగవద్రామానుజుల దివ్యసూక్తులలోని ప్రామాణికత స్వారస్యసామంజస్య ములు ఆ*ழ்*వ్వార్ల దివ్యసూక్త్యనుభవ సిద్ధములని గ్రహింపనగును. **"శ్రీమచ్ఛఠారి** గురువర్యసహస్రగీత్యాం శాస్త్రార్థసారసమవాయసమేధితాయామ్" ప్ర.భ. అణ్ణాస్వామి దివ్యసూక్తి. **"ఆరణశారమ్"** (వేదసారం) పెరియతిరుమొ*ழி* తనియన్. ఇట్టివి ఆ*ழ்*వ్వార్ల దివ్యసూక్తుల వైభవ ప్రాభవాలు. భగవద్రామానుజులు తమ దివ్య గ్రంథాలలో నిధినిధాయంగా నిక్షిప్తం చేసిన మహార్థాల్ని పండితపామరరంజకంగా అందించే శక్తి ఆచార్య కటాక్షంచే కొందఱికే స్వంతమవుతుంది. ఆ శక్తి **కాంచీ మహావిద్వాన్, మహామహిమోపాధ్యాయ, ఉ.వే. శ్రీమాన్ ప్ర.భ. అణ్ణంగరాచార్య స్వామివారికి** స్వంతమనుట సర్వవిదితం. శ్రీస్వామివారిని ఆ*ழ்*వ్వార్ - ఎంబెరు మానార్ - జీయర్ల సమిష్టి అవతారంగా విజ్ఞులు భావిస్తారు. లెక్కకు మించిన శ్రీవారి ఉపన్యాసాలు, గ్రంథములు, తమిళ తెలుగు సంస్కృత పత్రికలు పై విషయానికి తార్కాణం.

రాబోవు సంవత్సరం భగవద్రామానుజుల సహస్రాబ్ది. ఈ సందర్భంగా శ్రీవారివైభవప్రకాశకంగా ప్రపన్నులు అనేకకార్యక్రమాలు చేయాలి. యావత్ ప్రపంచ సంపూజ్యమాన చరణారవిన్దులైన శ్రీమత్ పరమహంసేత్యాది శ్రీశ్రీశ్రీ త్రిదండి **చిన్నజీయర్ స్వామివారు - 200 అడుగులకు పైగా ఔన్నత్యం గల శ్రీరామానుజుల (సమతామూర్తి)** విగ్రహాన్ని శంషాబాద్‌లోని **జీయర్ ఆశ్రమంలో** ప్రతిష్ఠింప **జేయు చున్నారు.** (సహస్రాబ్ది సందర్భంగా) ఇది సంప్రదాయ చరిత్రలో నొక అపూర్వఘట్టం,

సంస్తవనీయం. ఇట్లే, ఆయా ప్రాంతీయులు శ్రీరామానుజ వైభవాన్ని ప్రకాశింపజేసే అనేక కార్యక్రమాలు చేయుచున్నారు.

శ్రీరామానుజులు సహస్రాబ్దిని పురస్కరించుకొని ప్రపన్ననగరశ్రేష్ఠమైన విజయనగరంలోని త్రైవర్ణిక వైష్ణవరామానుజ గోష్ఠివారు ప్రపన్న గాయత్రిగా ప్రసిద్ధి నొందిన **"ఇరామానుశ నూఱ్ఱన్దాది"** దివ్యప్రబన్ధాన్ని 108 పర్యాయాలు సామూహికంగా అనుసంధానం చేయుచున్నారు. ఈ అనుసంధానం సకల ఫలప్రదం, శుభంకరం. పైకార్యక్రమాన్ని ప్రోత్సహిస్తూ నేతృత్వం వహించువారు- **ఉభయవేదాన్త విదుషీమణి, సుమధురవచోవిలాసం గల శ్రీమతి జానకమ్మగారు.**

ఈ అనుసంధాన కార్యక్రమశాత్తును (పూర్తిని) స్వాముల గోష్ఠితో, భక్తులతో దిగ్విజయంగా శ్రీపద్మనాభక్షేత్రంలో జరుపనుండుట ముదావహం. విజయనగర జిల్లాలోని ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలు శ్రీకూర్మం, పద్మనాభం, రామతీర్థం, వీటికి సమీపం లోగల (విశాఖ) సింహాచలం. పైవానిలో పద్మనాభక్షేత్రం పండితక్షేత్రం. ఉత్తరాంధ్ర పండిత త్రయంగా ప్రసిద్ధినొందినవారు ఉ.వే. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య స్వామి వారు, కందాళ వేంకటాచార్యస్వామివారు, తి.ప. రామచంద్రాస్వామివారు. పై ముప్పురిలో శ్రీభాష్యం స్వామివారు, కందాళం స్వామివారు ఈ దివ్యక్షేత్రంలోనే అవతరించారు. జగత్కారణంగా ఉన్న శ్రీమన్నారాయణుడు పద్మనాభ నామధేయంతో అర్చామూర్తిగా ఇచ్చటి పర్వతాన్ని అధిరోహించి, కల్పద్రుమంగా విరాజిల్లుతున్నాడు.

ఈ క్షేత్రంలో అవతరించిన శ్రీవేంకటాచార్యస్వామివారు చేసిన సంప్రదాయ సేవ వాచామగోచరం. విశేషంగా విజయనగరం గోష్ఠిని శ్రీస్వామివారు కటాక్షించిన రీతి నాన్యతోదర్శనీయం. ఈ గోష్ఠితో స్వామివారికి విడదీయరాని అనుబంధం. ఇక, రమ్యవాక్యవిశారదులైన శ్రీభాష్యం స్వామివారి శ్రీరామాయణ, తిరుప్పావై ప్రవచనాలతో ఆంధ్రప్రదేశ్ ధన్యతమమైనది.

ఈ సందర్భంగా నొక్క విషయాన్ని తెలుపవలసియున్నది. విజయనగర గోష్ఠి చాలా ధన్యతమం. కారణం - శ్రీవేంకటాచార్యస్వామి కటాక్షం శ్రీమతి జానకమ్మగారిద్వారా లభించుచున్నది. రామానుజసహస్రాబ్ది సందర్భంగా చేసే

ఇరామానుశనూఱ్ఱన్దాది అనుసంధాన కార్యక్రమానికి చిహ్నంగా ప్ర.భ. అణ్ణాస్వామి వారు అనుగ్రహించిన **"శ్రీరామానుజసూక్తిసుధ"**ను ప్రపన్నులకు ఉపాయనంగా ఈ గోష్ఠివారు తెలుగులో నందించుట ముదావహం.

అనేక దివ్యప్రబంధాలకు, సంప్రదాయ స్తోత్రాలకు అవతారికా సహిత విశేష వ్యాఖ్యలను కృపజేయుచున్న **పండితరత్న ఇత్యాది బిరుదాంచితులైన ఉ.వే. శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యస్వామివారు** దీనికి అనువాదకులగుట **"హేమ్న: పరమామోద:"** అనుట చర్విత చర్వణమే అగును.

**"శ్రీరామానుజసూక్తిసుధ"** గ్రంథముద్రణకు తమ పవిత్రద్రవ్యాన్ని సమర్పించి, కృతార్థులైన పై గోష్ఠిసభ్యులకు అస్మదారాధ్యదైవమైన స్వామి ఎమ్బెరుమానార్లు సకలశుభాలను ప్రసాదింపవలసినదిగా శ్రీవారి సన్నిధిలో ప్రణమిల్లుచున్నాను.

**"రామానుజో విజయతే యతిరాజరాజ:"**

ఇట్లు

భాగవత వశంవదుడు,

**కిడాంబి వేంకటాచార్యులు**

స్థానాచార్యులు

శ్రీమతే రామానుజాయ నమః



# శ్రీరామానుజ శ్రీసూక్తి సుధ

దివ్యసూరిప్రబంధోక్తి దీవ్యద్రత్నప్రకాశకాత్ ।
యతిరాజవచోవార్ధేః పీయూషం యత్ సముద్ధృతమ్ ॥
అణ్ణంగరార్యైః ద్రావిడ్యాం తదేతదాంధ్రభాషయా ।
శ్రీశింగరార్యదాసేన విబుధేభ్యో నివేద్యతే ॥



ప్రాధాన్యేన ప్రబంధే త్విహ యతిపతినా ద్రావిడామ్నాయవాచాం
సాహాయ్యేనైవ భాష్యాద్యనఘకృతితతిః నిర్మితేతి ప్రసిద్ధా ।
వార్తా యుక్త్యా ప్రమాణైరపి చ సువిశదం సంప్రతిష్ఠాప్యతే భోః
మాత్సర్యం దూరతోఽస్మిన్ విబుధజన ఇదం వీక్ష్య మోమోత్తు ధన్యః ॥

(ప్రధానంగా ద్రావిడవేద సూక్తుల సహాయంతోనే శ్రీరామానుజులు శ్రీభాష్యం, గీతాభాష్యం మొదలైన గొప్ప గ్రంథాలను రచించారు - అనే ప్రసిద్ధమైన మాట యుక్తులతో, ప్రమాణాలతో చాలా విశదంగా చక్కగా ప్రతిష్ఠింపబడుతున్నది. విబుధజనులు దీనిని గమనించి, అసూయను విడచి మిక్కిలి సంతోషింతురు గాక!)

శ్రీవైష్ణవసంప్రదాయంలో చాలా గొప్ప ప్రమాణంగా కీర్తింపబడుతున్న దివ్యప్రబంధం సంస్కృతవేదసమానమని, దానికంటె కూడా (ఒకవిధంగా) గొప్పది అని, శ్రీభాష్యకారులైన భగవద్రామానుజులు సైతం ఈ దివ్యప్రబంధాన్ని సహాయంగా చేసికొనే శ్రీభాష్యాది గ్రంథాలను అనుగ్రహించారు - అని అభిజ్ఞులైన పూర్వాచార్యుల నిర్ణయం. భగవద్రామానుజుల శ్రీసూక్తులను లోతుగా పరిశీలించే

వారు అరుదు. ఇతర భాష్యకారులకు స్ఫురించని మహార్థాలు శ్రీరామానుజుల శ్రీసూక్తులలో వందలకొలది కన్పిస్తాయి. ఈ రీతిగా కన్పించే సందర్భాలన్నీ ఆళ్వార్ల శ్రీసూక్తులను పురస్కరించుకొనే అనుగ్రహింప బడ్డాయి - అనే నిర్ధారణను పలు ప్రమాణాలతో, ఉపపత్తులతో ఈ గ్రంథం సుస్పష్టం చేస్తున్నది.

ఆళ్వార్లు అనుగ్రహించిన సకల దివ్యప్రబంధాలకు తనియన్‌లు ఆయా (దివ్యప్రబంధాన్ని అనుగ్రహించిన ఆళ్వార్లను, ప్రబంధాన్ని స్తుతించే పాశురాలు లేక, శ్లోకాలు) చాలాకాలంగా అనుసంధింపబడుతున్నవి. కొన్ని ప్రబంధాలకు ఒకటి రెండు తనియన్‌లు, కొన్ని ప్రబంధాలకు అయిదాఱు తనియన్‌లు ఉన్నాయి. నమ్మాళ్వార్లు అనుగ్రహించిన తిరువాయమొళ్లి ప్రబంధానికి సంస్కృతంలో తనియన్ ఒకటి, ద్రావిడంలో అయిదు తనియన్‌లు - మొత్తం ఆఱు తనియన్‌లు లోకంలో అంతటా అనుసంధింపబడుతున్నవి. **'మాఱన్ పణిత్త తమిళ్‌మఱైక్కు ఆఱఙ్గమ్ కూఱ అవతరిత్త'** (నమ్మాళ్వార్లు అనుగ్రహించిన ద్రావిడవేదానికి ఆఱు అంగాలుగా అవతరించిన), తిరుమంగై ఆళ్వార్లు అనుగ్రహించిన పెరియతిరు మొళ్లి దివ్యప్రబంధానికి సంస్కృతంలో తనియన్ ఒకటి, ద్రావిడంలో తనియన్‌లు మూడు మొత్తం నాల్గు తనియన్‌లు అనుసంధింపబడుతున్నవి. ప్రాయికంగా (సాధారణంగా) తనియన్‌లలో ఆయా దివ్యప్రబంధాల మహిమ, వాటిని అనుగ్రహించిన ఆళ్వార్ల మహిమ, ఆ ఆళ్వార్లు అవతరించిన దివ్యదేశాల గొప్పతనం మొదలైనవి చెప్పబడుతున్నాయి. తిరువాయ్‌మొళ్లి తనియన్‌లలో ఒకటి, పెరియ తిరుమొళ్లి తనియన్‌లలో ఒకటి చాలా విలక్షణమైన రీతిలో సాక్షాత్కరిస్తున్నాయి.

తిరువాయ్‌మొళ్లిలో ప్రబంధ తనియన్‌లలో- **"ఏయ్‌న్ద పెరుమ్‌కీర్తి ఇరామానుశమునితన్ వాయ్‌న్ద మలర్‌ప్పాదమ్ వణఙ్గుకిన్టేన్ ఆయ్‌న్ద పెరుమ్ శీరార్ శడకోపన్ శెన్దమిళ్ వేదమ్ తరిక్కుమ్ పేరాద ఉళ్ళమ్పెఱ"** (దోషం లేని గొప్ప కల్యాణగుణాలను పూర్ణంగా కలిగిన శఠకోపుల ద్రావిడ భాషారూపమైన, అందమైన వేదమును (తిరువాయ్‌మొళ్లి దివ్యప్రబంధమును) ధరించడంకోసం తగిన స్థిరమైన మనస్సును పొందడానికై తగిన గొప్ప కీర్తిని కల శ్రీరామానుజుల తామర పూలవంటి శ్రీచరణాలను ఆశ్రయిస్తున్నాను) అనే తనియన్ పాశురం శ్రీరామానుజుల

శ్రీచరణాలలో చేసే ప్రార్థనరూపంగా కనిపిస్తుంది. స్వామీ! భగవద్రామానుజా! తిరువాయ్‌మొళ్ళిని మరవకుండా ధరించదగిన సామర్థ్యాన్ని వరప్రసాదంగా అనుగ్రహించాలి - అని ఆళ్వార్లను ప్రార్థించడమే ఈ తనియన్‌లోని తాత్పర్యం.

పెరియతిరుమొళ్ళి దివ్యప్రబంధ తనియన్‌లలో **"ఎజ్గళ్ కదియే! ఇరామానుశమునియే! శజ్జై కెడుత్తాణ్డ తవరాశా! పొఱ్ఱు పుకళ్ మజ్జైయర్‌కోన్ ఈన్ద మఱైయాయిర మనైత్తుమ్ తజ్ఞ మనమ్ నీ ఎనక్కు త్తా"** (అనన్యగతికులమైన మాకు గతియైనవాడా! శ్రీరామానుజమునీ! శాస్త్ర సంశయాలను తీర్చి, అందరిని పాలించే యతిరాజా! వర్ధిల్లే యశస్సును కల తిరుమంగై ఆళ్వార్లు అనుగ్రహించిన వేయి పాశురాలను అన్నింటిని (పెరియతిరుమొళ్ళి ప్రబంధాన్ని) ధరించే మనస్సును నాకు నీవు కృపజేయాలి) అనే ఈ తనియన్ కూడా అదేరీతిలో అనుగ్రహింపబడినది. ఇది భగవద్రామానుజులను సంబోధిస్తూ రచింపబడింది. తిరుమంగై ఆళ్వార్ అనుగ్రహించిన పెరియతిరుమొళ్ళి ప్రబంధాన్ని ధరించగల్గిన మనస్సును అనుగ్రహించాలని శ్రీరామానుజులను ఉద్దేశించి సంబోధిస్తూ ఇందులో ప్రార్థన చేయబడింది.

ఈ రీతిలో ఈ రెండు తనియన్ పాశురాలను విశేషించి మనస్సులో మననం చేసినపుడు విలక్షణమైన ఆనందం మనస్సులో కల్గడమే కాక, భగవద్రామానుజుల అసదృశమైన ఒక గొప్పతనం కూడా తెలుస్తున్నది. దివ్యప్రబంధాలను తెలిసి ధరించ గల్గిన మనస్సును అనుగ్రహించాలి - అనే ప్రార్థనను నమ్మాళ్వార్లను ఉద్దేశించి చేసియుండవచ్చును, వారికి అంతరంగశిష్యులైన మధురకవులను ఉద్దేశించి చేసి ఉండవచ్చును. శ్రీమన్నాథమునులవంటివారిని ఉద్దేశించి చేసియుండవచ్చును. పరమోదారుడైన భగవానుని ఉద్దేశించి చేసి ఉంచవచ్చును. సకలవిధ సంపదలను అనుగ్రహించగలిగిన పెరియపిరాట్టియర్ (లక్ష్మీదేవి)ని ఉద్దేశించి చేసియుండ వచ్చును. (ఈ విషయానికి ఉదాహరణగా ఇరామానుశ నూఱ్ఱందాది లోని చివరి పాశురాన్ని గమనింపవచ్చు). ఇటువంటి మార్గాలను విడచిపెట్టి భగవద్రామానుజులను ఉద్దేశించి ఈ విధంగా ప్రార్థించడం ఎందువల్ల? అని పరిశీలించడం ఆవశ్యకం కదా! కొత్తగా మనం ఏమని చెప్పగలం! ఆ కాలంలో ఆళ్వార్ల శ్రీసూక్తులు అన్నీ భగవద్రామానుజార్య నిర్వాహ్యాలు - అని దీనివల్ల నిస్సందేహంగా తెలుస్తున్నది.

చాలా శ్రమపడి అధికరించి, పలుమార్లు అనువృత్తి చేసి ధరించవలసిన ఈ మహనీయమైన బ్రహ్మవిద్యను స్వామి భగవద్రామానుజులొక్కరే **'కలియుమ్ కెడుమ్ కణ్డుకొణ్మిన్'** (కలి కూడా నశిస్తుంది, చూడండి) అని ఆశాసించిన ఆళ్వార్ల పరమకృపవల్ల, **'ఆముదల్వన్ ఇవన్'** (అవును, సిద్ధాంత ప్రవర్తకుడు ఇతడు కాగలడు) అని అనుగ్రహించిన ఆళవన్దార్ యొక్క అద్భుతమైన అనుగ్రహాతిశయంవల్ల అనాయాసంగా గ్రహించి, ఎక్కడా ఏవిధమైన సందేహం, విస్మరణం లేకుండా ధరించారు - అనే విషయం సుస్పష్టం మవుతున్నది. లేకపోతే, ఈ తనియన్లు ఈ విధంగా అవతరించే అవకాశమే లేదు.

ఇంతేకాక, **'ఏయ్న్దపెరుమ్ కీర్త్తి'** అనే తనియన్కు తరువాత గల **'వాన్తికళుమ్ శోలై'** అని ఆరంభం అయ్యే తనియన్లో **'తమిళ్ మఱైకళ్ ఆయిరముమ్ ఈన్ద ముదల్ తాయ్ శడకోపన్ మొయ్మ్బాల్ వళర్త్త ఇదత్తాయ్ ఇరామానుశన్'** (ద్రావిడవేద రూపమైన వేయి పాశురాలను ప్రసవించిన మొదటి తల్లి శఠకోపులు, తన సామర్థ్యంతో వృద్ధిచేసిన పెంపుడుతల్లి శ్రీరామానుజులు) అని చెప్పబడింది. తిరువాయ్మొళిని ప్రసవించిన తల్లి నమ్మాళ్వార్లు అని, పెంచిన తల్లి శ్రీరామానుజులు అని ఆ కాలంలోని ఆప్తతములైన పూర్వాచార్యులు పలికారు అంటే, దివ్యప్రబంధాలపై భగవద్రామానుజులకు ఎంతటి అభినివేశం ఉండి ఉండాలి! దివ్యప్రబంధాలను అభ్యసించడంలో రుచి లేకుండా ఉండేవారిని బలవంతంగా పిలిచి అధ్యయనం చేయమని నియమించారు. వ్యాఖ్యానాలు అవతరించేటట్లు ఆజ్ఞను ఇచ్చారు. అక్కడక్కడ అరుదైన, అమూల్యాలైన అర్థనిర్వాహాలను వ్యక్తంచేశారు. దివ్యదేశాలలో ఆళ్వార్ సూక్తుల ప్రచారాన్ని బలోపేతం చేశారు. ఈవిధంగా చేసిన కృషిని గూర్చియే **'మొయ్మ్బాల్ వళర్త్త ఇదత్తాయ్ ఇరామానుశన్'** (తన సామర్థ్యంతో వర్ధిల్లజేసిన పెంపుడుతల్లి శ్రీరామానుజులు) అని పూర్వాచార్యులు అన్నారు.

ఆ కాలంలో శ్రీరామానుజులు అంతటి శ్రద్ధను తీసికొని ఉండి ఉండకపోతే దివ్యప్రబంధాలు శ్రీమన్నాథమునుల కాలానికి ముందు ఉన్నరీతిలోనే లుప్తమై పోయి ఉండేవి. ఆవిధంగా లుప్తం కాకుండా ఉండే రీతిలో శ్రీరామానుజులు చేసిన రక్షణకృత్యం వాచామగోచరం. 'సర్వదేశదశాకాలేష్వవ్యాహత పరాక్రమా, రామానుజార్య

దివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతామ్, రామానుజార్య దివ్యాజ్ఞా ప్రతివాసర ముజ్జ్వలా, దిగంతవ్యాపినీ భూయాత్ సా హి లోకహితైషిణీ' (అన్ని దేశాలలో, దశలలో, కాలాలలో అడ్డు లేని పరాక్రమాన్ని, అంటే - వ్యాప్తిని కల్గినదై శ్రీరామానుజుల దివ్యాజ్ఞ వర్ధిల్లాలి, అభివృద్ధిచెందాలి. ఆ ఆజ్ఞ దిగంతాల వరకు వ్యాపించినది కావాలి. లోకాల హితాన్ని కోరేది అది కదా) అనే శ్లోకాన్ని పల్లెలలో, పట్టణాలలో అంతటా దివ్యప్రబంధ సేవాకాల సమయాలలో అనుసంధిస్తున్నందువల్ల ఆ రామానుజార్య దివ్యాజ్ఞ దివ్యప్రబంధవిషయమే తప్ప వేఱు విషయాన్ని ఉద్దేశించినది కాదని స్పష్టపడుతున్నది.

## భగవద్భాష్యకార శ్రీసూక్తి వైలక్షణ్యం

గీతాభాష్యంలో కాని, శ్రీభాష్యంలోకాని శ్రీరామానుజులు అనుగ్రహించే శ్రీసూక్తులలో మనస్సు ద్రవించే రీతిలోని విలక్షణమైన శైలి గోచరిస్తుంది. ఈ అతిశయం వేఱే ఏ భాష్యంలోను ఈషణ్మాత్రంగా కూడా కనబడదు. ఆ విలక్షణశైలి ఏమి? అని అంటే, మూలంలో (గీతలో, బ్రహ్మసూత్రాలలో) పరమపురుషుని ప్రస్తావం చేయబడిన సందర్భాలలో ఆఌ్వారుల దివ్యసూక్తిచ్ఛాయలో ఆ భగవానుని స్వరూప, రూప, గుణ, విభూతి, విభవాలను వివరిస్తూ పలు విశేషణాలను ప్రయోగిస్తే తప్ప శ్రీరామానుజులకు తృప్తి కలుగదు. దీనికి ఒక సందర్భాన్ని కూడా ఉదాహరిస్తారు.

భగవద్గీతలోని తొమ్మిదవ అధ్యాయంలో చివరి శ్లోకంలో **"మన్మనా భవ మద్భక్తః"** అనే సూక్తి ఉన్నది. ఇందులో **"మన్మనా భవ"** అనే ప్రయోగానికి "నాపట్ల మనస్సును కలవాడవు కావాలి'' అని అర్థం. ఈ అర్థం అందఱికీ తెలిసినదే. సులభంగా తెలిసికోదగినదే - అనే భావంతో మధ్వభాష్యకారులు అర్థాన్ని ఏమీ తెలుపలేదు. ఏమీ వ్యాఖ్యానించలేదు. శ్రీశంకరాచార్యులవారు **"మయి - వాసుదేవే, మనః యస్య తవ స త్వం మన్మనా భవ"** అని వ్యాఖ్యానించారు. ఇక్కడ "నాపట్ల'' అనే దానికి "వాసుదేవుడనే నాపట్ల'' అని అర్థం అంటూ వివరించారు. ఇక, శ్రీరామానుజుల శ్రీభాష్యంలో గమనిస్తే, ఆ సందర్భంలోని పంక్తులను పఠిస్తే రాతిమనస్సు కలవానికి కూడా కన్నీరు ప్రవహిస్తుంది.

"మన్మనా భవ-మయి సర్వేశ్వరే, నిఖిలహేయప్రత్యనీక కల్యాణైకతానే, సర్వజ్ఞే, సత్యసంకల్పే, నిఖిలజగదేకకారణే, పరస్మిన్ బ్రహ్మణి, పురుషోత్తమే, పుండరీకదళమలాయతేక్షణే, స్వచ్ఛనీలజీమూతసంకాశే, యుగపదుదిత దినకర సహస్రసదృశతేజసి, లావణ్యామృతమహోదధౌ, ఉదారపీవరచతుర్బాహౌ, అత్యుజ్జ్వల పీతాంబరే, అమలకిరీట మకరకుండలహారకేయూర కటకభూషితే, అపారకారుణ్య సౌశీల్యసౌందర్యమాధుర్యగాంభీర్యౌదార్యవాత్సల్యజలధౌ, అనాలోచితవిశేషాశేషలోక శరణ్యే, సర్వస్వామిని తైలాధారావదవిచ్ఛేదేన నివిష్టమనా భవ" (సర్వేశ్వరుడను, సమస్తహేయగుణప్రత్యనీకుడను, సమస్తకల్యాణ గుణాలకు ఏకైకఆశ్రయ భూతుడను, సర్వజ్ఞుడను, సత్యసంకల్పుడను, సమస్త జగత్తుకు ఏకైకకారణమైన వాడను, పరబ్రహ్మను, పురుషోత్తముడను, పుండరీకదళాలవంటి స్వచ్ఛమైన విశాలమైన నేత్రాలను కలవాడను, స్వచ్ఛమైన నల్లని మేఘంవంటివాడను, ఒకేసారి వేయిమంది సూర్యులు ఉదయిస్తే ఎంత తేజస్సు ప్రకాశిస్తుందో అంతటి తేజస్సును కలవాడను, లావణ్యమనే (సముదాయశోభ - అనే) అమృతానికి మహాసముద్రం వంటివాడను, గొప్ప బలిష్ఠమైన నాల్గు బాహువులను కలవాడను, గొప్పగా ప్రకాశించే పీతాంబరాన్ని కలవాడను, అమలమైన కిరీటం, మకరకుండలాలు, హారాలు, అంగదాలు, కటకాలు- అనే వీటిచేత భూషితుడను, అంతు లేని కారుణ్యం, సౌశీల్యం, సౌందర్యం, మాధుర్యం, గాంభీర్యం, ఔదార్యం, వాత్సల్యం అనే వీటికి సముద్రంవంటివాడను, జన్మకాలజ్ఞానాది విశేషాలు వేనినీ గమనించకుండా సమస్త జగత్తు ఆశ్రయించదగిన గొప్ప శరణమైనవాడను, సర్వస్వామిని అయిన నా యందు తైలధారవలె అవిచ్ఛిన్నంగా మనస్సును నిలిపినవాడవు కావాలి) అని ఇంతటి అతి గంభీరంగా శ్రీరామానుజుల శ్రీసూక్తి అవతరించింది.

ఈ మహావాక్యంలో భగవానునిగూర్చిన విశేషణాలు పద్దెనిమిది ఉన్నాయి. ఇన్ని విశేషణాలు ఇక్కడ అవశ్యకాలా ? అని కొందఱు భావించవచ్చు. వాస్తవానికి ఆవశ్యకం కాదు- అని కూడా అనవచ్చు. సంగ్రహంలో తప్ప విస్తృతిలో రుచిలేని శ్రీరామానుజులు ఇంత విస్తృతంగా ఎందుకోసం ఏ కారణంవల్ల అనుగ్రహించారు? అని కొంచెం ఆలోచించాలి. శ్రీవైష్ణవులలో కూడా పలువురు దీనికి మూలకారణాన్ని తెలియరు - అని నేను తలుస్తున్నాను. భగవద్రామానుజులు "పణ్డఱు మాఱన్ పశుమ్ తమిழ் ఆనన్దమ్ పాయ్ మదమాయ్ విణ్డిడ ఎజ్గళ్ ఇరామానుశ ముని

**వేழம్"** (మాకు విధేయమైన భగవద్రామానుజ భద్రగజం నమ్మాழ்వార్లు. రాగాత్మకంగా అనుగ్రహించిన, అందమైన ద్రావిడవేదం అయిన తిరువాయ్మొழி ప్రబంధంవల్ల కలిగిన ఆనందమే మదజలమై ప్రవహించగా) అని, **"కలిమిక్క శెన్నెల్ కழని క్కుఱైయిల్ కలై పెరుమాన్ ఒలిమిక్క పాడలై యుణ్డు తన్నుళ్ళమ్ తడిత్తు అదనాల్ వలిమిక్క శీయమ్ ఇరామానుశన్"** (నీటి ప్రవాహాన్ని మెండుగా కల్గిన, ఎట్టుని ధాన్యం పండే సస్యక్షేత్రాలను కల తిరుక్కుఱైయలూర్ అనే దివ్యదేశంలో అవతరించినవారు, శాస్త్రాలు అని చెప్పదగిన దివ్యప్రబంధాలను అనుగ్రహించిన గొప్పతనాన్ని కల తిరుమంగైయాழ்వార్ల యొక్క, అతిశయించిన రాగాలను కల పెరియతిరుమొழி దివ్యప్రబంధాన్ని అనుభవించి, తమ మనస్సులో ఉబ్బి తబ్బిబ్బై, అందువల్ల మిక్కిలి బలాన్ని పొందిన సింహంవంటి శ్రీరామానుజులు) అని ఇరామానుశ నూற்றన్దాది ప్రబంధంలో అముదనార్ అనుగ్రహించిన రీతిలో ఆழ்వార్ల దివ్యసూక్తివారిధిలో అనవరతం అవగాహించిన వారు కనుక, దాని పర్యవసానంగా ఇటువంటి శ్రీసూక్తులను శ్రీరామానుజులు పలుమార్లు అనుగ్రహించడం జరిగింది. శ్రీకృష్ణుడు తనపట్ల భక్తిని కల్గి ఉండమని విధించే పూర్వోక్త గీతాసూక్తిలో ఆ భగవానుని విషయంలో ఇన్ని విశేషణాలను ప్రయోగించకపోతే అతనిపట్ల భక్తి ఏ విధంగా స్థిరంగా కలుగుతుంది? ఆ భగవానుని స్వరూపవైలక్షణ్యాన్ని, దివ్యమంగళవిగ్రహసౌందర్యాన్ని పలు విశేషణాల ప్రయోగం ద్వారా ప్రదర్శించడం ఏవిధంగా ఉన్నది? అంటే శ్రీకృష్ణుడు స్వయంగా వాటిని ప్రదర్శించి, వివరించి, వాటిలో అభినివేశాన్ని పొందమని పలికేటట్లుగా ఉన్నది. ఇతర భాష్యాలను రచించినవారికి దివ్యప్రబంధసంబంధం ఏ మాత్రం లేనందు వల్లనే వారు ఇటువంటి విశేషణాలను ఎక్కడా ప్రయోగించే ప్రసక్తి లేకుండా పోయింది.

ఇదే విధంగా, శ్రీభాష్యంలో కూడా ఒక సందర్భాన్ని ఉదాహరిస్తాను. చివరి సూత్రం **"అనావృత్తిశ్శబ్దా దనావృత్తి శ్శబ్దాత్"** అని ఉన్నది. ఇక్కడ మూలంలో పరమపురుషుని గూర్చిన ప్రస్తావనమే కన్పించదు. పరమపదాన్ని పొందిన ముక్తులు తిరిగి ఈ భూలోకానికి తిరిగి రావడం అనేది ఉన్నదా? లేదా? అనే సందేహాన్ని తీర్చడం కోసం ఈ సూత్రం అవతరించింది. ముక్తునకు "పునరావృత్తి లేదు- అని శాస్త్రం చెప్పినందున, (పునరావృత్తి) లేదు'' అని ఏతావన్మాత్రమే

సుమా! అని తెలుపబడింది. ఈ సూత్రాన్ని వివరించేటపుడు భగవద్రామానుజులు "పరమపురుషుడనేవాడొకడున్నాడని ఏ శాస్త్రం తెల్పుతున్నదో ఆ శాస్త్రమే భగవానుని పొందినవారికి పునరావృత్తి లేదు- అని తెలుపుతున్నది'' అని అన్నారు. ఇక్కడ **"యథా పరమపురుషః అస్తీతి శబ్దా దవగమ్యతే"** అని ఇంతమాత్రం పల్కి ఉంటే సరిపోతుంది. అయినా, శ్రీరామానుజులు అనుగ్రహించిన భాష్యాన్ని గమనించండి. **"యథా నిఖిలహేయ ప్రత్యనీకకల్యాణైకగుణః, జగజ్జన్మాదికారణం, సమస్తవస్తు విలక్షణః, సర్వజ్ఞః, సత్యసంకల్పః, ఆశ్రితవాత్సల్యైకజలధిః, నిస్సమాభ్యధికసంభావనః, పరమకారుణికః, పరమాత్మాభిధానః, పరమపురుషోఽస్తీతి శబ్దాదవగమ్యతే"** (సమస్త దోషాలకు ప్రతిభటుడు, అన్ని కల్యాణగుణాలకు అద్వితీయమైన ఆశ్రయం, జగత్తుయొక్క సృష్టి మొదలైనవానికి కారణం, సమస్త వస్తువులకంటే విలక్షణుడు, సర్వజ్ఞుడు, సత్యసంకల్పుడు, ఆశ్రితవాత్సల్యమనే కల్యాణగుణానికి అద్వితీయమైన సముద్రం, తనతో సమానుడుగాని, అధికుడు గాని వేఱొకడున్నాడనే సంభావనకు అవకాశం లేనివాడు, పరమకారుణికుడు, పరబ్రహ్మమనే పేరును కలవాడయిన పరమపురుషుడు ఉన్నాడని ఏవిధంగా వేదంవల్ల అవగతమవుతున్నదో'' అని ఇన్ని విశేషణాలను అనుగ్రహించారు.

ఈ విధంగా ఒక సందర్భంలో కాదు; పలు పలు సందర్భాలలో గమనింప వచ్చు. మిగిలిన భాష్యకారులకు ఇటువంటి వాక్యవిన్యాసాన్ని చేయడం తెలియక పోలేదు. భగవానునిపట్ల వారికి భక్తి లేకుండాను పోలేదు. అయినా, వారిచేతినుండి నుండి ఇటువంటి శ్రీసూక్తులలో ఏకదేశం అయినా అవతరించిన సందర్భం ఒక్కటికూడా కానరాదు. **"శెన్దామరై త్తడఙ్కణ్ శెఙ్గనివాయ్ శెఙ్గమలమ్ శెన్దామరై అడిక్కళ్ శెమ్బొన్ తిరువుడమ్బే"** (విశాలమైన నేత్రాలు, ఎఱ్ఱ తామరలవంటివి, పెదవి ఎఱ్ఱని దొండపండు, ఎఱ్ఱని తామరపూవులవంటివి శ్రీచరణాలు, అందమైన బంగారం వంటిది తిరుమేని) అని, **"కైవణ్ణమ్ తామరై వాయ్ కమలమ్ పోలుమ్ కణ్ణిణైయుమ్ అరవిన్దమ్ అడియు మవతే"** (శ్రీహస్తాల తీరు తామరలవంటిది, ముఖం కమలంవంటిది, నేత్రద్వయం కూడా అరవిందమే, శ్రీచరణాలు కూడా తామరపూలే) అని, **"శెక్కమలత్తలర్పోలుమ్ తిరుమేనియడి కళుక్కే"** (స్వామి యొక్కనేత్రాలు, శ్రీహస్తాలు, శ్రీచరణాలు ఎఱ్ఱని తామరలవంటివి, పెదవి ఎఱ్ఱని దొండపండు, ఆ కమలంయొక్క ఆకు(రంగు) వంటిది తిరుమేని) అని పలికిన

ఆళ్వార్ల ఆర్ద్రహార్దవచనాలలో పూర్ణంగా అవగాహించిన ఆచార్యులకే ఇటువంటి శ్రీసూక్తి విన్యాసవైభవం సంభవిస్తుంది.

శ్రీరామానుజులకు ముందున్న ఆళవన్దార్ మొదలైనవారు, తరువాత గల కూరేశులు, భట్టర్ మొదలైనవారుకూడా తాము కృతులను రచించడం ఎందుకంటే -ఆళ్వార్ల పట్ల తమకు గల ప్రావణ్యాతిశయాన్ని వ్యక్తం చేయడంకోసం, ఆళ్వార్ల శ్రీసూక్తులలో తాము అపూర్వంగా దర్శించిన అర్థాలను గూర్చి తెలుసుకోవడం కోసమే - అనే వాస్తవాన్ని కొందఱు భాగ్యశాలురే కదా గ్రహిస్తారు. **"తేనావలోక్య కృతినః పరిభుంజతే తం తత్రైవ కేఽపి చపలా శ్శలభీభవంతి"** (శాస్త్రమనే గొప్ప దీపంతో అదృష్టశాలురు భగవానుని దర్శించి, అతనిని అనుభవిస్తున్నారు. కొందఱు చపలబుద్ధిని కలవారు మాత్రం ఆ దీపంలోనే మిడతల వంటివారు అవుతున్నారు. ప్రకాశించే దీపంలో పడి మిడతలు నశించి పోయేటట్లుగా వేదరూప శాస్త్రాన్ని సరిగా తెలియలేక చపలురు కొందఱు దానికి అపార్థాలను పల్కి నశిస్తున్నారు) అని భట్టర్ పలికిన సూక్తి ఇక్కడ పొసగుతుంది.

## శ్రీరామానుజుల సూక్తులలో విశేషావధానం

భగవద్రామానుజులు భగవానుని విషయంలో ప్రయోగించిన విశేషణాలలో ఒక్కొక్కదానిని బాగా నిశితంగా గమనించి చూస్తే, అవి ఆళ్వార్ల శ్రీసూక్తులను అనుసరించియే వారిచే ప్రయోగింపబడ్డాయి- అని సులభంగా నిర్ణయించవచ్చు. అయితే ఈ నిర్ణయం సామాన్యంగా అందఱికీ సులభం కాదు. దివ్యప్రబంధంలో ప్రవేశం లేనివారికి ఇది తెలిసే ప్రసక్తి లేనే లేదు. ఇందులో (దివ్యప్రబంధంలో) పరిపూర్ణప్రవేశాన్ని కలవారుకూడా భగవద్భాష్యకార శ్రీసూక్తులలో విశేషించి ఈ దృష్టిలో అవధానాన్ని కలిగి ఉండడం లేదు. కనుక, ఈ అతిశయాన్ని వారు తెలియలేకపోతున్నారు. కొందఱు శ్రీభాష్యాన్ని అధ్యయనం చేసి, దాని ప్రవచనంలోనే దృష్టిని కల్గి ఉన్నారు. మఱికొందఱు భగవద్విషయంలో (తిరువాయ్ మొళి దివ్యప్రబంధవ్యాఖ్యలో) మాత్రమే దృష్టిని కలిగియున్నారు. ఈవిధంగా ఏదో ఒక దానిలో, అంటే- శ్రీభాష్యంలో, లేక, భగవద్విషయంలో మాత్రమే అభినివేశం కల్గి ఉండడం కాకుండా, రెండింటిలో సమానమైన ప్రవేశం, అభినివేశం, విమర్శ కలవారైన నమ్బిళ్లై మొదలైన మన పూర్వాచార్యులు అవతారపురుషులు

కనుక సర్వజ్ఞులై భాసిల్లి, ఉభయవేదాంతాలనే అమృతసాగరంలో పూర్ణంగా అవగాహించి, రెండింటిని సమన్వయిస్తూ ఆశ్చర్యకరమైన అనుభవాన్ని కలవారై, తమ శిష్యులను కూడా ఆ విధంగా అనుభవింపజేసేవారయ్యారు.

ఆచార్యహృదయమనే దివ్యశాస్త్రంలో **"భాష్యకారర్ ఇతు కొణ్డు సూత్రవాక్యజ్గళ్ ఒరుజ్గవిడువర్"** (శ్రీభాష్యకారులు తిరువాయ్‌మొழிని గ్రహించి బ్రహ్మసూత్ర వాక్యాల సమన్వయం చేశారు) అనే ఒక సూక్తి ఉన్నది. దీనిని శ్రీమణవాళ మహామునులు **"భాష్యకారర్ శ్రీభాష్యమ్ పణ్ణియరుళుమ్బోదు సూత్రవాక్యజ్గళిల్ సందిగ్ధజ్గళాన అర్థజ్గళై యెల్లామ్ ఇప్పబంధత్తిల్ సూక్తికళై క్కొణ్డు నిర్ణయిత్తు ఒరుజ్గవిట్టరుళ్‌వర్- ఎన్టై"** (భాష్యకారులు శ్రీభాష్యాన్ని రచించేటపుడు సూత్రవాక్యాలలో సందిగ్ధాలైన అర్థాలను అన్నిటినీ ఈ ప్రబంధంలోని సూక్తులతో నిర్ణయించి అన్వయిస్తారు- అని భావం) అని వ్యాఖ్యానించారు.

అయితే, ఈ విషయం తత్త్వజిజ్ఞాసువుల మనస్సులో చక్కగా నిలిచేటట్లుగా కొన్ని సందర్భాలను అయినా ఉదాహరించి చూపవలసి ఉన్నది. ఆ విధంగా మూలంలో ప్రదర్శింపబడకపోయినా, వ్యాఖ్యానంలోనైనా చూపి ఉండాలి. పైన ఉదాహరింపబడ్డ వ్యాఖ్యాన శ్రీసూక్తిలో మూలానికి అర్థం తెలుపబడిందే తప్ప, దానికి నిదర్శనంగా ఏ సందర్భం ప్రదర్శింపబడలేదు. పరమకారుణికులై, సర్వజ్ఞులైన పూర్వాచార్యులు కూడా తమ దివ్యగ్రంథాలలో ఈ విధంగా ప్రతిజ్ఞను మాత్రం చేసి, దీనికి నిదర్శనాలను చూపడం ఉపదేశపరంపరలో మాత్రమే చేస్తూ వచ్చారు తప్ప, తమ గ్రంథాలలో గ్రంథస్థం చేయలేదు. దీనిని రస్యరహస్యార్థంగానే భావించి, అషట్కర్ణక్రమంలో పెట్టి, గోప్యంగా రక్షిస్తూ వచ్చారు తప్ప గ్రంథరూపంలో ప్రకాశింపజేయలేదు. వేదాంతదేశికులు **"రంగాస్థానే రసికమహితే రంజితాశేషచిత్తే విద్వత్సేవావిమలమనసా వేంకటేశేన"** (రసికుల సాన్నిధ్యంవల్ల గొప్పది, అందఱి మనస్సులను రంజింప చేసేది అయిన శ్రీరంగంలో గల విద్వాంసులను సేవించడం వల్ల నిర్మలమైన బుద్ధిని కల వేంకటేశునిచేత) అని తామే స్వయంగా పలికే రీతిలో అటువంటి మహాత్ముల శ్రీచరణ సాన్నిధ్యంలో ఉంటూ, పూర్ణంగా సద్వృద్ధులను ఉపాసించినవారు కనుక తమ అనుభవాన్ని **"శెయ్యతమిழ்మాలై నామ్ తెళియ ఓది త్తెళియాద నిలైకళ్ తెళికిన్టోమే"** (ఋజువైన ద్రావిడ మాలికలను మేము అధ్యయనం చేసి, అంతకు ముందు తెలియని అర్థాలను తెలిసికొన్నాము) అని నిశ్చప్రచంగా పలికినారు.

ఆ విధంగా పలికిన ఆ మహాచార్యులను ఆ కాలంలో ఉండే జ్ఞానులు దర్శించి- "స్వామీ! ద్రావిడ పాశురాలను స్పష్టంగా అధ్యయనం చేసి అంతకు ముందు తెలియలేని శాస్త్రార్థాలను తెలియగల్గినట్లుగా పలికారు కదా! ఆవిధమైన సందర్భాలను కొన్నిటిని అయినా మాకు ఉపదేశించకూడదా?'' అని అడిగి ఉండకపోరు. ఆ విధంగా ప్రార్థించినవారికి శ్రీదేశికులు పరమతృప్తికరంగా సమాధానాన్ని అనుగ్రహించి ఉండకపోరు. కేవలం ప్రతిజ్ఞను చేసి, తావన్మాత్రంతో ఊరుకునేవారుకారుకదా మన పూర్వాచార్యులు! గ్రంథాలలో ప్రతిజ్ఞను చేసిన విషయాన్ని తమ శ్రీచరణాలను ఆశ్రయించిన అంతరంగ శిష్యులకు అద్భుతంగా ఉపపాదించి నిరూపించగలిగిన సామర్థ్యం కలవారు. ఈ అర్థాలు **"పూర్వే పూర్వేభ్యో వచ ఏతదూచుః"** అని వేదం పల్కిన క్రమంలో ఉపదేశపరంపరగానే అనువర్తించాలి- అనే భావనతో గ్రంథస్థం చేయలేదు. ఈ వాస్తవాన్ని తెలియనివారు విపరీతంగా పలికి అనర్థాన్ని పొందుతున్నారు. అందువల్ల ప్రస్తుతం ఆ అర్థాలలో కొన్ని ఇక్కడ ప్రస్తావించవలసిన ఆవశ్యకత ఏర్పడింది.

శ్రీరామానుజుల శ్రీసూక్తులను లోతుగా పరిశీలించి చూచినపుడు వాటిలో రెండు విధాలైన విశేషాలను గ్రహించే అవకాశం ఉన్నది. (1) పలు సూక్తులతో ఆళ్వార్లను కీర్తించడం, (2) పలు సూక్తులతో వారి దివ్యసూక్తుల వల్ల లభించిన విశేషార్థాలను తాము ఆదరించడం. ఈ విధంగా ఈ రెండు విశేషాలు శ్రీవైష్ణవ గోష్ఠిలో విశేషించి అనుభవిందగిన అపూర్వదివ్యామృతాలని దృఢంగా భావించాలి. రుచిని కలిగిన ఆస్తికులకు ఈ అనుభవం లభించాలంటే దాసుని ఉపన్యాసాల నుండి, గ్రంథాలనుండి పొందవచ్చు.

## మన పూర్వాచార్యుల ఉభయవేదాంతాచార్యత్వం

ద్రావిడవేదాన్ని మొట్టమొదటగా ఈ లోకంలో విస్తృత ప్రచారానికి తీసికొనివచ్చినవారు శ్రీమన్నాథమునులు. లోపించిన మూలాన్ని పునరుద్ధరణ చేయడంలోనే వారి జీవితకాలం సరిపోయింది. ఆళవన్దార్ కాలంలోనే ద్రావిడవేదంయొక్క అర్థప్రవచనం ప్రారంభమైనదని చెప్పవచ్చు. **"మాఱనురై శెయ్ద తమిళ్మఱై వళర్త్తోన్ వాళియే"** (నమ్మాళ్వార్లు అనుగ్రహించిన ద్రావిడవేదాన్ని వర్ధిల్లజేసినవానికి మంగళం) అని కీర్తింపబడే భగవద్రామానుజుల

కాలంలోనే ద్రావిడవేదాంతప్రచారం ఉన్నతదశను పొందింది - అని స్పష్టంగా తెలుస్తున్నది. శ్రీవైష్ణవులకు ఉభయవేదాంత ప్రవర్తకాచార్యులనే బిరుదును ప్రయోగించేటట్లు నియమించినది భగవద్రామానుజులే - అని పలు నిదర్శనాలతో తెలిసికోవడానికి వీలయినా, భగవద్రామానుజులను గూర్చిన ఒక శ్లోకరత్నం ఈడు ముప్పత్తాఱాయిరప్పడి వ్యాఖ్యకు గల అడైయవళైన్దాన్ అరుమ్బద వివరణం మొదలైన గ్రంథాలలో గోచరిస్తున్నది. ఆ శ్లోకం ఏది? అంటే-

**"పురా సూత్రైః వ్యాసః శ్రుతిశతశిరోఽర్థం గ్రథితవాన్**
**వివవ్రే తచ్ఛ్రావ్యం వకుళధరతా మేత్య చ పునః ।**
**ఉభావేతౌ గ్రంథౌ ఘటయితు మలం యుక్తిభి రసౌ**
**పునర్జజ్ఞే రామావరజ ఇతి స బ్రహ్మముకురః"**

ఈ శ్లోకభావం ఏమంటే- ఉపనిషత్తులలో ఉండే అర్థాలను మొట్టమొదగా వ్యాసభగవానులు శారీరకమీమాంస అనే బ్రహ్మసూత్రాలతో కూర్చారు. ఆ వ్యాసుడే తిరిగి వకుళాభరణులుగా అవతరించి, శ్రావ్యమైన సూక్తులతో ఆ బ్రహ్మసూత్రాలను వివరించారు. ఈ రెండు దివ్యగ్రంథాలను యుక్తంగా సమన్వయించి నిర్వహించడం కోసం ఆ వ్యాసుడే మళ్ళీ భగవద్రామానుజులుగా అవతరించారు.

ఈ శ్లోకాన్ని ముదలియాణ్డాన్ (దాశరథి- శ్రీరామానుజులు మేనల్లుడు) రచించారని, ఎమ్బార్ (గోవిందభట్టర్ - శ్రీరామానుజులకు పినతల్లి కుమారుడు) రచించారని చెప్పబడుతున్నది. శ్లోకం చాలా గంభీరమైనది. విషయం యథార్థ మైనది. దీనిని అనుసరించే ఆచార్యహృదయంలో **"భాష్యకారర్ ఇతు కొణ్డు సూత్రవాక్యఙ్గళ్ ఒరుఙ్గవిడువర్"** అని తెలుపబడింది. ఇదే అర్థంలో వేదాంత దేశికులు కూడా పలు సూక్తులను అనుగ్రహించారని అనడం పిష్టపేషణం, చర్విత చర్వణమే కాగలదు.

### భగవద్రామానుజులు చేసిన 'సాధు' శబ్దార్థ వివరణం

భగవద్గీతలోని **"పరిత్రాణాయ సాధూనామ్" (4-8)** అనే సూక్తికి భాష్యాన్ని అనుగ్రహించేటప్పుడు శ్రీరామానుజులు, సాధువులంటే ఎవరు? అనే విషయాన్ని వివరిస్తూ, ఆళ్వార్లే సాధువులు - అని స్పష్టమైన శబ్దాలతో వివరించారు.

**"కాణవారాయ్ ఎన్రెన్ఱు కణ్ణుమ్ వాయుమ్ తువర్న్దు"** (కంటికి దర్శనమిచ్చేటట్లు రావాలి- అని కళ్ళు, నోఱు ఎండిపోయేటట్లు పిలచి), **"ఒరు పకల్ ఆయిర మూழியాలో"** (ఒక పగలు వేయి కల్పాల కాలం, అయ్యో!) అని క్లేశపడి, **"నినైన్దునైన్దుళ్ కరన్దురుకి"** (భావించి క్లేశపడి మనస్సులోపల కఱిగి) ఉండే ఆழ்వార్లే సాధువులనదగినవారు. ఈ సందర్భంలో శ్రీరామానుజులు అనుగ్రహించిన వ్యాఖ్యానపంక్తులు పరమభోగ్యాలు. ఇటువంటి వివరణం శంకరభాష్యాదులలో కొంచెం కూడా కన్పించదు. ఈ పంక్తులు దివ్యసూక్తిరసికులకు నిత్యం అనుసంధేయాలు. గీతాభాష్యంలోని ఆ సందర్భంలో శ్రీరామానుజుల సూక్తులు ఈవిధంగా ఉన్నాయి- **"సాధవః - ఉక్తలక్షణధర్మశీలాః వైష్ణవాగ్రేసరాః మత్సమాశ్రయణే ప్రవృత్తాః మన్నామకర్మస్వరూపాణాం వాఙ్మనసాగోచరతయా మద్దర్శనే వినా స్వాత్మధారణపోషణాదికమలభమానాః క్షణమాత్రంకాలం కల్ప సహస్రం మన్వానాః ప్రశిథిలసర్వగాత్రాః భవేయురితి మత్స్వరూపచేష్టితావలోక నాలాపాది దానేన తేషాం పరిత్రాణాయ"** (సాధువులంటే -ఇతఃపూర్వం చెప్పబడ్డ లక్షణంలోని ధర్మాలను సహజంగా కలవారు, వైష్ణవులలో (విష్ణుభక్తులలో) అగ్రేసరులు, నన్ను ఆశ్రయించడంలో ఉద్యుక్తులైనవారు, నా నామాలు, లీలలు, రూపాలు, వాక్కులు, మనస్సుకు అందనివి అయినందువల్ల, నా దర్శనం పొందకపోతే తమ ఆత్మయొక్క ధారణ, పోషణ మొదలైనవానిని పొందలేనివారై, క్షణమాత్రకాలాన్ని కూడా వేయికల్పాలుగా తలచేవారై, మిక్కిలి శిథిలమైన సమస్తశరీరాన్ని కలవారై ఉంటారు కనుక, వారికి నా స్వరూప- రూప- లీలల దర్శనం, సంకీర్తనం మొదలైనవానిని అనుగ్రహించడంద్వారా వారిని పరిపూర్ణంగా రక్షించడంకోసం - అని ఈ సూక్తి భావం.)

ఈగీతాభాష్య పంక్తులు ఆழ்వార్ల స్వభావాలను, వారి సూక్తులను అనుసరించి రచింపబడినవి. పై భాష్యంలోని పంక్తులు కొంచెం వివరింపబడు తున్నాయి.

**"వైష్ణవాగ్రేసరాః"** అనేది ఇక్కడ విశేష్యవాచకపదం. శ్రీవైష్ణవ సంప్రదాయంలో అగ్రేసరులు ఆழ்వార్లే అనేది నిర్వివాదం. మిగిలిన విశేషణాలు అన్నీ వారికే పొసగి వారినే నిర్దేశించినవై ఉన్నాయి. ఏవిధంగా? అంటే -**"ఉక్తలక్షణ ధర్మశీలాః"** -

**"యదా యదా హి ధర్మస్య"** అనే గీతాశ్లోకంలో **"ధర్మస్య వేదోదితస్య చాతుర్వర్ణ్య చాతురాశ్రమవ్యవస్థయా అవస్థితస్య"** (ధర్మం యొక్క, అంటే, వేదంలో చెప్పబడిన బ్రాహ్మణాది నాల్గు వర్ణాలయొక్క బ్రహ్మచర్యాది నాల్గు ఆశ్రమాలయొక్క వ్యవస్థారూపంలో ఉండే ధర్మం యొక్క- అని అర్థం.) అని శ్రీరామానుజులు అనుగ్రహించినందువల్ల అదే ఇక్కడ **"ఉక్తలక్షణధర్మ"** అనే ప్రయోగంతో పరామర్శింపబడింది. ఆఴ్వార్లు వేదోక్తాలైన వర్ణాశ్రమ ధర్మాలను కొంచెం కూడా అతిక్రమించనివారు- అని దీనివల్ల తెలుపబడింది. శ్రీదేశికులు రహస్యత్రసారంలోని ప్రభావ వ్యవస్థాధికారంలో **"ఆఴ్వార్ కళుడైయ వృత్తానజ్గళై యు మారాయ్న్దాల్ అవర్కళ్ స్వజాతినియమత్తై కడన్దమైయిల్లై"** (ఆఴ్వారుల వృత్తాంతాలను పరిశీలిస్తే వారు తమ జాతినియమాలను దాటినది లేదు) - అని పల్కడం ఇక్కడ ఈ సందర్భానుగుణంగా అనుసంధేయం.

**(మత్సమాశ్రయణే ప్రవృత్తాః)** - **"తుయిరఱు శుడరడి తొఴుదెఴు ఎన్మననే!"** (ఓ మనసా! క్లేశహరమైన ప్రకాశించే భగవచ్చరణారవిందాన్ని నమస్కరించి ఉజ్జీవించు.) అని, **"ఆఴివణ్ణా! నిన్నడియిణై యడైన్దేన్"** (సముద్ర వర్ణా! నీ పాదద్వయిని ఆశ్రయించాను) అని పల్కి భగవత్సమాశ్రయణంలో ఉద్యుక్తులైనవారు ఆఴ్వార్లు.

**(మన్నామకర్మ స్వరూపాణాం వాజ్మనసా గోచరతయా)** - భగవానుని తిరునామాలను, చేష్టితాలను, స్వరూపాన్ని గూర్చి స్తుతించడం ఆరంభించి, **"ఎన్శొల్లి చ్చొల్లుకేన్?"** (ఏమని వర్ణించగలను?) అని, **"నెఞ్జాల్ నినైప్పరితాల్ వెణ్ణె యూణెన్ను మీనచ్చొల్లే"** (వెన్నను దొంగలించి ఆరగించాడనే హీనమైన మాటసైతం జ్ఞానసంకోచం లేని నిత్యసూరులకు కూడా మనస్సుకుసైతం దుర్లభం. ఆహా!) అని వాక్కుకు, మనస్సుకు అందనివి- అని పలికినవారు ఆఴ్వార్లే.

**(మద్దర్శనేన వినా స్వాత్మధారణ పోషణాదిక మలభమానాః)** - **"తొల్లై మాలై క్కణ్ణార క్కణ్డు కఴివదోర్ కాదలుఱ్ఱార్క్కుమ్ ఉణ్డో కణ్గళ్ తుఞ్జుదలే?"** (నిరుపాధికమైన వాత్సల్యాన్ని కలిగిన స్వామిని కన్నులార దర్శించి కాలక్షేపం చేయాలనే అద్వితీయమైన అభినివేశాన్ని కలవారికి నిద్ర అనేది ఉన్నదా?) అని, **"కాణవారాయ్ ఎన్తెన్ను కణ్ణుమ్ వాయుమ్ తువర్న్దు"** (కంటికి గోచరుడవు

అయేటట్లు రావయ్యా! అని నేత్రాలు, నోరు ఎండిపోగా, ఆక్రందించి) అని పల్కి కన్నులారా దర్శిస్తే తప్ప ధరించలేనివారు ఆళ్వార్లే.

**(క్షణమాత్రకాలం కల్పసహస్రం మన్వానాః) "ఒరు పకల్ ఆయిర మూళియాలో!"** (ఒక పగటికాలం వేయి కల్పాలుగా ఉన్నది, అయ్యో!) అని, **"ఊళియిల్ పెరితాల్ నాళిగైయెన్నుమ్"** (కల్పం కంటే పెద్దది క్షణకాలం- అని) **"ఒయుమ్ పొళుదిన్డి ఊళియాయ్ నీణ్డదాల్!"** (గడిచే సమయం లేని కల్పమై కాలం దీర్ఘమైపోయింది. అయ్యో!) అని పల్కి అతనిని (భగవానుని) విడచి విశ్లేషించి భరించలేనివారు ఆళ్వార్లే.

**(ప్రశిథిలసర్వగాత్రాః) - "కాలాళుమ్ నెఞ్జళియుమ్ కణ్ శుళలుమ్"** (కాళ్ళు తడబడతాయి, మనస్సు ద్రవిస్తుంది (నశిస్తుంది), కళ్ళ తిరుగుతాయి) అని, **"కాలుమెళా కణ్ణనీరుమ్ నిల్లా ఉడల్ శోర్న్దు నడుఙ్గి కురల్ మెళా మయిర్ కూచ్చమఱా"** (కాళ్ళు కదలవు, కంటి నీరు నిలువదు, శరీరం బాధతో అవశమై కంపించి, కంఠస్వరం పైకి రాదు, గగుర్పాటు నిలువదు) అని, **"ఉళ్లెలా మురుకి క్కురల్ తళుత్తొళిన్దేన్"** (మనస్సులో అంతా ద్రవించి, కంఠస్వరం గద్గదమైన వాడనయ్యాను) అని, **"ఉరోమకూపఙ్గళాయ్ కణ్ణనీర్కళ్ తుళ్ళమ్ శోర త్తుయిలణై కొళ్ళేన్"** అని పల్కి సర్వావయవాల శైథిల్యాన్ని పొందినవారు కూడా ఆళ్వార్లే. ఇటువంటి దివ్యసూరులకు విలక్షణమైన అనుభవాన్ని కల్గించి రక్షించడం కోసమే భగవానుడు అవతారాలను ఎత్తుతాడని శ్రీరామానుజుల గీతాభాష్య వివరణ ప్రక్రియ. అవతార రసాలను చక్కగా అనుభవించినవారు దివ్యసూరులేనని వారి అభిప్రాయం. ఇటువంటి పంక్తులు అన్యభాష్యాలలో లవలేశం అయినా కన్పించవు. ఆళ్వార్లనుగూర్చి, వారి స్వరూప స్వభావాలను గూర్చి వారికి ఏమాత్రం పరిచయం గాని, అవగాహన గాని లేకపోవడమే దీనికి కారణం.

## అనంతగుణసాగరసూక్తి- ఆళ్వార్ల శ్రీసూక్తి

శ్రీరామానుజులు శ్రీభాష్యం మొదలైన దివ్యగ్రంథాలలో భగవానునకు ప్రయోగించే విశేషణాలలో - **"అనంతగుణసాగరమ్"** అని, **"అపరిమితోదారణ గుణసాగరమ్"** అని విశేషణాలు ప్రయోగించడం కన్పిస్తుంది. ఉదాహరణంగా ఒక ప్రయోగాన్ని ప్రదర్శిస్తాను. శ్రీభాష్యంలోని ద్వితీయాధ్యాయ ప్రారంభంలో

**"అపరిమితోదారగుణసాగరం పరం బ్రహ్మ వేదాంతవేద్య మిత్యుక్తమ్"** (అపరిమితాలైన, గొప్ప గుణాలకు సాగరమైన పరబ్రహ్మయే వేదాంతాల ద్వారా తెలియదగినవాడని చెప్పబడింది.) అని ఉన్నది. ఇక్కడ పరబ్రహ్మశబ్దం ప్రథమావిభక్తిలో ప్రయోగింపబడింది తప్ప, ద్వితీయావిభక్తిలో కాదు. అందువల్ల దీనికి విశేషణమైన **"అపరిమితోదారగుణసాగరమ్"** అనేదానినికూడా ప్రథమాంతంగానే గ్రహించాలి. సాగరశబ్దం నిత్యపుంలింగం కనుక **"గుణసాగరో బ్రహ్మ"** అని ప్రయోగించాలి తప్ప **'గుణసాగరం బ్రహ్మ"** అని పల్కడం తగదు. భగవానుడు కల్యాణగుణాలకు సాగరమై ఉన్నాడు- అనే అర్థమే స్వరసంగా భాసిస్తుంది కనుక, **"గుణానాం సాగరః"** అని తత్పురుషసమాసం వివక్షితం కావడానికే అవకాశం ఉన్నది. ఈవిధంగా తత్పురుష సమాసాన్ని గ్రహిస్తే **"గుణసాగరం బ్రహ్మ"** అనే పై ప్రయోగం ఉపపత్తిని కల్గి ఉండే మార్గమే లేదు. తత్పురుష సమాసాన్ని విడిచిపెట్టి బహుర్వీహిసమాసంగా గ్రహిస్తే, అంటే- **"అనంతః గుణసాగరః యస్య తత్"** అని, **"అపరిమితః ఉదారగుణ సాగరః యస్య తత్"** అని సమాసాన్ని గ్రహిస్తే, **"సాగరమ్"** అని నపుంసకలింగంగా పొసగుతుంది. శ్రుతప్రకాశికాచార్యులవారు ఈవిధంగా బహుర్వీహి సమాసాన్నే స్పష్టంగా అంగీకరించారు. భగవానుడు కల్యాణగుణాలకు సాగరం వంటివాడని అంతట అందరు పల్కడం, అనేక గ్రంథాలలో వర్ణింపబడడం కనబడుతున్నది. ప్రసిద్ధమైన ఈ రీతిని విడచి, గుణసముద్రంగా పల్కి, ఆ సముద్రాన్ని భగవానుడు కల్గి ఉన్నాడని పల్కడంలో ఏమి వైశిష్ట్యం ఉన్నది? అని కొందరు ప్రశ్నించవచ్చు. భగవద్రామానుజుల శ్రీసూక్తిలో తప్ప వేటెక్కడ, ఏ గ్రంథంలోను ఈవిధంగా బహుర్వీహి సమాసంతో నిర్వహించవలసిన ప్రయోగం కన్పించదు. వెదకి చూస్తే, శ్రీవైష్ణవాచార్యుల గ్రంథాలలో బొత్తుగా కన్పించదు - అని దృఢంగా చెప్పవచ్చు.

ఈ విధంగా విలక్షణమైన రీతిలో శ్రీరామానుజులు పల్కడంలో ప్రబలమైన కారణం ఉన్నది. **"తమి*ழ்*మఱైకళ్ ఆయిరముమ్ ఈన్ద ముదల్‌తాయ్ శడకోపన్, మొయ్‌మ్బాల్ వళర్‌త్త ఇదత్తాయ్ ఇరామానుశన్"** (ద్రావిడవేదాలైన వేయి పాశురాలను ప్రసవించిన కన్నతల్లివంటివారు శఠకోపులు, వాటిని సామర్థ్యంతో పెంచిన హితపరురాలైన ధాత్రి వంటివారు శ్రీరామానుజులు) అని పల్కిన రీతిలో ఆ*ழ்*వార్ల దివ్యసూక్తులను అభివృద్ధి చేయడం కోసమే అవతరించినవారైన

భాష్యకారులు ఆళ్వారుల దివ్యసూక్తులను పురస్కరించుకొనియే సూక్తులను కృపజేస్తారు - అనే విషయం ఇతఃపూర్వం పలుమార్లు నిరూపించబడింది. ప్రకృత సందర్భంకూడా దానికి ఇంకొక గొప్ప ఉదాహరణం. నమ్మాళ్వార్లు పెరియ తిరువన్దాది అనే ప్రబంధంలో **"మికుమ్ తిరుమాల్ శీర్క్కడలై యుళ్ పొదిన్ద శిన్దనైయేన్"** (69) (మిక్కిలిగా శ్రియఃపతియొక్క గుణసాగరంలో పొందికగా నిలచి ఉండే చిత్తాన్ని కలవాడను అయినాను) అని అనుగ్రహించారు. ఈ పాశురంలో గుణాలు సముద్రంగా చెప్పబడ్డాయి. ద్రావిడ భాషావేత్త అయిన అగస్త్యమహర్షి లవణసముద్రాన్ని పానం చేశారు - అనే ప్రసిద్ధినిపొందారు. నమ్మాళ్వార్లు అనే ద్రావిడమహాముని తాము లవణసాగరాన్ని కాకుండా భగవద్గుణాలనే అమృతసముద్రాన్ని పానం చేశారు- అని ఇక్కడ సరసంగా తెలుపబడింది. ఈ సూక్తిని అనుసరించి ఆచార్య హృదయంలో కూడా మేఘోపదేశ చూర్ణికలో **"పూణ్డ నాళ్ శీర్క్కడలై యుట్కొణ్డు"** (3-6) అని ప్రయోగింపబడింది. మేఘం సముద్రాన్ని గ్రసించేటట్లే, మేఘంగా చెప్పబడే ఆచార్యులు కూడా భగవానుని దివ్యగుణాలనే సముద్రాన్ని గ్రహిస్తారు- అని దీని తాత్పర్యం.

అందువల్ల, ఆళ్వార్ల హృదయంలో భగవద్గుణాలు సముద్రంగా తోచినందు వల్ల, ఆఛాయను అనుసరించి ప్రయోగించాలి- అని భావించిన భగవద్రామానుజులు బహువ్రీహి సమాసానికి తగిన ప్రయోగాన్ని ప్రయోగించి, భగవద్గుణాలకు సాగరత్వాన్ని దృఢీకరించారు. ఇక్కడ ఇంకొక తీరు ఏ కారణాన్ని చెప్పే అవకాశం గాని, ఆవశ్యకత గాని లేదు.

ప్రసంగవశాత్తు, దీనితో సమానమైన ఇంకొక విషయం కూడా ఇక్కడ తెలుపబడుతున్నది. స్తోత్రరత్నం మొదటి శ్లోకంలో -**"అగాధభగవద్భక్తిసింధవే"** అనేచోట భాష్యాన్ని అనుగ్రహించిన శ్రీదేశికులు "శ్రీమన్నాథమునులు భగవద్భక్తికి సింధువువంటివారు''అని తత్పురుషసమాసంగా ముందు వివరించి, వెంటనే **"భక్తిం వా సాగరత్వేన రూపయిత్వా బహువ్రీహిః"** (భక్తిని సాగరంగా నిరూపించి బహువ్రీహి చెప్పవచ్చు) అని అనుగ్రహించారు. అగాధమైన భగవద్భక్తి సాగరాన్ని కలవారని తాత్పర్యం. ఈ రీతిలో బహువ్రీహిని గ్రహించడం **"కాదల్ కడల్పురైయ విళైవిత్త"** (భక్తిసాగరాన్ని ఉత్కటంగా పెంపొందించిన) **(5-3-4)** అనే తిరువాయ్మొళ్ళి పాశురంలో భక్తిని సముద్రంగా రూపించి పల్కడాన్ని అనుసరించియే అనుగ్ర

హించాలి. శ్రీదేశికులకు ఇటువంటి మార్గాన్ని అనుగ్రహించినవారు పెరియ వాచ్చాన్‌పిళ్ళై - అని కూడా గ్రహించాలి.

## కప్యాసశ్రుత్యర్థం- ఆళ్వార్ల శ్రీసూక్తులు

ఆళ్వార్లు భగవానుని కల్యాణగుణాలకు ఉపమానాలను పలికే సందర్భాలను నిశితంగా పరిశీలించినపుడు అపూర్వాలైన కొన్ని విషయాలు స్పష్టపడతాయి. శ్రీరామానుజులు దివ్యప్రబంధామృతసాగరంలో ఎంత లోతుగా మునిగి అనుభవాన్ని పొందారు- అనే విషయం ఈ పరిశీలనలో తెలియవచ్చు. భగవానుని నేత్రాలకు ప్రాయికంగా తామరయే ఉపమానంగా పలికినా, తామరకు ఒక్కొక్క సందర్భంలో ఒక్కొక్క విధమైన విశేషణాన్ని దివ్యసూరులు ప్రయోగిస్తారు. విశేషణాలను మనం పైపైన మాత్రం గమనిస్తే వారి యథార్థ తత్త్వం బోధపడదు. ఏ విశేషం కన్పించదు. యతిప్రాసల సుభగత్వాన్ని పురస్కరించుకొని, పాదపూరణ నిమిత్తంకోసం ఆయా విశేషణాలు ప్రయోగింపబడ్డాయని కొందఱు భ్రమించే అవకాశంకూడా ఉన్నది. కాని, శ్రీరామానుజులు ప్రత్యంశం నిశితంగా పరిశీలించేవారు కనుక, ఆ విశేషణాలను పురస్కరించుకొని వేదాంతార్థాలను వారు నిర్వహించే గొప్పతనం అవాఙ్మనస గోచరం. ప్రకృతనిరూపణాలలో ఇది శిఖరాయమాణంగా గ్రహించదగినది.

శ్రీరామానుజులు యాదవప్రకాశులవద్ద వేదాంతార్థ శ్రవణాన్ని చేసేటపుడు పలుచోట్లనో, కొన్ని సందంర్భాలలోనో వారి ఇరువురిమధ్య అభిప్రాయభేదాలు ఏర్పడినట్లు చరిత్రవల్ల తెలుస్తున్నది. ఉదాహరణంగా, ఆఱాయిరప్పడి గురుపరంపరాప్రభావంలో కన్పించే ఒక విషయం ఇక్కడ ప్రస్తుతింపబడుతున్నది. "పిన్బు ఒరునాళ్, ఇళైయాళ్వార్ యాదవప్రకాశనుక్కు అభ్యంజనత్తొళిల్ శెయ్యానిఱ్క అవ్వళవిలే 'తస్య యథా కప్యాసం పుండరీక మేవ మక్షిణీ'ఎన్గిఱ శ్రుతిక్కు అవన్ అనుచితార్థమ్ శొల్ల, అతు కేట్టు ఇవరుక్కు శోకముణ్డాయ్, అన్ద శోకాశ్రు అవన్ తొడైయిలే విళ, అతు నెరుప్పు ప్పట్టాప్పోలే అవన్ తొడైయై చ్చుడ, అవనుమ్ పదఱి ఇవర్‌ముఖత్తై ప్పార్‌త్తు, 'ఉమక్కు దుక్కమావానెన్?" ఎన్న, ఇవరుమ్... అయథార్థమ్ కేట్టవాఱే తుక్కమాయిత్తు - ఎన్న, యాదవ ప్రకాశనుమ్ అతు కేట్టు క్కుపితనాయ్, "నాన్ శొన్నపడి కేట్కిల్ వాశిత్తిరుమ్;

ఇల్లావిడిల్ విట్టుప్పోమ్' ఎన్న, ఇవరుమ్ అప్పడియే శిన్దై కలజ్గి త్తవిర్న్దిరుక్క" (తరువాత, ఒకనాడు, శ్రీరామానుజులు యాదవప్రకాశునకు అభ్యంగనం చేయిస్తూ ఉండగా, ఆ సమయంలో **'తస్య యథా కప్యాసం పుండరీక మేవమక్షిణీ'** అనే శ్రుతికి యాదవుడు అనుచితమైన అర్థాన్ని పల్కగా, దానిని విని వీరికి శోకం కల్గి, ఆ శోకాశ్రువు అతని తొడపై రాలింది. అది నిప్పు పడినట్లుగా అతని తొడను కాల్చగా, అతడు చలించి, వీరి ముఖాన్ని చూచి "మీకు దుఃఖం ఎందువల్ల కల్గింది?" అని అనగా, వీరు కూడా.. "యథార్థం కానిదానిని వినగానే దుఃఖం కలిగింది" అని అనగా, యాదవప్రకాశుడు కూడా దానిని విని, కోపించినవాడై 'నేను పల్కిన రీతిలో వింటే అభ్యసించండి, లేకపోతే వెళ్ళిపొండి' అని అనగా, వీరు కూడా ఆవిధంగానే మనస్సులో కలతచెంది విద్యాభ్యాసాన్ని నిలిపివేశారు) అని ఆ గ్రంథంలో తెలుపబడింది. కనుక అది వాస్తవమైన వృత్తాంతమన్నది స్పష్టం.

శ్రీరామానుజులకు శోకాశ్రువులు ప్రవహించేటట్లుగా యాదవునిచే ఏమి అపార్థం చెప్పబడింది? అనే విషయాన్ని ఇక్కడ కొంచెం పరిశీలించాలి. **'కప్యాస'**మనే పదానికి 'కపియొక్క ఆసన'మనే అర్థాన్ని గ్రహించి, (అంటే మర్కటపృష్ఠమనే అర్థాన్ని గ్రహించి) అర్థం నిర్వహింపబడిందని, ఈ విధంగా నిహీనమైన ఉపమను పల్కడం తగదు కనుక, శ్రీరామానుజులకు శోకం కల్గింది- అని తెలుస్తున్నది. ఇక్కడ విమర్శనీయాలైన అంశాలు అనేకం ఉన్నాయి. మర్కటపృష్ఠమనే అర్థాన్ని యాదవప్రకాశులు తామే కల్పించి పలికారా? లేక, వారికి పూర్వమే ఎవరైనా ఆ అర్థాన్ని పలికారా? అని గమనించాలి. అంతేకాక, మర్కటపృష్ఠాన్ని భగవానుని నేత్రాలకు ఉపమానంగా పలికారా? లేక, దానిని పుండరీకంలో అన్వయించి, దానితో సాటి అయిన నేత్రాలు - అని అర్థాన్ని చెప్పారా?" అని కూడా విమర్శించి చూడాలి.

మర్కటపృష్ఠమనే అర్థాన్ని శంకరులు చెప్పారు - అని, వారిని అనుసరించి యాదవప్రకాశులు ఆ అర్థాన్ని పలికారని కొందఱు అంటారు. ఇక్కడ తెలిసికోవలసిన, వాస్తవమైన విషయం తెలుపబడుతున్నది. **"భగవద్బోధాయన కృతాం విస్తీర్ణాం బ్రహ్మసూత్రవృత్తిం పూర్వాచార్యా సంచిక్షిపుః"** (భగవద్బోధాయనులచేత రచింపబడిన, విస్తృతమైన బ్రహ్మసూత్రవృత్తిని పూర్వాచార్యులు సంక్షేపించారు) అనే శ్రీభాష్యోపక్రమసూక్తిలోని పూర్వాచార్యపదంతో వివక్షితులుగా శ్రుతప్రకాశికాచార్యులవారిచేత చూపబడిన ద్రమిడభాష్యకారులే ఈ అర్థాన్ని వ్రాశారు- అని

శ్రుతప్రకాశికాభట్టరు, వేదాంతదేశికులు, ఇంకా పలువురు వివరించారు. **"తస్య యథా కప్యాస"**మిత్యాది శ్రుతివాక్యానికి ఇక్కడ ద్రమిడభాష్య కారులు ఆఱు అర్థాలను తెలిపారని, ఆ ఆఱు అర్థాలను వారు ఏ విశేషమైన సూచనను తెలుపకుండా వ్రాసినా, వాటిలో మొదటి మూడు అర్థాలను పూర్వ పక్షార్థాలుగా, తరువాత గల మూడు అర్థాలను సిద్ధాంతార్థాలుగాను గ్రహించాలని **"అంత స్తద్ధర్మోపదేశాత్''** అనే బ్రహ్మసూత్రం యొక్క శ్రీభాష్యవివరణలో శ్రుతప్రకాశికాచార్యులవారు తెలియజేశారు.

అక్కడ గల **"తస్య యథేతి" - అస్య వాక్యస్య వాక్యకారేణ షడర్థాః పూర్వ పక్షతయా సిద్ధాంతత్వేన చోక్తాః, తత్ర అర్థత్రయస్య పూర్వపక్షత్వం తత్స్వభావా దేవావగతమ్"** (తస్య యథేతి - ఈ వాక్యానికి వాక్యకారునిచేత ఆఱు అర్థాలు పూర్వపక్ష- సిద్ధాంతార్థాలుగా చెప్పబడ్డాయి. వాటిలో మూడు అర్థాలు పూర్వ పక్షార్థాలు- అని వాటి స్వభావంవల్లనే తెలుస్తుంది.) ఇత్యాది సూక్తులు గమనించ దగినవి. వేదార్థసంగ్రహవ్యాఖ్య తాత్పర్యదీపికలోను శ్రుతప్రకాశికాచార్యులవారు ఈవిధంగానే తెలిపారు.

శ్రీదేశికులు స్తోత్రభాష్యంలో **'కః పుండరీకంనయనః"** అనేచోట **"యద్యపి ద్రమిడభాష్యే తస్య యథా కప్యాస"మిత్యాదేః షడర్థాః ప్రోక్తాః, తథాపి ఔచిత్యాత్ త్రయ ఏవ స్వీకర్తవ్యాః"** (ద్రమిడభాష్యంలో **'తస్య యథా కప్యాస"** మిత్యాది శ్రుతికి ఆఱు అర్థాలు చెప్పబడినా, వాటిలోని ఔచిత్యాన్నిబట్టి మూడు అర్థాలే స్వీకరించిదగినవి) అని పలికారు.

ఈ విధంగా మర్కటపృష్ఠమనే అర్థాన్ని ద్రమిడ భాష్యకారులే వ్రాసినట్లుగా తెలిపి, ఆ అర్థాన్ని వారు పూర్వపక్షార్థంగా వ్రాయకపోయినా, అర్థస్వారస్యాన్ని బట్టి పూర్వపక్షార్థంగానే మనం గ్రహించాలి - అని నిశ్చయింపబడింది. ద్రమిడభాష్య కారులు యాదవప్రకాశులవలె విమతులు కారు. వారిని భగవద్రామానుజులు మాటిమాటికి ప్రమాణంగా గ్రహిస్తారు. ఈ విషయాన్ని వేదార్థసంగ్రహంలో గమనింవచ్చు. ఈ అర్థం- అంటే- మర్కటపృష్ఠమనే అర్థం- శ్రీరామానుజులకు రుచించలేదు - అనేది వాస్తవం. పూర్వపక్షార్థాన్ని యాదవప్రకాశులు సిద్ధాంతార్థంగా చెప్పారు. అందువల్లనే భగవద్రామానుజులకు కన్నీరు పరవశంగా ప్రవహించింది.

దానినిబట్టే ఈ అర్థాన్ని పూర్వపక్షార్థంగా గ్రహించాలి- అని శ్రీశ్రుతప్రకాశికాచార్య ప్రభృతులు భావించారు.

మర్కటపృష్ఠాన్ని భగవానుని తిరునేత్రాలకు ఉపమానంగా పల్కినట్లు కాకుండా, పుండరీకానికి ఉపమానంగా పల్కినట్లుగా కూడా కన్పిస్తుంది. అంతరధికరణ భాష్యం శ్రుతప్రకాశికలో- **"మర్కటపృష్ఠం పుండరీకం చ కిముపమాన ద్వయమ్? ఉత ఏకోపమా? తత్ర ఉపమాద్విత్వ మయుక్తమ్"** (మర్కటపృష్ఠం, పుండరీకం రెండు ఉపమానాలా? లేక, ఒకే ఉపమానమా? రెండు ఉపమానాలు - అని అనడం అయుక్తం) ఇత్యాదిగా కల అచటి శ్రీసూక్తిని గమనించాలి. ఆవిషయం అటు ఉండనివ్వండి.

ఇక్కడ భగవద్రామానుజులు సిద్ధాంతార్థంగా భావించిన అర్థవిశేషాలు అవి దివ్యసూరులు ఆదరించినవి - అనే కారణంవల్లనే విశేషించి ఆదరణకు పాత్రమైనవి- అనే విషయాన్ని విలక్షణమైన భాగధేయాన్ని కల కొందటే గ్రహించగలరు. ఆ దివ్యసూరులు ఆదరించి అభిమానించిన అర్థాలు- అనే కారణంచేతనే వాటిని భగవద్రామానుజులు ఆదరించారు. ఆ విషయం ఇపుడు వివరింపబడుతున్నది.

**'కప్యాసమ్"** అని ఛాందోగ్యోపనిషత్తులో గల విలక్షణమైన పదానికి మూడు విధాలైన వ్యుత్పత్తులనుబట్టి మూడు అర్థాలు అవతరించాయి. ఈ మూడు అర్థవిశేషాలను చూపే భగవద్రామానుజులు శ్రీసూక్తి ఏమి? అంటే- **"గంభీరాంభః సముద్భూత- సుమృష్టనాళ- రవికరవికసిత పుండరీకదళామలాయ తేక్షణః"** అనేదే ఆ శ్రీసూక్తి. లోతైన నీటిలో ఉన్నది, నాళమనబడే కాడతో కూడి ఉన్నది, సూర్యకిరణాలచే వికసించినది అయిన పుండరీకం యొక్క రేకులవలె విశాలమైన నేత్రాలను కలవాడని తాత్పర్యం. కప్యాసమనే ఈ చిన్న పదంతో ఇన్ని అర్థాలు ఏ విధంగా స్ఫురిస్తాయి? అనే సందేహం ఇక్కడ కలుగవచ్చు. ఆ సందేహాన్ని తీర్చడంకోసం **"కప్యాస"** శబ్దానికి చెప్పదగిన వ్యుత్పత్తులను వివరించవలసి ఉన్నది. అయితే, అది కఠినమైన సంస్కృత శాస్త్రీయ ప్రక్రియ, దానిని సంస్కృతభాషలో రచించిన కొన్ని గ్రంథాలలో ఇతః పూర్వమే తెలిపాను. అక్కడ గమనించవచ్చు. భగవద్రామానుజులు ఆదరించిన అర్థాలు మూడు కప్యాసమనే శబ్దసన్నివేశంలో లభించినవే - అనే విషయాన్ని భగవద్రామానుజుల భక్తులు దృఢంగా గ్రహిస్తారు.

ఇక్కడ ముఖ్యంగా విమర్శించవలసిన విషయం ఏమంటే, భగవద్రామానుజులు ఈ అర్థాలను ఆదరించడానికి ఏదయినా విశేషమైన కారణం ఉన్నదా? అని. కప్యాసమనే పదానికి శ్రీరామానుజులు ఆదరించిన అర్థాలకు మూలం చూపాలి- అని అంటే, సంస్కృతశాస్త్రాలలో మూలంగా చూపగలిగినది ఏదీ లేదు- అని దృఢంగా చెప్పగలను. శ్రీరామానుజులు ఆదరించిన అర్థవిశేషాలు అన్నీ ఆழ్వార్లు అనుగ్రహించిన శ్రీసూక్తులనే మూలంగా కలిగినవి- అని మన పూర్వాచార్యుల సిద్ధాంతం. ఆ మార్గంలో ఇంతకు ముందు నేను శ్రీభాష్యాదుల నుండి కొన్ని విషయాలను నిరూపించాను. అటువంటి నిరూపణాలలో చాలా ముఖ్యమైన నిరూపణంగా ఈ నిరూపణ గ్రహించదగినది. అది ఏది? అంటే -

గంభీరాంభఃసముద్భూతమై, సుమృష్టనాళమై, రవికర వికసితమై ఉండే పుండరీకాన్ని భగవానుని నేత్రాలకు ఉపమానంగా పల్కడం తగినది- అని శ్రీరామానుజుల మనస్సులో తోచడం దివ్యప్రబంధాలలో ఆ ఆచార్యులు గాఢంగా అవగాహించినందువల్లనే. ఆழ్వార్లు భగవానుని నేత్రసౌందర్యాన్ని గూర్చి పలికే సందర్భాలలో పైన చూపిన మూడు విశేషాలను చాలా అద్భుతంగా పలికారు. వానిని క్రమంగా వివరిస్తాను.

**(గంభీరాంభఃసముద్భూతపుండరీక)** - జలజమని, అంబుజమని, అంభోజమని, నీరజమని పేరును పొందిన పుండరీకం నీటిలో కాకుండా వేఱొక చోట ఉండే ప్రసక్తి లేనే లేదు, కనుక, **"అంభఃసముద్భూత"** అనే ప్రయోగంలోని భావం ఏమంటే- నీటిని విడిచి ఉండని స్థితిని తెలుపడమే. **"తామరైయై అలర్త్తక్కడవ ఆదిత్యన్ తాన్ నీరై ప్పిరిన్దాల్ అత్తై ఉలర్త్తుమాపోలే"** (తామరను వికసింపజేసే సూర్యుడే ఆ తామర నీటినుండి వేరయితే దానిని శోషింపజేసేటట్లు) అనే శ్రీవచనభూషణసూక్తి. **"కమలం జలాదపేతం శోషయతి రవి ర్నతోషయతి"** (నీటినుండి దూరమైన కమలాన్ని రవి శోషింపజేస్తాడు. వికసింపజేయడు) అనే ప్రమాణం ఇక్కడ అనుసంధేయాలు. నీటిని విడచి ఉండని తామరవంటి నేత్రాలను కలవాడు - అని దీని తాత్పర్యం. **"నీరార్ కమలమ్బోల్ శెఙ్గణ్మాల్ ఎన్నొరువన్"** (పుష్కలమైన నీటిలోని కమలంవంటి ఎఱ్ఱని కన్నులను కల ఆశ్రితవ్యాముగ్ధుడైన అద్వితీయుడు) అనే శిఱియతిరుమడల్ పాశురంలోను, **"అழఅలర్ తామరై**

క్కణ్ణన్" (లోతైన నీటిలోని తామరలవంటి కన్నులు కలవాడు) అనే తిరువిరుత్త ప్రబంధపాశురం లోను ఆళ్వార్లు వ్యక్తం చేసిన అర్థమనియే దీనిని శ్రీరామానుజులు ఆదరించారు. "నీరార్ కమలమ్పోల్" అనేచోట "నీరార్" అనే విశేషణం ప్రాససుభగత్వంకోసం మాత్రమే ప్రయోగింపబడినది కాదు. "**అళ్లలర్ తామరైక్కణ్ణన్**" (లోతైన నీటిలో గల తామరవంటి నేత్రాలను) కలవాడు అనేచోట నమ్పిళ్లై వ్యాఖ్యానిస్తూ తమ ఈడు వ్యాఖ్యలో- కప్యాసశ్రుతిని స్పష్టంగానే ఉదాహరించారు. అచటి శ్రీసూక్తి ఈవిధంగా ఉన్నది - (**అళ్లలర్ తామరై క్కణ్ణన్)- ఆళత్తిలే నిన్టలర్న్ద తామరైప్పూప్పోలే యిరున్దుళ్ళ తిరుక్కణ్గళై యుడైయవన్. "యథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ"** ఎన్నక్కడవదిఱే".

**(అళ్లలర్ తామరైక్కణన్)**- బాగా లోతైన నీటిలో నిలచి ఉండి వికసించిన తామరపూలవలె ఉండే నేత్రాలను కలవాడు. "**యథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ**" అని చెప్పబడుతున్నది కదా)., ఇక్కడ వాదికేసరి అళకియ మణవాళచ్చీయర్ స్వాపదేశవ్యాఖ్య ఈవిధంగా ఉన్నది- "**అళ్లు- ఎన్దు అళఱు, నీరిలుమ్, శేఱ్ఱిలుమ్ నిన్దు అలర్న్దు, శెవ్వి మాఱాద తామరైపోన్ఱ కణ్ణై యుడైయవన్- ఎన్టపడి**" ("**అళ్లు**" అంటే - లోతు. నీటిలో, బురదలో ఉండి వికసించి, శోభ మాఱని తామరవంటి కన్నులను కలవాడని భావం.)

ఈవిధంగా "**నీరార్ కమలమ్పోల్ శెఙ్గణ్మాల్ ఎన్ఱొరువన్**" అనే శిఱియ తిరుమడల్ ప్రబంధశ్రీసూక్తిని "**అళ్లలర్ తామరైక్కణ్ణన్**" అనే తిరువిరుత్త శ్రీసూక్తిని, "**తణ్ పెరునీర్ తడన్దామరై పరన్దాలొక్కుమ్ కణ్‌పెరుమ్ కణ్ణన్**" (చల్లని గొప్ప నీటిని గల తటాకంలో పూచిన తామరపూవు వికసించి నట్లుగా ఉండే నేత్రాలను కలవాడు) అనే తిరువాయ్‌మొళి పాశురాన్ని మనస్సులో ఉంచుకొనియే "**గంభీరాంభఃసముద్భూత**" ఇత్యాది విశేషణాన్ని శ్రీరామానుజులు ప్రయోగించారు- అనేది వ్యక్తమవుతున్నది.

"**అళ్లలర్ తామరైక్కణ్ణన్**" అనే తిరువిరుత్త పాశురంలో జలవాచకశబ్దం ఏమీ లేకుండా, పంకానికి వాచకమైన శబ్దం ఉన్నందువల్ల ఈ సూక్తి "**గంభీరాంభః సముద్భూత**" అనేదానికి ప్రమాణం కాదు - అని కొందఱు పొరపాటుపడి ఇక్కడ వాదిస్తారు. వారికి బదులు పలుకుతున్నాను. తామరపూవు కేవలం చన్నీటిలో

మొలవదు, పూయదు. పంకంనుండే ఉద్భవిస్తుంది. ఇది ప్రత్యక్షసిద్ధం కనుక, ఇందులో వివాదప్రసక్తి ఏదీ లేదు. **"గంభీరాంభఃసముద్భూత"** అని పల్కిన శ్రీరామానుజులకు ముందుగా ఈ అర్థాన్ని వ్యక్తం చేసిన ద్రమిడాచార్యులకు కూడా జలవాచకమైన శబ్దంతో వివక్షితమైన అర్థం పంకమే- అని అనడంలో అడ్డు లేదు కదా! మృత్తికామిశ్రమైన జలానికి కదా పంకమని పేరు. కేవలం మట్టిని పంకమని గాని, బురద అని గాని అనరు. తామరను గూర్చిన ప్రస్తావన వచ్చే సందర్భాలలో (పంక- కర్దమ- జంబాలాది) పదాలు, జలవాచకపదాలు పర్యాయాలుగానే గ్రాహ్యాలు. ఇది వాదికేసరి అ*ళ*కియ మణవాళచ్చీయర్ వ్యాఖ్యలో సూచింపబడింది. నంబిళ్లై ఈడు వ్యాఖ్యలో **"అ*ళ*ఱలర్ తామరై"** అనే దానిని ఉద్దేశించి కప్యాసశ్రుతి స్పష్టంగా ఉదాహరింపబడగా, దానిని గమనించకుండా ఆక్షేపించడం వృథాభినివేశ విజృంభితం అవుతుంది. అంతే. ఒకవేళ **"అ*ళ*ఱలర్ తామరైక్కణ్ణన్"** అనే పాశురాన్ని విడిచిపెట్టినా, **"నీరార్ కమలమ్పోల్ శెఙ్గణ్‌మాల్", "తణ్ పెరునీర్ తడన్దామరై మలర్న్దాలొక్కుమ్ తణ్‌పెరుఙ్కణ్ణన్"** అను పాశురాలకు లోటు లేదు కదా!

**(సుమృష్టనాళపుండరీక)** - నీటిని విడచి పెట్టిన తామరపూవుకు శోభ లేనట్లుగా, కాడను విడిచిన తామరపూవుకు కూడా శోభ లేనందువల్ల, తామర పూవుకు నాళంలో ఉండడం అవశ్యం వ్యక్తమైనది. ఇది కూడా ఆ*ళ్వా*ర్ల శ్రీసూక్తులలో ప్రస్తావింపబడింది. తిరువిరుత్త ప్రబంధంలోని **"వన్ కా*ఱ్ఱు*ఱైయ"** అనే పాశురంలో **"ఎమ్బిరాన్ తడఙ్కణ్‌గళ్... మెన్ కాల్‌కమలత్తడమ్ పోల్ పొలిన్దన"** (భగవానుని విశాలమైన నేత్రాలు మృదువైన నాళాన్ని కల కమలాలను కలిగిన తటాకాలవలె వర్ధిల్లినవి) అని తెలుపబడింది. కమలానికి ప్రయోగింపబడిన **"మెన్‌కాల్"** అనే విశేషణానికి **"మెల్లియ నాళత్తిలే ఇరుక్కిఱ"** (సుకుమారమైన నాళంలో కల) అని అర్థం. నాళమంటే - కాడ. కమలానికి అది కాలు వంటిది కనుక, **"కాల్"** అనే పదంతో సూచింపడింది. నాళమనే అర్థాన్నే పూర్వాచార్యులు దీనికి తెలిపారు. అందువల్ల ఈ శ్రీసూక్తికి తగినట్లుగా **"సుమృష్టనాళ"** అని అనుగ్రహింపబడింది. ఈ రీతిలో ఇంకా పలు పాశురాలను చూపవచ్చు. అయినా ఇది ఒక్కటియే చాలు కదా! కనుక **"మెన్ కాల్"** అనే ప్రయోగాన్ని దృష్టిలో ఉంచుకొని **"సుమృష్టనాళ"** అనే విశేషణ ప్రయోగం చేయబడింది.

**(రవికరవికసిత పుండరీక)** - తామరపూవు నీటిలో ఉన్న కాడను కల్గి ఉన్నా, సూర్యకిరణాలచేత వికసింపజేయబడిన స్థితిలోనే భగవానుని తిరునేత్రాలతో పోలి ఉంటుంది. కనుక, ఈ విశేషం ఆవశ్యకమైనది. ఈ విషయంకూడా ఆళ్వార్ల శ్రీసూక్తులలో కన్పిస్తుంది. తిరువాయ్‌మొళ్లి ప్రబంధంలోని **"శెఞ్జుడర్ తామరైక్కణ్ శెల్వన్" (5-4-9)** (సూర్యుని కిరణాలచే వికసింపజేయబడిన తామరలవంటి కన్నులను కల శ్రియఃపతి) అనే పాశురం ఇక్కడ గ్రాహ్యం. ఈ సందర్భంలో ఈడు వ్యాఖ్యలో కూడా నమ్పిళ్లై కప్యాస శ్రుతిని ఉదాహరించారు. ఈ ఆళ్వార్ల సూక్తికి - **"శెఞ్జుడర్ తామరై"** అనే ప్రయోగానికి ఎఱ్ఱని తేజస్సుని కల్గిన తామరపూవు- అని అర్థం. ఆ ఎఱ్ఱని తేజస్సు దానికి ఏవిధంగా వచ్చినది? అని అంటే, దానికి ముందు పాదంలో **"అఞ్జుడర్ వెయ్యోన్"** (అంఆదమైన తేజస్సును కల సూర్యుడు) అని అంటూ సూర్యుని ప్రస్తావించినందువల్ల తదధీనమని సూచింపబడింది. ఈవిధంగా సూర్యుని ప్రకాశం మూలంగా కల్గిన, ఎఱ్ఱని కాంతిని కల్గిన తామరపూవువంటి తిరునేత్రాలను కలవాడని తెలుపబడినట్లయింది. ఈ శ్రీసూక్తిని దృష్టిలో పెట్టుకొనియే **"రవికరవికసిత...పుండరీక"** అని అనుగ్రహింప బడింది. **"శెన్దణ్ కమలక్కణ్.... శివన్ద వాయోర్ కరునాయిఱు అన్దమిల్లా క్కదిర్ పరప్పి అలర్న్దదు ఒక్కుమమ్మానే"** (ఎఱ్ఱని చల్లని తామరలవంటి కన్నులు ఎఱ్ఱని ముఖాన్ని కల విలక్షణమైన సూర్యుడు తన అంతు లేని కిరణాలను వ్యాపింపజేసి వికసింపజేసినట్లుండే స్వామి) అనే తిరువాయ్‌మొళ్లి పాశురం కూడా ఇక్కడ అనుసంధేయం. **"శెజ్గలమ్ అన్దరమ్ శేర్ వెజ్గదిరోఱ్కల్లాల్ అలరావాల్"** (ఎఱ్ఱని తామరపూవు, ఆకాశంలో ప్రకాశించే వేడి కిరణాలను కల సూర్యునిచేత తప్ప ఇంకొకరిచేత వికసింప జేయబడదు) అనే పెరుమాళ్ తిరుమొళ్లి పాశురం కూడా స్మరించదగినది. అయితే, ఆ పాశురంలో భగవానుని నేత్రాల ప్రసక్తి లేనందువల్ల అది పరిపూర్ణ ప్రమాణం కాబోదు. ఈ విధంగా ఆళ్వార్ల శ్రీసూక్తులలో చక్కగా పూర్ణంగా అవగాహించే భగవద్రామానుజులు **"కప్యాస"** శ్రుత్యర్థాన్ని అత్యంత భోగ్యంగా నిర్వహించారని నిర్ణయింపబడింది.

**"పుండరీకదళామలాయతేక్షణ' అనే ప్రయోగంలోని తత్త్వం**

**"కప్యాసం పుండరీకమేవ మక్షిణీ"** అనే ఉపనిషత్ వాక్యానికి వివరణంగా శ్రీరామానుజులు అనుగ్రహించిన **"గంభీరాంభఃసముద్భూత రవికరవికసిత"** ఇత్యాది

దివ్యసూక్తిలో చివర **"పుండరీకదళామలాయతేక్షణ"** అని తెలుపబడడం సుప్రసిద్ధం. మూల శ్రుతివాక్యంలో **"పుండరీకమేవ మక్షిణీ"** అని ఉన్నదే తప్ప వేఱుగా లేదు. ఈ శ్రుతి వాక్యానికి **"పుండరీకేక్షణః"** అని ఇంతమాత్రమే వివరణాన్ని అనుగ్రహించి ఉండాలి. కాని, అధికంగా మూడు పదాలను జోడించారు. అవి 1. దళ, 2. అమల, 3. ఆయత- అనే మూడు పదాలు. ఏ ఆధారంతో శ్రీరామానుజులు వీటిని చేర్చారు? అనే విషయాన్ని విచారించి నపుడు, ఆళ్వార్ల దివ్యసూక్తులనే ఆధారంగా చేసికొని ఈ పదాలు ప్రయోగింపబడ్డాయని నిర్ణయించవలసి ఉన్నది.

ఆళ్వార్లు **"తామరైక్కణ్ణన్"** అని కొన్ని సందర్భాలలో **"తామరైత్తడమ్ కణ్ణన్", "కమలత్తడమ్ కణ్ణన్", "కమలత్తడమ్ పెరుఙ్కణ్ణన్"** అని పలుచోట్ల పలికారు. సంస్కృతభాషలోని లకారం, ళకారం ద్రావిడభాషలో డకారంగా మాఱే సందర్భాలున్నాయి. **"లడయో రభేదః"** అనే న్యాయాన్ని (లకార, డకారాలకు అభేదం) సంస్కృతాలంకారికులు అంగీకరించారు కూడా. దీనినే (ఈవిధమైన వర్ణసామ్యాన్ని) **"ఎழுత్తు ప్పోలి"** (అక్షరాల పోలిక) అని ద్రావిడభాషా విదులంటారు. ఈ విధంగా **"పత్రం పలాశం ఛదనం దళం పర్ణం ఛదః పుమాన్"** అని అమరకోశంలో పఠింపబడిన దళమనే పదం ద్రావిడంలో **"తడ"**మని మారుతుంది- అని భావించిన భగవద్రామానుజులు **"కమలత్తడఙ్కణ్ణన్", "తామరైత్తడఙ్కణ్ణన్"** అనే ప్రయోగాలలో **"దళ"**మనే అర్థంలో **"తడ"**మని ప్రయోగింపబడిందని భావించి, **"పుండరీకదళ"** అని అనుగ్రహించారు. **"తడ"**మనే పదానికి విశాలమనే అర్థం, తటాకమనే అర్థం, దళమనే అర్థం అక్కడక్కడ వ్యాఖ్యాతలు తెలిపారు. **"నీలత్తడవరై మేల్ పుణ్డరీక నెడున్తడఙ్గళ్ పోల.... ఎమ్బిరాన్ కణ్ణిన్ కోలఙ్గళే"** (నల్లని విశాలమైన పర్వతంపై తామరలు నిండిన విశాలమైన తటాకాలవలె .... స్వామి నేత్రసౌందర్యాలున్నాయి) అని తిరువిరుత్త పాశురంలో తడమనే పదానికి తటాకమనే అర్థం పొసగుతుంది.

ఈ సందర్భంలో రసికులు నిశితంగా గమనించవలసి ఉన్నది. **"తామరై నీళ్ వాశత్తడమ్పోల్ వరువానే"** (తిరువాయ్మొழி-8-5-1) (తామరపూలతో నిండిన, విశాలమైన, సువాసనను కల్గిన తటాకంవలె వచ్చేవాడా!) అని మొదలైన పలు పాశురాలలోను, **"ఉత్ఫుల్లపంకజతటాక మివోపయాని శ్రీరంగరాజమ్"** (చక్కగా వికసించిన తామరలను కల తటాకాన్నివలె శ్రీరంగనాథుని ఆశ్రయిస్తున్నాను)

(శ్రీరంగరాజస్తవం- పూర్వశతకం), **"పిబ నయన! పురస్తే రంగధుర్యాభిధానం స్థితమివ పరిఫుల్లత్ పుండరీకం తటాకమ్"** (ఓ నేత్రమా! నీ ఎదురుగా ఉండే, శ్రీరంగనాథుడనే పేరును కల్గిన, చక్కగా వికసించిన పుండరీకాలతో నిండిన తటాకాన్ని పానం చేయి) (శ్రీరంగ రాజస్తవం- పూర్వశతకం) అని పలు శ్లోకాలలోను భగవానుడు తామరల తటాకంగా చెప్పబడ్డాడు. తిరుమేనిలోని ఏకదేశమైన తిరునేత్రాలను మాత్రం తటాకంగా పల్కడంద్వారా వాటి సాటి మేటిలేని వైశాల్యం తెలుపబడింది. **"ఎమ్బిరాన్ కణ్ణిన్ కోలజ్గళ్ పుణ్డరీక నెడున్తడజ్గళ్ పోల"** (మాస్వామియొక్క తిరునేత్రాల అందాలు తామరలు నిండిన విశాలమైన తటాకాలవలె) శోభిల్లుతున్నట్లు నమ్మాళ్వార్లు అనుగ్రహించిన సూక్తిని నిశితంగా గమనించిన భగవద్రామానుజులు ఊరికే నిర్విశేషంగా **"పుండరీకేక్షణ"** అని మాత్రం పలికి ఊరుకోవడం ఏ విధంగా సాధ్యం? ఆళ్వార్ల శ్రీసూక్తులనే అమృత సముద్రంలో పూర్ణంగా అవగాహించిన శ్రీరామానుజులు ఆళ్వార్లకంటే అందులో మెండుగా అవగాహించేవారు కనుక, ఆ ఆళ్వార్లు అభినివేశాన్ని పొందిన రీతులన్నిటిని తమ సూక్తులలో తెలిపితే తప్ప నిలువలేరు. కనుక, సంస్కృతోప నిషత్తులనుండి కొంచెంగా, ద్రావిడోపనిషత్తులనుండి అధికంగా గ్రహించారు.

**"కమలక్కణ్ణన్.... అమలజ్గళాక విழிక్కుమ్"** (కమలనేత్రుడు... పవిత్రం అయే రీతిలో కటాక్షిస్తాడు) అని నమ్మాళ్వార్లు తిరువాయ్మొழிలో అనుగ్రహించిన సూక్తిని అనుసరించియే **"పుణ్డరీకదళామల... ఈక్షణః"** అని శ్రీరామానుజులు ప్రయోగించారు. పూర్వం ఉట్టంకించిన పాశురాలను, **'కరియవాకి పుడై పరన్దు మిళిర్న్దు శెవ్వరియోడి నీణ్డ అప్పెరియవాయ కణ్గళ్"** (నల్లనివై, పర్యంతంవరకు విస్తరించి, మెఱిసి, ఎఱ్ఱని రేఖలతో కూడిన విశాలమైన ఆ పెద్ద నేత్రాలు) అనే అద్వితీయమైన తిరుప్పాణ్ ఆళ్వార్ల పాశురాన్ని అనుసంధిస్తూ **"పుణ్డరీక .... అయతేక్షణః"** అని అన్నారు. ఆళ్వార్ల శ్రీసూక్తులను విడిచిపెట్టి వేఱు సంస్కృత ప్రమాణాలలో ఏది అయినా శ్రీరామానుజులకు ఆధారమైనదని చూపించాలి. సంస్కృత గ్రంథాలలో ప్రమాణాన్వేషణాన్ని చేసేవారుండవచ్చు. ఆ విధంగా వెదకేవారికి **'రామః కమలపత్రాక్షః'** అనే శ్రీరామాయణ శ్లోకం కన్పించవచ్చు. ఆ శ్లోకాన్ని అనుసరించి నమ్పిళ్లై రసఘనంగా వ్యాఖ్యానించిన సందర్భం కూడా కన్పించ వచ్చు. శ్రుతప్రకాశికాచార్యులవారు కూడా ఆ వచనాన్ని ఉట్టంకించారు కూడా.

**"ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్"** (వేదాన్ని ఇతిహాస పురాణాలతో వివరించాలి) అని, **"వేదోపబృంహణార్థాయ తావగ్రాహయత ప్రభుః"** (ప్రభువైన ఆ వాల్మీకి వేదాల ఉపబృంహణం కోసం ఆ కుశలవులను ఇద్దరిని స్వీకరించాడు) అని పల్కిన రీతిలో ఇతిహాస శ్రేష్ఠమైన శ్రీరామాయణం వేదోపబృంహణాలలో చాలా ప్రధానమైనది కనుక, అందులో ఉండే **"రామః కమలపత్రాక్షః"** అనే వచనాన్ని భగవద్రామానుజులు ఆధారంగా గ్రహించారు- అని అంటే ఆ మాటను కాదనవలసిన ఆవశ్యకత కొంచెం కూడా లేదు. ఆ*ళ్వా*ర్ల శ్రీసూక్తులలో ప్రవేశం లేనివారినికూడా ఆనందింపజేయుగోరి సంస్కృత వచనాలనుకూడా ఉట్టంకిస్తారు, మన ఆచార్యసార్వభౌములు. సంస్కృతవచనాల ద్వారా అమృతబిందు శీకరం లభిస్తుందే తప్ప **"అముదవెళ్ళమ్"** అనదగిన అమృతప్రవాహం లభించదు. లభించే దారి లేదు కూడా. **"శ్రీమాధవాంఘ్రిజలజ ద్వయనిత్యసేవా ప్రేమావిలాశయపరాంకుశ పాదభక్తులైన"** (శ్రియఃపతి చరణకమలాలు రెండింటికి నిత్యసేవను చేయడంలోని ప్రేమచేత ఆర్తిని కల్గిన హృదయాన్ని కల పరాంకుశులనే నమ్మా*ళ్వా*ర్ల శ్రీచరణాలలో భక్తిని కలవారైన) శ్రీరామానుజుల అనుభవాలు ఆ*ళ్వా*ర్ల శ్రీసూక్తులనుండే కట్టలు తెంచుకొని ప్రవహిస్తాయి- అని మాత్సర్యాన్ని కలవారు సైతం అంగీకరించి తీరాలి.

### శ్రీరంగగద్యశ్రీసూక్తి - తిరువాయ్మొ*ళి*

భగవద్రామానుజులు అనుగ్రహించిన శ్రీరంగగద్య- **"స్వాధీనత్రివిధ చేతనాచేతనస్వరూపస్థితిప్రవృత్తిభేదమ్"** (మూడు విధాలైన చేతనాచేతనాల స్వరూపం, స్థితి, ప్రవృత్తుల ప్రకారాలను తన అధీనంలో కలవానిని) అని ఆరంభమవుతున్నది. చేతనులయొక్క, అచేతనాలయొక్క స్వరూపం, రక్షణం, ప్రవృత్తి, నివృత్తి- అనే వీనిని తన అధీనంలో కలవాడు, భగవానుడు- అనేది పైన ఉదాహరించిన శ్రీసూక్తిలోని భావం. ఈ విషయాన్ని శ్రీరామానుజులు ఏ ప్రమాణాన్ని పురస్కరించుకొని పలికారు? అని విచారించినపుడు, నా బుద్ధికి స్ఫురించిన ఒక విషయాన్ని వివరిస్తాను.

భగవద్రామానుజులు అనుగ్రహించే శ్రీసూక్తులు ప్రాయికంగా తిరువాయ్ మొ*ళి* ప్రబంధాన్ని అనుసరించి ఉంటాయి- అనేది పెద్దల అభిప్రాయం. దీనిని దాసుని విమర్శ చక్కగా నిరూపిస్తుంది. ప్రకృతవిషయాన్ని గూర్చి విమర్శించినపుడు,

తిరువాయ్‌మొ*ఴ్రి*లోని మొదటి దశకంలో గల **4,5,6**వ పాశురాలలో క్రమంగా నమ్మా*ఴ్వా*ర్లు అనుగ్రహించిన అర్థాన్ని సమీకరించి **"స్వాధీనే"**త్యాది శ్రీసూక్తిని శ్రీరామానుజులు అనుగ్రహించారు- అని నిశ్చయింపబడుతున్నది. **"నామవని వనువళ్"** అనే నాల్గవ పాశురంలోని భావం ఏమి? అని అంటే - **"నామ్"** (మేము) అనే ఉత్తమపురుషలోని వస్తువులు, **"అవన్, ఇవన్, అవన్"** అనే పుంలింగ ప్రథమపురుషలోని వస్తువులు, **"అవళ్, ఇవళ్, అవళ్"** అని స్త్రీలింగం ప్రథమ పురుషలోని వస్తువులు, **"అవర్, ఇవర్, అవర్"** అనే బహువచనం ప్రథమపురుషలోని వస్తువులు, **"అదు, ఇదు, ఉదు"** అనే ఏకవచనం ప్రథమపురుషలోని వస్తువులు **"ఏతు"** అనే ఏకవచనంలోని ప్రశ్నార్థక వస్తువులు, నశించే స్వభావాన్ని కల వస్తువులు, **"ఇవై, అవై, ఎవై"** అనే బహువచనం ప్రథమపురుషలోని వస్తువులు, మంచి వస్తువులు, చెడ్డ వస్తువులు, భవిష్యత్కాలిక వస్తువులు, భూతకాలిక వస్తువులు- అనే అన్ని వస్తువులు ఆ సర్వేశ్వరుడే. (అంటే) ఆ సర్వేశ్వరునకు అధీనాలే- అని ఆ పాశురభావం. లోకంలో ఉండే చేతనాచేతన ద్రవ్యాలు అన్నీ ఈ చిన్న పాశురంలో ఉక్తి వైచిత్రి ద్వారా పొందుపఱచబడి, ఈ ద్రవ్యాలన్నిటి యొక్క స్వరూపం భగవానుని అధీనం - అని తెలుపబడినందువల్ల, దీనినే **"స్వాధీనత్రివిధ చేతనాచేతన స్వరూప"** అని శ్రీరామానుజులు అన్నారు. ఇంకా కొంచెం గమనిద్దాం.

దీని తరువాత పాశురం -**"అవరవర్ తమతమతు"** అని ఆరంభమవుతున్నది. లోకంలో పలు విధాలైన అధికారులున్నారు కదా! ఆయా అధికారులు తమ జ్ఞానానికి అనుగుణంగా తమకు అభిమతమైన దైవాలను స్వామిగా భావించి ఆశ్రయిస్తారు. ఈ విధంగా ఆయా అధికారులచే ఆరాధింపబడే ఆయా దైవాలు వారు వారు కోరిన ఫలాలను ఇవ్వడంలో ఏ లోటు లేకుండా ఉన్నారు. ఎందువల్ల? అని అంటే, సర్వస్వామి అయిన శ్రీమన్నారాయణుడు ఆయా అధికారులు తమ అదృష్టానుసారంగా ఫలాన్ని పొందేటట్లు ఆయా దైవాలకు అంతర్యామిగా వేంచేసియున్నాడు. అందువల్లనే, వారు ఆయా అధికారులు ప్రార్థించిన ఫలాలను ఇవ్వడంలో ఏ లోటు లేకుండా ఉన్నారు - అనేది ఈ పాశురభావం. దీనిద్వారా తెలుపబడినది ఏమి? అని అంటే, లోకంలో జరిగే రక్షణ కార్యం అంతా శ్రీమన్నారాయణుడైన భగవానునిదే. బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు మొదలైన దేవతాంతరాలను గూర్చి, ఇంకా అతిక్షుద్ర దైవాలను గూర్చి ఆయా అధికారులు

ఆరాధనలను చేసి తాము కోరిన ఫలాలను పొందుతున్నట్లు గమనించినా, అదికూడా భగవానుడే ఆ దైవాలకు అంతర్యామిగా ఉండి నిర్వహించే రక్షణమే తప్ప, ఆ దైవాలు స్వతంత్రంగా చేసే రక్షణ కాదు- అని తెలుపబడినట్లయింది. **"న హి పాలన సామర్థ్యమృతే సర్వేశ్వరం హరిమ్"** (అందరికీ ప్రభువైన హరికి తప్ప ఇంకా ఎవరికీ పాలన సామర్థ్యం లేదు) అని, **"న సంపదాం సమాహారే విపదాం వినివర్తనే, సమర్థో దృశ్యతే కశ్చిత్ తం వినా పురుషోత్తమమ్"** (సంపదలను పొందించడంలో, ఆపదలను తొలగించడంలో ఆ పురుషోత్తముడు తప్ప వేరొక సమర్థుడు కనిపించడం లేదు) అనే ప్రమాణాలను అనుకరించి ఇది అనుగ్రహింప బడంది. కనుక, ఈ పాశుర ప్రమేయాన్ని దృష్టిలో ఉంచుకొని **"స్వాధీనత్రివిధ చేతనాచేతన స్వరూపస్థితి"** అని శ్రీరామానుజులు పలికారు. స్థితి అంటే -రక్షణం. చేతనాచేతన రక్షణాన్ని తన అధీనంలో కలవాడు, భగవానుడు -అని తాత్పర్యం. ఇంకా గమనించండి.

ఇక, ఆఱవ పాశురం. ఇది **"నిన్రనర్ ఇరున్దనర్"** అని ప్రారంభమవుతున్నది. ఈ పాశురంలోని భావం ఏమి? అంటే- నిలిచి ఉండేవారు, కూర్చుని ఉండేవారు, శయనించి ఉండేవారు, సంచరించేవారు- అని ఈవిధంగా కన్పించే ప్రవృత్తిశీలురు, నిలిచి ఉండనివారు, కూర్చుని ఉండనివారు, శయనించి ఉండనివారు, సంచరించనివారు- అని ఈ రీతిలోని నివృత్తిశీలురు- వీరంతా భగవానుని అధీనంలోనివారు- అనేది ఈ పాశురభావం. ఇందులో ప్రవృత్తిశీలురు, నివృత్తిశీలురు -అనే ఇరువురిని చెప్పినా, వారు ఇక్కడ వివక్షితులు కారు. పూర్వం **"నామవనివనువళ్"** అనే పాశురంలోనే సకల ధర్మనిర్దేశం చేయబడినందున, అందఱు భగవదధీనంలో ఉన్నవారనే విషయం అందులో ప్రతిపాదితపూర్వం. కనుక ఆవిషయం మళ్ళీ ఈ పాశురంలో చెప్పబడి ఉండకూడదు. లేకపోతే పునరుక్తి దోషం సంభవిస్తుంది. అందువల్ల, ప్రవృత్తి- నివృత్తులను కలవారు భగవదధీనంలో ఉన్నవారు- అని తెలిపే ఈ పాశురం. వారి వారి ప్రవృత్తి-నివృత్తులనే ధర్మాలు భగవదధీనాలని ఈ పాశురంలో తెలుపబడింది. ఈవిధంగా **"నిన్రనర్ ఇరున్దనర్"** అనే పాశురభావం- నిలచి ఉండడం, కూర్చుని ఉండడం, శయనించడం, సంచరించడం- అనే ప్రవృత్తులు, నిలచి ఉండకపోవడం, కూర్చుని ఉండకపోవడం, శయనించి ఉండకపోవడం, సంచరించకపోవడం- అనే నివృత్తులు

భగవానుని అధీనాలు- అని తప్ప వేఱు కాదు. ఈ విషయం సకల పూర్వాచార్య వ్యాఖ్యాన సిద్ధం.

"నిన్టనర్" (నిలుచుని ఉండేవారు) అనే పదానికి 'నిలచి ఉండడం' అనే అర్థం ఏవిధంగా పరిగ్రాహ్యం? అని కొందఱి మనస్సు సందేహపడవచ్చు. వారికి తెలియజేసే వివరం ఏమంటే- వేదంలో యాగం చేసేవాడు సోమపానాన్ని చేయాలని చెప్పబడింది. సోమపానం అంటే - సోమలతనుండి తీసిన రసాన్ని పానం చేయడం. ఆ లతను ఏవిధంగా సంపాదించాలి? అరణ్యాలలో తానే తిరిగి సంపాదించాలా? లేక, వెలకు కొని సంపాదించాలా? అనే విచారం చేసినప్పుడు **"గో అర్ఘమేవ సోమం కరోతి"** అనే వేదవాక్యం పశువును ఇచ్చి సోమలతను సంపాదించాలని తెల్పుతున్నది. ఈ వేదంలోనే ఇంకొకచోట **"అరుణ్యా పింగాక్ష్యా సోమం క్రీణాతి"** అని తెలుపబడింది. సోమలతను కొనేటపుడు ఇచ్చే పశువు ఎఱ్ఱని రంగును కలిగినది, పింగ (పసుపు పచ్చని) వర్ణాన్ని కలిగిన కన్నులను కలిగినదై ఉండాలని దీని అర్థం. ఈ విధంగా ఎఱ్ఱని రంగు కల పశువుతో సోమలతను సంపాదించాలి- అని చెప్పినా, పశువుతో సోమలతను సంపాదించాలని ఇతఃపూర్వమే చెప్పబడినందు వల్ల, అంతకుముందు చెప్పబడని విషయమే విధికి విషయం కావలసి ఉన్నందున, తరువాత చెప్పబడ్డ వాక్యంలో ఎఱ్ఱని రంగు మాత్రమే విధింపడినదని గ్రహింపబడు తున్నది. **"నిన్టనర్ ఇరున్దనర్"** అనే పాశురంలోని రీతి కూడా ఇదే.

వేఱొక దృష్టాంతాన్ని కూడా చూడండి. అభిచార యజ్ఞంలో ఋత్విక్కులు తలపాగాతో సంచరించాలని వేదంలో ఒకచోట తెలుపబడింది. ఇంకొకచోట **"లోహితోష్ణీషా ఋత్విజః ప్రచరంతి"** అని తెలుపబడింది. అంటే- ఎఱ్ఱని రంగును కల తలపాగాను కలవారై ఋత్విక్కులు సంచరించాలని దీని అర్థం. ఇక్కడకూడా తలపాగాను ధరించడాన్నిగూర్చి ఇతఃపూర్వమే తెలుపబడినందువల్ల, ఇందులో **"లోహితత్వం"** (ఎఱ్ఱని రంగు) మాత్రమే విధికి విసయమని గ్రహింపబడుతున్నది. **"నిన్టనర్ ఇరున్దనర్"** పాశురంలోని ప్రక్రియ కూడా ఇదే. ప్రవృత్తిని కలవారు, నివృత్తిని కలవారు ఈ పాశురంలో నిర్దేశింపబడినా, ప్రవృత్తి నివృత్తులు మాత్రమే ఈ పాశురంలో వివక్షితమని తాత్పర్యం. కనుక, ఈ పాశుర ప్రమేయాన్ని గ్రహించి శ్రీరామానుజులు **"స్వాధీన త్రివిధ చేతనాచేతన స్వరూపస్థితి ప్రవృత్తిభేదమ్"** అని పలికారు. అందువల్ల, ఈరీతిలో, తిరువాయ్‌మొழிలోని మొదటి శతకం- మొదటి

దశకంలోని 4వ, 5వ, 6వ పాశురాల భావాన్ని మనస్సులో ఉంచుకొని, దాని సంగ్రహరూపంగా **"స్వాధీనే"**త్యాది చూర్ణికను శ్రీరామానుజులు అనుగ్రహించారని స్పష్టపడింది.

"ఈ విషయం ఉపనిషత్తులలో కూడా చెప్పబడి ఉండవచ్చు కదా! శ్రీరామానుజులు ఉపనిషత్తులను ఆధారంగా చేసికొనియే ఈ సూక్తిని అనుగ్రహించారు- అని భావించకూడదా?" అని కొందఱు అడుగవచ్చు. ఈ విషయం ఉపనిషత్తులలో వరుసలో ఈ రీతిలో చెప్పబడలేదు. ఒక విషయం ఒక మూల, ఇంకొక విషయం ఇంకొక మూల చెప్పబడింది. అది కూడా ఇంత స్ఫుటంగా తెలుపబడలేదు. అరుదైన, గొప్పవైన అర్థాలను స్పష్టంగా తెలిపే రీతి తిరువాయ్‌మొ*ழி* ప్రబంధంలోనే కనిపిస్తుంది. అందువల్ల శ్రీరామానుజులు దేనిని అయినా నిష్కర్షించి పల్కడం, తిరువాయ్‌మొ*ழி*ని దృష్టిలో పెట్టుకొనియే -అని నిశ్చయించుకోవడంలో అడ్డులేదు.

### "కిరీటమకుట చూడావతంస" అనే సూక్తి- ఆ*ழ*్వార్ల శ్రీసూక్తి

శ్రీరామానుజులు అనుగ్రహించిన శరణాగతి గద్యలో **"అఖిలహేయ ప్రత్యనీక"** అని ప్రారంభమవుతున్న ఒక పెద్ద చూర్ణికలో, భగవానుని దివ్యరూప వర్ణనం, దివ్యగుణవర్ణనం, దివ్యభూషణ వర్ణనం, దివ్యాయుధ వర్ణనం, దివ్యమహిషీ వర్ణనం- మొదలైన పలు వర్ణనలు ఆశ్చర్యకరంగా అనుగ్రహింపబడ్డాయి. వాటిలో దివ్యభూషణ వర్ణనపరమైన **"స్వోచితవివిధ విచిత్రానందే"**త్యాది వాక్యంలో గల **"కిరీటమకుటచూడావతంస"** అనే శ్రీసూక్తి లోని గంభీరమైన అర్థాన్ని గూర్చి కొంచెం విమర్శింపబడుతున్నది.

చూర్ణికలో కిరీటమని, మకుటమని, చూడావతంసమని ప్రత్యేక ప్రత్యేకంగా మూడు పదాలున్నా, ఈ మూడు శిరస్సులో అలంకరించే ఆభరణాలనే నిర్దేశిస్తాయి. ఆభరణాలు ఒకే రీతిలో ఉండవు. తిరువభిషేకమని, కొండె అని, తొప్పారమని మూడు విధాలుగా వ్యవహరింపబడతాయి. ఆ మూడు విధాలైన ఆభరణాలకు వాచకంగా కిరీట-మకుట-చూడావతంసమనే మూడు పదాలు ప్రయోగింపబడ్డాయని చెప్పాలి.

ముఖ్యమైనది, ఉపదేశపరంపరా ప్రాప్తమైనది అయిన ఒక రస్యరహస్యార్థాన్ని ఇక్కడ తెలియవలసి ఉన్నది. **"తమి*ழ*్‌మాలైకళ్ ఆయిరముమ్ ఈన్ఱ ముదల్**

**తాయ్ శడకోపన్, మొయ్మ్బాల్ వళర్త్త ఇదత్తాయ్ ఇరామానుశన్"** (ద్రావిడ వేదాలైన వేయి పాశురాలను ప్రసవించిన కన్నతల్లి-శఠకోపులు, వాటిని తన సామర్థ్యంతో వృద్ధి చేసిన హితపరురాలైన తల్లి- శ్రీరామానుజులు) అనే రీతిలో భగవద్రామానుజులు తిరువాయ్మొళ్గిని వృద్ధి చేసినవారై, అనవరతం అందులోనే గంభీరంగా అవగాహించినవారై ఉన్నందువల్ల నమ్మాళ్వార్ల ఒక దివ్యసూక్తిని మనస్సులో పెట్టుకొనియే **"కిరీట మకుట చూడావతంస"** అను మూడు శిరోభూషణాలను గూర్చి పలికారు.

మఱి, ఆ ఆళ్వార్ల దివ్యసూక్తి ఏది? అని అంటే, తిరువిరుత్త ప్రబంధంలోని- **"పారళన్ద పేరరశే! ఎమ్ విశుమ్బరశే! ఎమ్మై నీత్తు వఞ్జిత్త ఓరరశే"** (భూమిని కొలిచిన ఓ గొప్పరాజా! మా పరమపదానికి రాజా! మమ్ములను విశ్లేషించి వంచించిన అద్వితీయమైన రాజా!) అనే సూక్తియే. ఇందులో **"అరశే! అరశే! అరశే!"** అని మూడు సంబోధనలను ఆళ్వార్లు చేశారు. **"పారళన్ద పేరరశే!"** అని అన్నందువల్ల లోకాలను కొలిచే నెపంతో అందఱి తలలపై శ్రీచరణాలను పెట్టడం- అనే సౌలభ్యగుణం అనుభవింపబడింది. **"ఎమ్ విశుమ్బరశే!"** అనే సంబోధన ద్వారా నిత్యసూరినాథత్వమనే పరత్వం అనుభవింపబడింది. **"ఎమ్మై నీత్తు వఞ్జిత్త ఓరరశే!"** అనే సంబోధన ద్వారా తమతో సంశ్లేష విశ్లేషాలను చేయడమనే ప్రణయిత్వగుణం అనుభవింపబడింది. ఈ విధంగా సౌలభ్యానికి శిరస్సును పరివేష్ఠించిన ఒక కిరీటం, పరత్వం కోసం ఇంకొక కిరీటం, ప్రణయిత్వ గుణం కోసం మఱి ఒక కిరీటం- అని మూడు కిరీటాలు నమ్మాళ్వార్లచే భగవానునకు అలంకరింపబడ్డాయి. ఈ విషయం ఆచార్యహృదయమనే దివ్యగ్రంథంలోని **"పారళన్ద వెన్నుమ్ మున్టు ముడిక్కురియ ఇళవరశుక్కు"** (**"పారళన్ద"** అనే సూక్తిలో తెలుపబడినట్లు మూడు కిరీటాలకు తగిన యువరాజుకు) అనే సూక్తిద్వారా తెలుపబడింది.

ఈ విధంగా భగవానునకు గల మూడు విధాలైన సామ్రాజ్యాభిషేకాలు (కిరీటాలు) ఆళ్వార్ల అభిప్రాయానుసారం ఉండి ఉంటాయని భావించిన శ్రీరామానుజులు **"కిరీట, మకుట, చూడావతంస"** అనే మూడు పదాలతో మూడు కిరీటాలను నిర్దేశించారు- అని దృఢంగా చెప్పవచ్చు.

ఈ సందర్భంలో ఒక సందేహం కలుగవచ్చు. "ప్రణయిత్వగుణమనేది సౌలభ్యగుణంతో అంతర్భూత మవుతుందా? దానిని ప్రత్యేక గుణంగా పలికి, దాని కోసంగా ఒక కిరీటాన్ని సమర్పించినట్లు చెప్పాలా?'' అనేదే ఆ సందేహం. దీనికి సమాధానాన్ని వినండి- అంతరంగ భక్తులపట్ల అసాధారణంగా ప్రదర్శించే ప్రణయిత్వగుణాన్ని సర్వసాధారణమైన సౌలభ్యగుణంలో అంతర్భవించినట్లు భావించడం పొసగదు.

శ్రీభాష్య మంగళశ్లోకమైన **"అఖిలభువన జన్మస్థేమ"** ఇత్యాది శ్లోకంలోని మొదటి పాదంలో స్థేమ శబ్దంతో రక్షణం తెలుపబడినప్పటికీ, తిరిగి రెండవ పాదంలో **"వినతవివిధభూతవ్రాతరక్ష"** నిర్దేశింపబడింది. దీనిని ఈవిధంగా ప్రత్యేకంగా చెప్పాలా? మొదటి పాదంలో చెప్పబడ్డ స్థేమశబ్దార్థమైన రక్షణలోనే ఇది అంతర్భూతం కాదా? అని ప్రశ్నిస్తే, "అక్కడ సామాన్య రక్షణ తెలుపబడగా, ఇందులో విశేష రక్షణ తెలుపబడింది'' అనే సమాధానాన్ని చెప్పవలసియున్నది. బుభుక్షువుల రక్షణం వేఱుగా, ముముక్షువుల రక్షణంగా వేఱు కదా ఉంటుంది. అదే రీతిలో, **"ఉణ్డియే ఉడైయే ఉకన్దు ఓడుమ్ ఇమ్మణ్డలమ్"** (భుజించి, చక్కని వస్త్రాలను ధరించి ఆనందించి సంచరించే ఈ భూమండలం)లోని వారిపట్ల చూపే సౌలభ్యం, **"ఉణ్ణుమ్ శోఱు పరుకు నీర్ తిణ్ణుమ్ వెఱ్ఱిలైయుమ్ ఎల్లామ్ కణ్ణన్ ఎమ్బెరుమాన్ ఎన్ఱెన్ఱే"** (భుజించే అన్నం, తాగే నీరు, అనుభవించే తాంబూలం అన్నీ శ్రీకృష్ణుడైన భగవానుడే అని తలచే) నమ్మాళ్వార్ల వంటివారిపట్ల చూపే సౌలభ్యం- ఈ రెండిటిలో చాలా వ్యత్యాసం ఉన్నది కనుక, ఇవి రెండు ఒకటి కావు. దానికి సౌలభ్యమని పేరు, దీనికి ప్రణయిత్వమని పేరు. అందువల్ల, మూడు కల్యాణగుణాలకోసం సమర్పించిన మూడు సామ్రాజ్యాభిసేకాలకోసం మూడు కిరీటాలు- అని అనడం చాలా సరసం.

## శ్రీభాష్యంలోని ఒక అద్భుతవిషయం

గీతాచార్యుడు గీతలో తన అవతారప్రయోజనాన్ని తెలిపేటపుడు **"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"** (సాధువులను రక్షించడంకోసం, దుష్టులను నాశనం చేయడంకోసం, ధర్మసంస్థాపనకోసం ప్రతియుగంలో నేను జన్మిస్తాను) అని అంటూ సాధుపరిత్రాణం, దుష్కృద్వినాశం, ధర్మసంస్థాపన- అనే మూడు ప్రయోజనాలను

నిర్దేశించాడు. ఈ ప్రయోజనాలకోసం భగవానుడు తమోమయమైన ఈలోకంలో **"తుయిల్ మలియుమ్ మనిశర్ పిఱవియిల్ కణ్కాణ వన్దు"** (నిద్రా ప్రచురమైన మానవజన్మలో అందటికి కన్పించేటట్లు వచ్చి) జన్మించాలా? **"నాట్టిల్ పిఱడు పడాదన పట్టు మనిశర్క్కాయ్"** (ఈ లోకంలో జన్మించి, మానవుల కోసం పలుపాట్లుపడి) అని ఆళ్వార్లు పల్కిన రీతిలో మానవరీతిలో కర్మవశ్యులైన సంసారులు సైతం పడని కష్టాలను అనుభవించి, ఈ మానవలోకంలో భగవానుడు వచ్చి అవతరించాలా ? సత్యసంకల్పుడైన తాను తన సంకల్పాన్ని పురస్కరించుకొని ఏ కార్యాన్ని అయినా నిర్వహించవచ్చుకదా! ఎంతమంది సాధుజనులను రక్షించవలసి ఉన్నా, ఎంతమంది దుష్టులను శిక్షించవలసి ఉన్నా తన అవ్యాహతమైన శక్తినికల సంకల్పంతో వానిని నిర్వహించి పూర్తి చేయడంలో ఏమి అడ్డు? సాధుపరిత్రాణంకోసం, దుష్కృద్వినాశంకోసం, ధర్మసంస్థాపనకోసం ఆయా సమయాలలో నేనే ఈ లోకంలోకి వచ్చి జన్మిస్తానని అన్నాడే ! ఆ విధంగా ఎందుకు జన్మించాలి? అనే బలమైన ఒక శంక కలిగే అవకాశం ఉన్నది.

దీనికి భగద్గీతశంకరభాష్యంలో ఏవిధమైన పరిహారం కనిపించదు. మధ్వ భాష్యంలో మూలానికి సంబంధం లేకుండా ఏదో వ్రాయబడింది. అది ఏమంటే- **"న జన్మనైవ పరిత్రాణాది కార్యమితి నియమః, తథాపి లీలయా స్వభావేన చ యథేష్టచారీ... లోకవత్తు లీలాకైవల్యమ్"** ఇత్యాదిగా వ్రాయబడింది. భగవానుడు సాధుపరిత్రాణాదులను అవతరించియే చేయాలనే నిర్బంధం లేదు. అయినా లీలార్థంగా అవతరిస్తున్నాడు. బ్రహ్మసూత్రంలో కూడా **"లోకవత్తు లీలాకైవల్యమ్"** అని చెప్పబడింది కదా'' అనేది మధ్వభాష్యపంక్తుల భావం. "సాధుపరిత్రాణం కోసం నేను ఈ లోకానికి వచ్చి జన్మిస్తున్నాను.'' అని మూలంలో స్పష్టంగా చెప్పబడగా దానిని ఖండనం చేసే రీతిలో ఈ భాష్యం అవతరించింది. **"లోకవత్తు లీలాకైవల్యమ్"** అనే బ్రహ్మసూత్రం భగవానుడు చేసే జగత్ సృష్టిని గూర్చినదే తప్ప భగవదవతారాన్ని గూర్చినది కాదు- అనేది నిర్వివాదం. ఈ సూత్రాన్ని ఈ సందర్భంలో ప్రమాణీకరించడం బొత్తిగా అప్రసక్తం.

ఈ విషయం అటు ఉండనివ్వండి. భగవద్రామానుజుల శ్రీభాష్యంలో ఉండే అత్యంతం భోగ్యాలైన అర్థాలను అనుభవిద్దాం. అంతరధికరణ శ్రీభాష్యంలో **"అంత స్తద్ధర్మోపదేశాత్"** (1-1-21) అనే సూత్రం యొక్క భాష్యంలో **"పరిత్రాణాయ**

**సాధూనామ్"** అనే ఈ భగవద్గీతా శ్లోకాన్ని ప్రసక్తానుప్రసక్తంగా ఉదాహరించి, **"సాధవో హి ఉపాసకాః, తత్పరిత్రాణమేవోద్దేశ్యమ్. ఆనుషంగికస్తు దుష్కృతాం వినాశః, సంకల్పమాత్రేణాపి తదుపపత్తేః"** (సాధువులంటే ఉపాసకులు కదా వారి రక్షణమే అవతారంలోని ఉద్దేశ్యం. దుష్టవినాశనం ఆనుషంగిక ప్రయోజనం ఎందుకు? అంటే, అది సంకల్ప మాత్రంతో సైతం జరుగవచ్చు కనుక) అని అనుగ్రహింపబడినది. సాధు పరిత్రాణం లోకమే ముఖ్యంగా భగవానుడు అవతారాలను ఎత్తాడని, దుష్టనిరసనం అనేది సంకల్పంతో సైతం సాధ్యం కనుక, అవతారానికి అది ప్రధానోద్దేశ్యం కాదని పైన ఉట్టంకించిన శ్రీభాష్య శ్రీసూక్తి ద్వారా తెలుపబడుతున్నది.

సాధుపరిత్రాణం మాత్రం ఎందువల్ల సంకల్పమాత్రంచేతనే సిద్ధించకూడదు? **"సాధవః పరిత్రాతా భవంతు"** (సాధు జనులు రక్షింపబడిన వారగుగాక) అని సంకల్పిస్తే అది జరుగుతుందా? అని అంటూ ఎవరైనా శ్రీభాష్యసూక్తిని ఉద్దేశించి ఆక్షేపాన్ని పల్కితే దానికి ఏమి పరిహారం? అంతేకాక, "దుష్కృద్వినాశం సంకల్పసాధ్యం కావచ్చు. సాధుపరిత్రాణం ఆవిధంగా సంకల్ప సాధ్యం కాలేదు- అని శ్రీరామానుజులు నిశ్చయించగా అనుగ్రహించడానికి ఏది ఆధారం?" అని అంటూ ఎవరైనా ప్రశ్నిస్తే దానికి తృప్తికరమైన సమాధానాన్ని చెప్పగలగాలి కదా!

నమ్మాళ్వార్లు తిరువాయ్‌మొళ్ఱి ప్రబంధంలో **"మఴుఙ్గాద వైనుతియ శక్కర నల్ వలత్తైయాయ్ తొழుమ్ కాదల్ కళిఱుళిప్పాన్ పుళ్ళూర్‌న్దు తోన్డినైయే, మఴుఙ్గాద ఞానమే పడైయాక మలరులకిల్ తొழుమ్ పాయారుక్కు అళిత్తాల్ ఉన్ శుడర్‌చ్చోది మఱైయాదే"** (మొక్కవోని పదునైన అంచును కలిగిన చక్రాయుధాన్ని కుడిచేతిలో కలవాడా! నిన్ను పూజించే భక్తిని కల గజేంద్రుని రక్షించడంకోసం నీవు గరుడుడనే పక్షిని ఎక్కి వచ్చావు కదా! మొక్కవోని, వ్యర్థం కాని జ్ఞానాన్నే సాధనంగా చేసికొని, సృష్టి చేయబడే లోకంలో నిన్ను ఆరాధించేవారిని అక్కడి నుండే రక్షిస్తే నీ వెలిగే తేజస్సు వెలవెల పోతుంది కదా) అనే ఒక పాశురాన్ని అద్భుతంగా అనుగ్రహించారు. **"ఆళ్వార్ ఎమ్బెరుమానార్ జీయర్ తిరువడికళే శరణమ్"** అని విన్నవిస్తాను.

ఈ తిరువాయ్‌మొళ్ఱి పాశురంలోని మూడవ పాదంలో **"మఴుఙ్గాద ఞానమ్"** అంటే - భగవానుని సంకల్పరూపజ్ఞానం. "భగవన్! నీవు సాధుపరి

త్రాణాన్ని చేయగోరి నేరుగా వచ్చి అవతరించకుండా, సంకల్పంతోనే దానిని (సాధు రక్షణను) చేసినట్లయితే, నీ ప్రకాశం వెలవెలపోతుంది. ఆ విధంగా సంకల్పంతో చేయకుండా నేరుగా వచ్చి అవతరించినందువల్లనే నీ తేజస్సు ప్రకాశించింది'' - అనేది ఆ ప్రాశురంలోని ఉత్తరార్ధంలో నమ్మాళ్వార్లు తెలిపిన భావం. దీనిని బట్టి సాధుపరిత్రాణం సంకల్ప సాధ్యం కాదు- అనేది స్పష్టంగా తెలుపబడింది. "ఆళ్వార్లు ఈవిధంగా పల్కితే మాత్రం ఏమి? సాధు పరిత్రాణం ఎందువల్ల సంకల్ప సాధ్యం కాదు?'' అని కొందఱు అడుగుతారు. అవును. నిజమే. అది సంకల్ప సాధ్యం కాదు- అనేదానిని ఆ పాశురంలోని పూర్వార్ధంలో ఒక వృత్తాంతాన్ని ప్రస్తావించడం ద్వారా ఆళ్వార్లు శిలాలిఖితం చేశారు. **"తొழుమ్ కాదల్ కళిఱళిప్పాన్ పుళ్ళూర్న్దు తోన్ఱినైయే"** (నిన్ను పూజించే ప్రేమను కల గజేంద్రుని రక్షించడంకోసం గరుడుడనే పక్షిని అధిరోహించివచ్చావు కదా) అని అంటూ గజేంద్రాళ్వాన్ యొక్క కథను ప్రస్తావించి చూపి, నమ్మాళ్వార్లు తమ వివక్షితార్థాన్ని సుస్థాపితం చేశారు.

గజేంద్రమోక్ష వృత్తాంతం అందరికి తెలిసినదే. మొసలి నోటిలో చిక్కుకొన్న మదవారణం "అది మూలమా! రక్షించు'' అని ఆక్రోశించి పిలువగా, భగవానుడు పరమపదం నుండి **"అరై కులైయ త్తలై కులైయ"** (నడుమున బట్ట జారిపోయేటట్లు, కొప్పుముడి విడిపోయేటట్లు) గరుడుని తానే ఎత్తుకొని వేగంగా పరుగెత్తి, గజేంద్రుడు పట్టుబడ్డ సరస్సు ఒడ్డుకు వచ్చి, అతనిని అనుగ్రహించిన వృత్తాంతం ఉన్నది. దివ్యదేశాలన్నిటిలో ఇది గొప్ప ఉత్సవంగా ఈనాటికి జరుపబడుతున్నది. దీనిని గూర్చి బుద్ధిమంతులు కొంచెం ఆలోచించాలి. గజేంద్రునకు అనుగ్రహించడం భగవదభిప్రాయమైతే పరమపదం నుండి సరస్సు తీరానికి రెండు రీతులలో అనుగ్రహించవచ్చునే! **"విశ్వం ధియైవ విరచయ్య నిచాయ్య భూయః సంజహ్రుషః"** (సంకల్పంతోనే లోకాన్ని సృష్టించి రక్షించి, లయం చేసే నీయొక్క) అని అంటూ కూరేశులు అనుగ్రహించిన రీతిలో సకలప్రపంచంయొక్క సృష్టిస్థితిసంహారాలను అన్నిటిని అవలీలగా నిర్వహించడానికి సాధనమై ఉండే సంకల్పం ఎక్కడికి పోయింది? **"గజేంద్రః త్రాతో భవతు"** (గజేంద్రుడు రక్షింపబడినవాడుగాక) అని సంకల్పిస్తే కానిది ఉన్నదా? సంభవించదు - అని ఎవరూ చెప్పలేరు. ఈ సంకల్పాన్ని పురస్కరించుకొనే సులభంగా గజేంద్ర రక్షణాన్ని చేసి ఉండవచ్చును కదా! ఇంతే

కాకుండా, వేఱొక విధానం కూడా ఉన్నది. అది ఏమంటే - ఆజ్ఞాపించి పంపిన దిశలోని కార్యాన్ని నిర్వహించగలిగిన శ్రీ సుదర్శనుడు కైంకర్య నిర్వహణకు సిద్ధంగా ఉన్నాడు. **"కరుతు మిడమ్ పొరుతు"** (భగవానుడు తలచిన చోటుకు పోయి పోరాడే) **"కైన్నిన్ఱ శక్కరత్తన్"** (చేతిలో నిలచి ఉండే చక్రాయుధాన్ని కలవాడు) (తిరువాయ్-10-6-8) అనే రీతిలో ఈ దిక్కులో ఈ కార్యాన్ని చేయాలి- అని తలచినంతలోనే దానిని పూర్తి చేయగలవాడు, ఆ సుదర్శనుడు. **"కీ*ழு*లకిల్ అశురర్ కళైక్కిణజ్గిరున్ద కిళరామే అ*ழி*విడుత్తు అవరుడైయ కరువణిత్త వ*ழி*ప్పన్"** (పాతాళలోకంలోని అసురులు విజృంభించకుండా సుదర్శనాన్ని ప్రయోగించి, వారిని సమూలనాశనం చేసినవాడు) అని పెరియా*ழ்*వార్లు అనుగ్రహించిన రీతిలో పాతాళ లోకానికి సైతం పోయి, క్షణకాలంలో అరుదైన గొప్ప కార్యాలను నిర్వహించి వచ్చిన ఆసుదర్శనా*ழ்*వాన్‌కు అసాధ్యమైనది ఉన్నదా? అంతేకాక, పరమపదం నుండి సరస్సుతీరానికి వచ్చిన తరువాత కూడా **"గ్రాహం చక్రేణ మాధవః"** (మొసలిని చక్రంతో మాధవుడు సంహరించాడు) అని, **"కైన్నాగత్తిడర్ కడిన్ద కనలా*ழி*ప్పడై యుడైయాన్"** (గొప్ప తొండాన్ని కల గజేంద్రుని దుఃఖాన్ని తీర్చిన జ్వలించే సుదర్శనమనే ఆయుధాన్ని కలవాడు) అని, **"కుట్టత్తుక్కోళ్ ముదలై తుఞ్జ కుటిత్తెఱిన్ద శక్కరత్తాన్"** (పదునైన కోఱలను కల్గి మొసలి నశించేటట్లు గుఱిపెట్టి విసరిన చక్రాయుధాన్ని కలవాడు) అనే రీతిలో ఆ సుదర్శనా*ழ்*వాన్‌ను ప్రయోగించి కదా మొసలిని సంహరించే కార్యాన్ని చేశాడు. సరస్సుతీరానికి చేరిన తరువాతనే అతనిని (సుదర్శనుని) నియమించాలా? పరమపదం నుండే నియమించకూడదా? ఈ విధంగా అప్రతిహతమైన సంకల్పరూప జ్ఞానాన్ని గొని **"వాణీ పౌరాణికీయం ప్రథయతి మహితం ప్రేక్షణం కైటభారేః"** (ఈ పౌరాణికవచనం భగవానుని గొప్పదైన వీక్షణరూప సంకల్పంగా ఏ శ్రీసుదర్శనుని తెలుపుతున్నదో) అనే రీతిలో సంకల్పప్రాప్యభూతుడైన శ్రీసుదర్శనుని పురస్కరించుకొని సులభంగా చేయదగిన గజేంద్ర రక్షణాన్ని ఓ స్వామీ!, ఎందుకోసం నీవు ఆవిధంగా చేయలేదు? అని అంటూ నమ్మా*ழ்*వార్లు భగవానుని ప్రశ్నిస్తున్నారు, పై పాశురంలో. అయితే, ఆ పాశురంలో ఇంతటి ప్రశ్న ఇమిడి ఉన్నదా?- అని సందేహపడనక్కరలేదు. **"మ*ழு*జ్గాద వైనుతియ శక్కర నల్‌వలత్తైయాయ్!"** (పదును పోని అంచును కల్గిన చక్రాన్ని కుడిచేతిలో కలవాడా!) అనే మొదటి పాదంలో "చక్రాయుధాన్ని ఉపయోగించి ఎందుకోసం ఈ కార్యాన్ని

నిర్వహించలేదు?'' అని, "మట్పూజ్గాద ఞానమే పడైయాక" (మొక్కవోని సంకల్పరూప జ్ఞానమే సాధనంగా) అనే మూడవ పాదంతో సంకల్పాన్ని ఉపయోగించి ఎందుకు ఈ కార్యాన్ని చేయలేదు? అని ప్రశ్నిస్తున్నారు- అనే విషయం స్పష్టం.

ఈ ప్రశ్నలకు భగవానుడు తప్ప వేఱెవ్వరూ సమాధానాన్ని పలుకలేరు. కనుక, అతడే వచ్చి ఆళ్వార్ల చెవిలో గజేంద్రుని వద్దకు తాను నేరుగా పరుగెత్తి వచ్చిన కారణాన్ని తెలిపాడు. ఆ సమాధానాన్ని ఆలకించిన ఆళ్వార్లు సమాహితులై, తమ చెవిలో భగవానుడు తెలిపిన సమాధానాన్ని లోకం అంతా తెలిసేటట్లుగా వ్యక్తం చేయాలని, దానిని శ్రీరామానుజులు శ్రీభాష్యంలో ప్రస్తావించాలని భావించి ఆ పాశురంలోని రెండవ పాదంతో దానిని వ్యక్తం చేశారు. (అది ఏమంటే) **"తొழుమ్ కాదల్ కళిఱుళిప్పాన్ పుళ్ళూర్న్దు తోన్ఱినైయే"** అని. **"కళిఱు"**- గజేంద్రాళ్వాన్. అతనికి **"తొழుమ్ కాదల్"** అనే విశేషణాన్ని ఆళ్వార్లు ప్రయోగించ డానికి కారణం - భగవానుడు. అనుగ్రహించిన సమాధానమే. ఇక్కడ గుర్తించ వలసిన విషయం ఇది. గజేంద్రునకు మొసలిని సంహరించడమే ఉద్దేశ్యమైతే, దానిని సంకల్పంతో గాని, సుదర్శనాన్ని ప్రయోగించడం ద్వారాగాని, చేయదగినది అవుతుంది. మొసలిని వధించడం ఇక్కడ ఉద్దేశ్యం కాదు. అపుడు భగవానుని చూచి గజేంద్రుని విన్నపిస్తున్నాడు- **"నాహం కళేబరస్యాస్య త్రాణార్థం మధుసూదన!, కరస్థకమలాన్యేవ పాదయో రర్పితుం తవ"** (స్వామీ! మధుసూదనా! ఈ పాడు శరీరాన్ని మొసలినుండి రక్షించడంకోసం నిన్ను ప్రార్థించడం లేదు. నా చేతిలో ఉండే పూవులను నీ శ్రీచరణాలలో నేరుగా సమర్పించాలనే ఈ ఒక్కటినే ఆశపడ్డాను. **"ఉళ్ళువారుళ్ళిత్తెల్లామ్ ఉడనిరున్దఱిది"** (నిన్ను మనసులో నిలుపకొని ధ్యానించేవారి మనస్సులోని తలపును గ్రహిస్తావు) అనే రీతిలో మీ భక్తుల మనోగతాన్ని తెలిసిన నీవు నా అభిప్రాయాన్ని గ్రహించి నేరుగా వచ్చి సాక్షాత్కరించావు కదా! ఆహా! ఆహా! నీ సర్వజ్ఞత్వం, కరుణ ఎంత గొప్పది! అని గజేంద్రుడు ఆశ్చర్యపడి ఆనందపడి విజ్ఞాపించిన విషయం పురాణ ప్రసిద్ధం.

**"పరిత్రాణాయ సాధూనామ్"** (సాధువుల రక్షణకోసం) అనే చోట ఇటువంటి, భగవానుని సాక్షాత్తు సేవించాలనే భక్తిని కలవారే సాధుశబ్దవాచ్యులని, వారి పరిత్రాణం అంటే- వారు కోరిన రీతిలోనే నేరుగా వేంచేసి సేవను అనుగ్రహించడం, తడవి, మూర్కొని, చల్లని మాటలను పల్కడమేని నిర్ణయించి, ఇది సంకల్ప సాధ్యం

కాదు, సాక్షాదాగమనరూపమైన అవతారంవల్లనే సాధ్యమవుతుంది - అని శ్రీరామానుజులు పల్కడం పైన ప్రస్తావించి, వివరించిన ఆళ్వార్ల శ్రీసూక్తిని పురస్కరించుకొనే తప్ప, వేఱు దేనినిబట్టి కాదు. ఇటువంటి స్పష్టత వేఱు ఏ గీతాభాష్యకర్తలకు లేదు- అనేది నిర్వివాదం. వారు, తాము ఆధారంగా చేసికొన్నది సంస్కృతశాస్త్రవేత్తలే. వాటిలో ఇటువంటి స్పష్టత కల్గడానికి హేతువైన వచన విన్యాసాలు లేనందువల్లనే ఆ భాష్యకారులు ఇటువంటి సందర్భాలలో ఏమి వివరించకుండా కొందఱు, విపరీతంగా వివరించి కొందఱు నిలిచారు. మన భాష్యకారులు ఆళ్వార్ల శ్రీస్తుతి అనే గొప్పనిధిని అండగా చేసుకొన్న బలం వల్లనే దేనిలో అయినా అర్థంలో చక్కని స్పష్టతను కలవారై , విద్వత్‌రసికావతంసనీయాలైన సూక్తులను అనుగ్రహించి, మనలను అందఱలను ఉజ్జీవింపజేశారు. దివ్యప్రబంధాలతో, శ్రీభాష్యంతో తేడా లేకుండా దేనిలోను అవగాహనం లేకుండా, **"మాయభతి యభతి మామా యభతి కః కో యభతి మామాయభతి?"** అని దీనినే వల్లెవేస్తూ- బ్రతికినంతకాలం వ్యర్థంగా పొద్దుపుచ్చేవారు ఆ విధంగానే కాలక్షేపం చేయనీ, ఆళ్వార్లను గూర్చి గాని, శ్రీరామానుజులనుగూర్చి గాని వీరికి దేనికి విచారం?

### తిరుప్పావైను అనుసరించిన గీతాభాష్యం

గీతలో **"యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః, స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే"** (గొప్పవాడు దేనిని ఆచరిస్తాడో, దానినే ఇతరుడు ఆచరిస్తాడట. అతడు ఆ పనిని ఎంతవరకు ఆచరిస్తాడో లోకంలోనివాడు దానిని అనుకరిస్తాడు) (గీత-3-21) అనే శ్లోకం శిష్టాచారమహిమను తెల్పుతున్నది. సంస్కృతజ్ఞులకు అనాయాసంగా అర్థాన్ని గ్రహించగల్గిన శ్లోకం ఇది. దీనిలోని ఉత్తరార్ధానికి భాష్యాన్ని రచించిన శ్రీశంకరాచార్యులవారు **"సః శ్రేష్ఠః యత్ ప్రమాణం కురుతే లౌకికం వా, లోకః తత్ అనువర్తతే, తదేవ ప్రమాణీకరోతీత్యర్థః"** (ఆ గొప్పవాడు దేనిని ప్రమాణంగా స్వీకరిస్తున్నాడో లోకం దానిని అనుసరిస్తున్నది. అంటే, దానిని ప్రమాణంగా చేసుకొంటాడని అర్థం.) అని వివరించారు. శ్రేష్ఠులైనవారు దేనిని ప్రమాణంగా గ్రహిస్తారో దానినే లోకం కూడా ప్రమాణంగా గ్రహిస్తున్నది- అనే అర్థం ఇందులో తెలుపబడింది. మధ్వాచార్యులైన ఆనందతీర్థులవారు కూడా ఇదే రీతిలో అర్థాన్ని గ్రహించారు. **"స యద్వాక్యాదికం ప్రమాణీకురుతే, యదుక్తప్రకారేణ**

తిష్ఠతీత్యర్థః" (అతడు ఏవాక్యాదులను ప్రమాణంగా చేసుకొంటున్నాడో, చెప్పబడినది ఏ రీతిలో ఆచరిస్తాడో - అని అర్థం) అనేది వారి భాష్యపంక్తి. ఈ విధంగా వీటివల్ల **"యత్, ప్రమాణమ్"** అనే చోట పదచ్ఛేదం వీరికి వివక్షితం - అని తెలుస్తున్నది. **"యత్"** అనే పదం ప్రత్యేకపదమని తేలింది.

కాని, మన భాష్యకారులు ఈ ప్రయోగాన్ని రెండు పదాలుగా భావించకుండా **"యత్ప్రమాణమ్"** అని బహువ్రీహిసమాసంగా గ్రహించి, ఒకే పదంగా భావించి, భాష్యాన్ని అనుగ్రహించారు. పూర్వార్ధంలో **"శ్రేష్ఠః యద్యత్ ఆచరతి"** అనేవానిని "శ్రేష్ఠులైన వారు ఏ యే కర్మను అనుష్ఠిస్తున్నారో" అనే అర్థం కనుక, ఆ కర్మను గూర్చియే ఉత్తరార్ధం తెలుపుతున్నదని శ్రీరామానుజుల అభిప్రాయం. శిష్టులు తాము అనుష్ఠించే కర్మకు ఎంతటి అవధిని పెట్టుకొన్నారో, అంతటి అవధినే ఇతరులు కూడా పెట్టుకుంటారని భావం. దీనిని శ్రీవేదాంత దేశికులు తాత్పర్యచంద్రికలో వివరించారు. పెద్దలు ఆచరించే కర్మనే ఇతరులు కూడా అనుష్ఠిస్తున్నారు- అని ఇంత మాత్రం పలికితే చాలదు. వారు ఆ కర్మను ఏ విధంగా ఎంతవరకు అనుష్ఠిస్తున్నారో, ఆ విధంగానే ఇతరులు కూడా అనుష్ఠిస్తున్నారు - అని కూడా పల్కడం ఇక్కడ ఆవశ్యకం కనుక, దానికి అనుగుణంగా శ్రీరామానుజులు భాష్యం చాలా యుక్తంగా అవతరించింది. పెద్దలు దేనిని ప్రమాణంగా గ్రహిస్తారో, దానినే ఇతరులు కూడా ప్రమాణంగా గ్రహిస్తారు- అనేది ప్రకృతంలో అనపేక్షితం కనుక ఇతర భాష్యకారులను మన శ్రీరామానుజులు అనుసరించలేదు **"యత్ప్రమాణం కురుతే"** అనే దానికి ఈవిధంగా అర్థాన్ని గ్రహిస్తే **"లోక స్తదనువర్తతే"** అనే తరువాతి వాక్యంలో గల **"తత్"** అనే పదం సరసమైనఅర్థాన్ని ఇవ్వగలదా ?అనే సందేహం ఇక్కడ కలుగవచ్చు. దీనికి తగిన సమాధానం తాత్పర్యచంద్రికలో తెలుపబడింది. అందులో గమనించవచ్చు.

ఇతరభాష్యకారులలో స్ఫురించని అర్థం ఇక్కడ శ్రీరామానుజులకు తోచడానికి ఏమి కారణం? అని అంటే తిరుప్పావై జీయర్ అనే ప్రసిద్ధిని పొంది నందువల్లనే- అని చెప్పాలి. తిరుప్పావైలోని **"మాలే! మణివణ్ణా!"** అనే పాశురంలో **"మేలైయర్ శెయ్‌వనకళ్ వేణ్డువన"** అని ఉన్నది. ఇక్కడ **"మేలైయార్ శెయ్ వనవళ్ కేట్టియేల్"** అని పల్కితే చాలి ఉండగా, మధ్యలో **"వేణ్డువన"** అని ప్రయోగింపబడడం గమనించదగినది. దానిని దృష్టిలో పెట్టుకొనే **"యత్**

ప్రమాణమ్" అనే దానిని సమస్తపదంగా గ్రహించి శ్రీరామానుజులు భాష్యాన్ని రచించారు.

"మేలైయార్ శెయ్వనకళ్ వేణ్డువన" అనే తిరుప్పావై పాశురానికి ఏమి అర్థం? అని అంటే శాస్త్రాలలో ఎన్నో కర్మలు అనుష్ఠేయాలుగా తెలుపబడ్డాయి. వాటిని అన్నిటినీ శిష్టులు అనుష్ఠింపరు. **"క్రియామాణం న కస్మైచిత్ యదర్థాయ ప్రకల్పతే, అక్రియావదనర్థాయ తత్తు కర్మ సమాచరేత్"** (ఏ కర్మ చేయబడుతున్నదై ఏ విధమైన ఫలాన్ని ఇవ్వలేదో, చేయబడనిది అయితే అన్న అర్థాన్ని కల్గిస్తుందో, ఆ కర్మను తప్పక ఆచరించాలి) అనే ప్రమాణ వచనాన్ని శిష్టులు బాగా తెలిసినవారు కనుక, ఏ కర్మలకు ఏ విధమైన ప్రయోజనం లేదో, ఆకరణే ప్రత్యవాయం ఉన్నదో, ఆ కర్మలను మాత్రం అవహితులై ఆచరిస్తారు. దానినే లోకం కూడా అనుసరిస్తుంది. అక్కరలేనివానిని విడిచిపెట్టి, ఆవశ్యకాలైనవానిని గొప్పవారు ఆచరిస్తారు- అనే ఈ భావంలోనే గోదాదేవి పాశురం అవతరించింది. దీనికి అనుగుణంగా పలకాలనే ఉద్దేశ్యంతోనే **"శూడిక్కొ్డుత్తవళ్ తొల్లరుళాల్ వాழ்కిన్ద వళ్ళల్ ఇరామానుశన్"** (ఆముక్తమాల్యద అయిన గోదాదేవియొక్క సహజమైన కృపవల్ల ఉజ్జీవించే ఉదారులైన శ్రీరామానుజులు) **"యత్ప్రమాణం కురుతే"** అనే గీతాశ్లోకానికి (పెరియాழ்్వార్ శ్రీచరణసన్నిధిలో గోదాదేవి ఆలకించిన అర్థం- ఇదే అని నిశ్చయించి) గోదాదేవి తెలిపిన అర్థాన్ని తమ భాష్యంలో అనుగ్రహించారు. ఈ రీతిలో అరుదైన, గొప్పదైన విషయాలు గురుకులసేవా విముఖులకు తెలిపే అవకాశమే లేదు.

## ఆழ்్వార్ల శ్రీసూక్తులను అనుసరించియే గీతలో చతుర్విధాధికారి వివరణ

భగవద్గీతలో **"చతుర్విధా భజంతే మామ్"** అనే శ్లోకంలో **"ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ"** అని నాల్గు విధాలైన అధికారులు చెప్పబడ్డారు. వీరిని వివరించే శ్రీశంకరాచార్యులవారు తమ భాష్యంలో **"ఆర్తః- తస్కర వ్యాఘ్రరోగాదినా అభిభూతః ఆపన్నః, జిజ్ఞాసుః- భగవత్తత్త్వం జ్ఞాతుమిచ్ఛతి యః, అరార్థీ - ధనకామః, జ్ఞానీ - విష్ణో స్తత్త్వవిత్"** (ఆర్తుడు- దొంగలు, పులులు, రోగాలు మొదలైనవానిచేత బాధింపబడినవాడు ఆపదను పొందినవాడు. జిజ్ఞాసువు- భగవానుని తత్త్వాన్ని తెలియగోరేవాడు, అర్థార్థి - ధనాన్ని పొందగోరేవాడు, జ్ఞాని - విష్ణువు తత్త్వాన్ని

తెలిసినవాడు) అని వివరించారు. మధ్వ భాష్యకారులైన ఆనందతీర్థులువారు ఏ వివరాన్ని ఈ సందర్భంలో చేయలేదు. శంకరాచార్యులవారు దొంగలు, పులులు, వ్యాధులు మొదలైనవానివల్ల దుఃఖాన్ని (ఆపదను) పొందినవాడు ఆర్తుడని, భగవానునిగూర్చిన జ్ఞానాన్ని పొందగోరువాడు. జిజ్ఞాసువు- అని, ధనాన్ని పొందగోరేవాడు అర్థార్థీ -అని విష్ణుతత్త్వాన్ని తెలిసివాడు జ్ఞాని- అని వివరించారు. వీనిలో ఏ వివరణంలో పొందిక ఉన్నది- అనే దానినిగూర్చి ఇక్కడ వివరించి, విమర్శించనక్కరలేదు. విలక్షణమైన అర్థాన్ని భగవద్రామానుజులు అనుగ్రహించడంలో మూలమేమి? అని విమర్శించడమే ప్రకృతాంశం. దీనిని వివరించేటపుడు ఆళ్వార్ల శ్రీసూక్తిని అనుసరించియే పలకాలి- అని శ్రీరామానుజులు చేసుకొన్న నిశ్చయమే దీనికి మూలమని చక్కగా బోధపడుతుంది.

తిరుప్పల్లాణ్డు ప్రబంధంలోని **"వాళాట్పట్టు నిన్ఱిరుళ్ళీరేల్"** అనే పాశురం ద్వారా జ్ఞానులను ఆహ్వానించి **"ఏడునిలత్తిల్ ఇడువదన్ మున్నమ్"** అనే పాశురంలో కైవల్యార్థులను ఆహ్వానించి, **"అణ్డక్కులత్తుక్కదిపతియాకి"** అనే పాశురంద్వారా అపూర్వైశ్వర్యకాములను, భ్రష్టైశ్వర్యకాములను పిలిచి ఉపదేశించిన విషయం స్పష్టం. అది పూర్వాచార్యవ్యాఖ్యానాలలో, దాసుని దివ్య ప్రబంధదీపికావివరణలో స్ఫుటంగా గమనించవచ్చు. ఇంతేకాక, తిరువాయ్మొళిలోని **"ఒరు నాయకమాయ్"** (4-1) అనే దశకంలో ఈ నాల్గు విధాలైన అధికారులు తెలుపబడడం కూడా ప్రసిద్ధం. గీతలోని **"చతుర్విధా భజంతే మామ్"** అనే ఈ శ్లోకాన్ని అనుసరించియే ఈ పాశురాలు అవతరించాయని సంప్రదాయార్థం కనుక, **"మాఱనురై శెయ్ద తమిళ్మఱై వళర్త్తోన్"** (నమ్మాళ్వార్లు పల్కిన ద్రావిడ వేదాన్ని వర్ధిల్లజేసినవారు) అయిన శ్రీరామానుజులు దివ్యప్రబంధ చ్ఛాయలోనే అనుగ్రహించారు - అనే విషయం ఇక్కడ గుర్తించవలసిన పరమార్థం. ఇక్కడ రసికులు మనస్సులో కూడా భావించదగని అర్థాలను ఇతర భాష్యకారులు వ్రాయడం దివ్యప్రబంధ ప్రవేశం లేనందువల్లనే -అనేదానిని మేము మాటిమాటికి తెలుపనక్కరలేదు కదా!

### శ్రీభాష్యంలోని ఉపక్రమ- ఉపసంహారాలు

శ్రీభాష్యం యొక్క ప్రారంభంలోని **"అఖిల జన్మస్థేమ"** ఇత్యాది మంగళ శ్లోకాన్ని "**అనావృత్తి శబ్దాత్**' అనే చివరి సూత్రంయొక్క భాష్యాన్ని సదాచార్య సన్నిధిలో వినే భాగ్యాన్ని పొందినవారికే ఆళ్వార్ల శ్రీచరణాలలో భగవద్రామానుజు

లకు ఉండే ప్రావణ్యాతిశయం తెలిసే అవకాశం ఉన్నది. ఈ ఉపక్రమోప సంహారాలలో, ఆళ్వార్లు అనుగ్రహించిన మహార్థాలను వ్యక్తం చేయడం, ఆళ్వార్లను కీర్తించడం- అనే రెండు విశేషాలున్నాయి. **"అఖిలభువన జన్మే"** త్యాది శ్లోకంలో ఈ రెండు విశేషాలను ముందుగా తెలియజేస్తాను. ఈ రెండిటిలో ఆళ్వార్లు అనుగ్రహించిన మహార్థాలను వ్యక్తం చేయడమనే మొదటి విశేషాన్ని ముందుగా వినండి.

శ్లోకంలోని మొదటి పాదం **"అఖిలభువనజన్మస్తేమ భంగాదిలీలే"** అని ఉన్నది. ఇందులో **"యతో వా ఇమాని భూతాని జాయంతే"** (ఎవరివల్ల ఈ భూతాలు జన్మిస్తున్నాయో) ఇత్యాది ఉపనిషద్వాక్యసిద్ధమై, జన్మాద్యధికరణ భాష్య ప్రపంచితమైన జగజ్జన్మతిలయాలు తెలుపబడ్డాయో. స్థితి అంటే -రక్షణం. ఇది కూడా మొదటి పాదంలో చెప్పబడింది - అనేది స్పష్టం. ఆ విధంగా మొదటి పాదంలో చెప్పబడినా, **"వినతవివిధభూతవ్రాత రక్షైకదీక్షే"** -ప్రపన్నులైన వివిధ జీవుల సమూహాలకు రక్షించడమనేది అద్వితీయ దీక్షను కలవాడు.- అనే రెండవ పాదం ఎందుకు? ఇందులో చెప్పబడే రక్షణం మొదటి పాదంలోనే చెప్పబడినపుడు, శ్లోకపూరణార్థంగానా ఈ ప్రత్యేకవిశేషణం ప్రయోగింపబడింది! అని కొందరు ప్రశ్నిస్తారు.

ఇటువంటి శ్రీసూక్తి విన్యాసం మన భాష్యకారులవద్ద తప్ప ఇతరుల వద్ద కన్పించదు. శ్రీరామానుజులు ఆళ్వార్లు శ్రీసూక్తులను అనుసరించియే ఈ విశేషణాన్ని ప్రయోగించారు. ఏవిధంగా? అంటే ఆళ్వార్లు తిరువాయ్మొళిలో **"ఎళివరుమ్ ఇయల్వినన్"** (1-3-2) అనే పాశురంలో **"ఒళివరు ముళునలమ్ ముదలిల కేడిల"** అని అంటూ అపరిమిత కల్యాణగుణాలను కల్గి ఉండడాన్ని గూర్చి పలికి, వెంటనే **"వీడాన్దెళితరు నిలైమై యతు ఇళివిలన్"** ("వీడు" -అనే ప్రకాశవంతమైన పరమపదాన్ని అనుగ్రహించే ఆ స్వభావంలో నాశం లేనివాడు, దానిని ఎల్లప్పుడు కలవాడు) అని అన్నారు. మోక్షమనబడే ప్రకాశవంతమైన పరమపదాన్ని- అనుగ్రహించడమనే ఆ స్వభావాన్ని (అందించే మోక్షప్రదత్వాన్ని) ఎల్లప్పుడు కలవాడు అనేది దీని అర్థం. ఇక్కడ మన పూర్వాచార్యులు **"ఒళివరు ముళునలమ్"** అనే దానిలోనే మోక్షప్రదత్వమనబడే ఈ గుణం కూడా అంతర్భవించదా? అని ప్రశ్నిస్తూ, "మోక్షప్రదత్వాన్ని ప్రత్యేకంగా చెప్పవలసిన దొక

గుణం కనుక ఈ విధంగా పల్కుతున్నారు'' అని అన్నారు. ఈవిధంగా మోక్షప్రదత్వాన్ని ప్రత్యేకంగా అనుగ్రహించినవారు నమ్మాళ్వారే. ఇక్కడ అనుగ్రహించడమే కాక, రెండవ శతకంలోని **"అణైవదు అరవణైమేల్"** అనే దశకంలో కూడా మోక్షప్రదత్వాన్ని విశేషంగా అనుగ్రహించారు. దేశికులు సైతం ద్రవిడోపనిషత్ తాత్పర్యరత్నావళిలోను, ద్రవిడోపనిషత్ సారంలోను ఆ తిరువాయ్‌మొళ్లిలో మోక్షప్రదత్వమే అనుభావ్యగుణమని నిశ్చయించి తెలిపారు. ఈవిధంగా మోక్షప్రదత్వాన్ని ఆళ్వార్లు ప్రత్యేకంగా అనుగ్రహించడాన్ని అనుసరించియే శ్రీరామానుజులు కూడా **"వినతవివిధ భూతవ్రాతరక్షైక దీక్షే"** అనే సూక్తి ద్వారా దీనిని ప్రత్యేకంగా అనుగ్రహించారు.

అయితే "దీనిని భగవద్రామానుజులు తిరువాయ్‌మొళ్లినుండే గ్రహించారు'' అని చెప్పాలా? ఉపనిషత్తులనుండి గ్రహించినట్లుగా చెప్పకూడదా? అని కొందరు అడుగవచ్చు. ఈ సందర్భంలోని శ్రుతప్రకాశికను సేవిస్తే ఈ విషయంలో వైశద్యం కలుగుతుంది. మోక్షప్రదత్వాన్ని ప్రేయ శబ్దంలో కాని, భంగశబ్దంలో కాని అంతర్భవింప జేయదగి ఉన్నా, శాస్త్రానికి ఇది పరమ ప్రయోజనమైనందువలన ప్రత్యేకంగా అనుగ్రహించవలసి వచ్చినది- అని పలికి, దీనికి శ్రీయామునులు **"జగదుద్భవస్థితిప్రణాశ సంసార విమోచనః", "జగజ్జన్మస్థితి ధ్వంసమహానంద"** అనే శ్రీసూక్తులను ప్రమాణంగా ఉట్టంకించి చూపారు. ఆళవన్దార్ ఆళ్వార్ల శ్రీసూక్తినే అనుసరించి వీటిని అనుగ్రహించారు- అనేది స్పష్టం, నిర్వివాదం. శ్రుతప్రకాశికా కారులు ఆళ్వార్ల శ్రీసూక్తులనే ఉట్టంకించి చూపించి ఉండవచ్చు. కాని, ఆ వివరణం సంస్కృత గ్రంథమైనందువల్ల ఇతరమతాలను చెందినవారుకూడా దానిని పరామర్శించేటట్లుగా వ్రాసిన గ్రంథమైనందువల్ల ద్రావిడ పాశురాన్ని ఉట్టంకించి చూపించకుండా, దానిని అనుసరించిన సంస్కృతశ్రీసూక్తినే ప్రస్తావించి చూపించారు. సంస్కృతగ్రంథాలలో ద్రావిడపాశురాలను గ్రహించడమనే పద్ధతిని వాదికేసరి అళ్లకియమణవాళచ్చీయర్ ఆరంభించారు. వారిని అనుసరించి దేశికులుకూడా గీతాభాష్య తాత్పర్యచంద్రిక, సచ్చరిత్రరక్ష మొదలైన కొన్ని గ్రంథాలలో ఆళ్వారుల పాశురాలను ప్రస్తావించారు. శ్రీభాష్యశ్రుత ప్రకాశికా, సహస్రనామ భాష్యాదులలో శబ్దానువాదం లేదు. అర్థానుసంధానం అపరిమితంగా ఉన్నది. ఈ విధంగా ఆళ్వార్లు వ్యక్తం చేసిన మహార్థాలను అనుసంధించి

"వినతవివిధభూత వ్రాతరక్షైక దీక్షే" అనే విశేషణం అనుగ్రహింపబడినది - అనే విషయం నిస్సందేహం.

ఇక, ఈ విశేషణానికి ఇంకొక విశేషార్థంకూడా శ్రుతప్రకాశికలోను, తత్త్వటీకలోను చూపబడింది. అదికూడా ఆళ్వార్ల శ్రీసూక్తిని బట్టే తెలుపబడిందని నిరూపిస్తాను. **(వినతవివిధ భూతవ్రాతరక్షైకదీక్షే)** - వినత- నమస్కరించిన వివిధ పలు విధాలైన భూత, వ్రాత సమూహాలను, రక్ష- రక్షించడమే, ఏక దీక్ష -ముఖ్యమైన దీక్షగా గ్రహించినవాడు భగవానుడు - అని శబ్దార్థం. ఇక్కడ **"భూతవ్రాత"** అనే చోట శ్రుతప్రకాశికాచార్యులవారు చేసిన నిరూపణం సదాచార్య సన్నిధిలో వారు ఆలకించిన రీతిలో అందంగా ప్రతిపాదింపబడింది. అంటే- భూత వ్రాత అనే పదానికి ప్రాణి సమూహమని అర్థమైనా, ఇందులో కొంచెం లోపలకు పోయి విచారించారు. **"బ్రాహ్మణ సమూహం"** అని అంటే- అందులో బ్రాహ్మణులకంటే వేఱయిన వ్యక్తులున్నారని స్ఫురించదు. పలువురు బ్రాహ్మణుల సమూహాన్నే కదా బ్రాహ్మణ సమూహమని వ్యవహరిస్తాము. **"రాజపరిషత్"** అనే ప్రయోగం ఉన్నది. ఇది బ్రాహ్మణ సమూహం - అనే వ్యవహారం వంటి వ్యవహారం కాదు. పలువురు రాజుల సమూహాన్ని **"రాజపరిషత్"** అని వ్యవహరించటం లేదు. మంత్రులు, ప్రజలు ఇత్యాది ఇతరులు కూడా ప్రభువులో కలిసి ఉండే సన్నివేశమే **"రాజపరిషత్"** అని అనబడుతున్నది. **"బ్రాహ్మణ సమూహం"** అనేచోట షష్ఠీ తత్పురుష సమాసాన్ని గ్రహిస్తున్నాము. **"రాజపరిషత్"** అనే చోటకూడా షష్ఠీతత్పురుషసమాసాన్నే గ్రహిస్తాము. సమాసంలో భేదం లేకపోయినా, అర్థంలో మాత్రం రెండిటికి చాలా వ్యత్యాసం ఉన్నదని శ్రుతప్రకాశికాచార్యులవారు. నిరూపిస్తున్నారు. **"భూతవ్రాత"** అనే ప్రయోగాన్ని గూర్చి శ్రుతప్రకాశికా చార్యులవారి శ్రీసూక్తి ఈ విధంగా ఉన్నది. **"భూతసంబంధీ వ్రాతో భూతవ్రాతః, సంశ్రితసంబంధినోఽపి తత ఏవ కారణాత్ భగవతో రక్ష్యా ఇత్యభిప్రాయః..."** (పశువు, మానవుడు, పక్షి -ఎవరైనా వైష్ణవులను ఆశ్రయించినవారైతే ఆ కారణంవల్లనే వారు విష్ణువుయొక్క ఆ పరమపదాన్ని చేరగలరు. వినత వివిధభూతాలను- అంటే, తనను ఆశ్రయించిన పలువిధాలైన ప్రాణులను రక్షించడంమాత్రమే కాక, ఆ వినత ప్రాణుల సంబంధాన్ని పొందిన వారినికూడా పూర్వం పలికిన వినతుల, అంటే - ఆశ్రితుల కారణంగా భగవానుడు రక్షిస్తాడు- దీనిద్వారా తెలుపబడింది. ఈ సూక్తి వినతిని చేసే అభిలాషను కలవారిని

నిషేధించదు. వినతిని చేస్తే తప్ప ప్రాప్యాన్ని పొందడం సాధ్యంకాదని పలికే శాస్త్రార్థాలను ఖండించడంకూడా లేదు. ఆవిధంగా ఖండించడంకోసమే ఈ సూక్తి అవతరించలేదు. భగవానునకు గల ఒక యథార్థమైన గొప్పతనాన్ని మాత్రం వ్యక్తం చేయడం కోసం అవతరించింది. తత్త్వదీపికలో దేశికులు ఈ అర్థాన్ని చాలా అందంగా ఉపపాదించి, పొందికగా సమన్వయించారు. వినతవివిధ భూతాలతో సాక్షాత్ సంబంధం గాని, పరంపరాసంబంధం కానీ- ఏదైనా ఒక రీతిలో సంబంధాన్ని కలవారినికూడా భగవానుడు రక్షిస్తాడు -అనేది గ్రహించాలని శ్రీభాష్యకారులకు ఈ విధంగా వివక్ష లేకపోతే ఇక్కడ వ్రాత శబ్దప్రయోగాన్ని చేసి ఉండరు. ఈ విధమైన అర్థం గ్రహించినపుడు వ్రాతశబ్దం సప్రయోజన మవుతుంది. లేకపోతే, **'వివిధ'** అనే శబ్దంతో పునరుక్తమవుతుంది- అని తత్త్వటీకలో దేశికులు నిష్కర్షించి చూపారు.

ఈ విధంగా శ్రుతప్రకాశికాచార్యులవారు, శ్రీదేశికులు చూపిన అర్థం **"వినతే"**త్యాదిగా శ్రీరామానుజులు పల్కిన సూక్తిలో ఉన్నదే తప్ప ఆరోపించి పల్కినది కాదు. ఈ అర్థం **"పశుర్మనుష్యః పక్షీ వా"** ఇత్యాది సంస్కృత ప్రమాణ సిద్ధమైనా, శ్రీరామానుజులు దీనిని ఆళ్వార్ల శ్రీసూక్తులను దృష్టిలో పెట్టుకొనియే పలికారు. తిరువాయ్‌మొழி దివ్యప్రబంధంలోని **"పిడిత్తార్ పిడిత్తార్ వీற்றிరున్దు పెరియవానుళ్ నిలావువరే" (6-10-11)** (భగవానుని ఆశ్రయించిన వారిని ఆశ్రయించినవారు నిత్యమైన పరమపదంలో నిలిచి ఉండి ఆనందించగలరు) అని, **"ఎమర్ కీழ் మేల్ ఎழு పిఱప్పుమ్ విడియా వెన్నరకత్తు ఎన్డుమ్ శేర్‌తల్ మాఱినరే" (2-6-7)** (భక్తులతో ఏడేడు జన్మలకు చెందినవారు తీరని భయంకర పాపాలను అన్నిటినీ పోగొట్టుకొని, మళ్ళీ ఈ సంసారంలో పడనట్టి భాగ్యాన్ని పొందారు.) ఇత్యాది పాశురాలే శ్రీరామానుజులకు చేయూత నిచ్చాయి- అని గ్రహించాలి.

తరువాత శ్లోకంలోని మూడవ పాదంలో **"శ్రీనివాసే"** అని ప్రయోగించడం కూడా విశ్లేషించి గమనించవలసి ఉన్నది. **"అఖిలభువనే"**త్యాది ఈ శ్లోకంలో శ్రీభాష్యానికి మూలమైన శారీరకమీమాంసాశాస్త్రం యొక్క సంగ్రహం రచింపబడినదనేది ముఖ్యమైన విషయం. ఈ శారీరక మీమాంసలోని ఏ సూత్రంలోను లక్ష్మీసంబంధం ప్రస్తావింపబడలేదు. మరి శ్రీరామానుజులు దేనిని ఆధారంగా చేసుకొని **"శ్రీనివాసే"** అని ప్రయోగించారు? అని విమర్శించి చూడాలి.

ఆళ్వార్ల గోష్ఠిలో **"తిరువిల్లా త్తేవరై త్తేటేల్మిన్ తేవు"** (శ్రీ సంబంధంలేని దైవాన్ని పరదైవంగా భావించవద్దు) అని ఉద్ఘోషింపబడినందున, దానిని ఆదరించే శ్రీరామానుజులు **"శ్రీనివాసే"** అని ప్రయోగించారు.

అనంతరం, నాల్గవ పాదంలోని **"భక్తిరూపా శేముషీ భవతు"** అనే సూక్తి అవధేయం. **"మమ భక్తి ర్భవతు, మమ భక్తిరస్తు"** అని అంటేనే చాలి ఉండగా **"భక్తిరూపా శేముషీ భవతు"** అని అనడం ఎందువల్ల? అనే విషయాన్ని గమనించాలి. తిరువాయ్‌మొళ్రిలోని మొదటి పాశురంలో **"మదినల మరుళిన్"** (భక్తిగా రూపొందిన జ్ఞానాన్ని ప్రసాదించాడు) అనే ఆళ్వార్ల సూక్తి ఉన్నది. **"మది"** - అంటే - జ్ఞానం. **నలమ్** - అంటే - భక్తి. "జ్ఞానం, భక్తి -అనే రెండిటిని ఇచ్చాడు'' అని కొందరు అర్థాన్ని నిర్వహించారు. భక్తిరూపంలోని జ్ఞానాన్ని ఇచ్చాడు- అనే అర్థాన్ని గ్రహించి, మొలిచేటపుడే చేవను కల్గి మొలిచే వృక్షంవలె "భక్తిగా రూపొందిన జ్ఞానాన్ని అనుగ్రహించాడు - అనేది ముఖ్యమైన అర్థనిర్వాహంగా వ్యాఖ్యానంలో చూపబడింది. శ్రీరామానుజులు ఈ విధమైన అర్థాన్ని దృష్టిలో పెట్టుకొని **"భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా"** అని అనుగ్రహించారు- అనేది ఇక్కడ ముఖ్యమైన విషయం. **"బుద్ధిర్మనీషా ధిషణా ధీః ప్రజ్ఞా శేముషీ మతిః"** అని అమరకోశవచనం. మతి, శేముషి అనేవి పర్యాయపదాలు. కనుక కనుక **"భక్తి, నలమ్"** అనేవి పర్యాయాలే. ఆళ్వార్ల **"మదినలమ్"**ను అనుగ్రహించినట్లుగా నాకు కూడా **''మదినలమ్''** (భక్తిరూపాన్ని, జ్ఞానాన్ని) అనుగ్రహించాలి- అని శ్రీరామానుజులు ప్రార్థించారని దీనివల్ల ఏర్పడుతున్నది.

ఈ విధంగా ఇంతవరకు ఆళ్వార్లు అనుగ్రహించిన మహార్థాలను శ్రీరామానుజులు శ్రీభాష్యారంభంలో వ్యక్తం చేసిన రీతి నిరూపింపబడింది. ఆళ్వార్లను స్తుతించడమనే ఇంకొక విశేషం ఇక నిరూపింపబడుతున్నది.

శ్రీభాష్యాన్ని ప్రవచనం చేసేవారు, పలువురు మొదటినాడు **"అఖిలభువన"** ఇత్యాదిగా ఆరంభించి, లఘుపూర్వపక్షపర్యంతం కొనసాగించి నిలుపుతారు. ఉభయవేదాంతసాగరపారదర్శులైన సంత్సంప్రదాయనిష్ఠాతులు మొదటి శ్లోకాన్ని మాత్రం మూడు దినాలపాటు కాలక్షేపాన్ని అనుగ్రహిస్తారు. మొదటినాడు ఆ మంగళశ్లోకంలో శారీరక మీమాంసార్థ సంగ్రహం ఇమిడి ఉండే రీతిని ఉపపాదిస్తారు. రెండవనాడు తిరువాయ్‌మొళ్రి ప్రబంధదివ్యార్థాలు అందులో పరిమళించే క్రమాన్ని

నిరూపిస్తారు. మూడవనాడు శ్లోకం మొత్తం నమ్మాళ్వార్లను గూర్చిన స్తుతి- అని నిర్వహిస్తారు. ఆ నిర్వాహమే ప్రకృతంలో సంక్షేపంగా తెలుపబడుతున్నది.

**(అఖిలభువనజన్మస్థేమభంగాదిలీలే)**- ఈ విశేషణం ఆళ్వార్లకు అన్వయించినపుడు రెండు విధాలుగా యోజన చేయవచ్చు. అఖిలభువనాల జన్మస్థేమభంగాలకు, ఆది కారణభూతుడైన పరమాత్మతో, లీలే- లీలారసాన్ని అనుభవించేవారు, ఆళ్వార్లు- అనేది మొదటి అర్థం. **"అఖిలభువన జన్మస్థేమ భంగానాం యః ఆదిః (సర్వేశ్వరః) తేన సహ లీలా యస్య, తస్మిన్"** అనే విగ్రహవాక్యాన్ని ఈ అర్థంలో చెప్పాలి. తిరువాయ్మొళి ప్రబంధంలో **"ఏన్నుడైయ పన్దుమ్ కళలుమ్ తన్దు పోకు నమ్బీ!" (6-2-1) "విళైయాడ ప్పోదుమినెన్నై ప్పోన్దోమై"** ఇత్యాది పలు పాశురాలతో ఆళ్వార్లకు భగవానునకు సంభవించిన లీలలు వాచామగోచరాలు. ఇది ఒక యోజన. ఇంకొక అర్థనిర్వాహం ఏమంటే- **"అఖిలమ్ భువనజన్మస్థేమ భంగాదిలీలః యస్య"** అని గ్రహించి భగవానుడే సర్వమని తలచినవారు, ఆళ్వార్లు- అంటే **"ఉణ్ణుమ్ శోఱు పరుకు నీర్ తిన్నుమ్ వెఱ్ఱిలైయుమ్ ఎల్లామ్ కణ్ణన్ ఎమ్బెరుమాన్"** అని తలచినవారు, ఆళ్వార్లు- అనేది ద్వితీయార్థయోజన. ఈవిధంగా ఉన్నవారు ఆళ్వార్లు ఒక్కరే కనుక, ఈ యోజనకూడా చాలా పొసగుతుంది.

**(వినతవివిధ భూతవ్రాతరక్షైకదీక్షే)** - వినతవివిధ భూతవ్రాతరక్షకత్వం అనేది భగవానునకు చెప్పబడినా, **"అనతిక్రమణీయం హి చరణగ్రహణమ్"** అనే న్యాయంతో మంత్రార్థప్రక్రియతోను ఆ రక్షణభారాన్ని భగవానుని శ్రీచరణాలే వహిస్తాయి. ఆ పాదాలకు శ్రీశఠకోపులని, శ్రీశఠారి- అని నమ్మాళ్వార్ల తిరునామమే వ్యవహరింపబడుతున్నది. అందువల్ల ఈ విశేషణం నమ్మాళ్వార్ విషయంలోనే స్పష్టంగా అన్వయించడంలో అడ్డు లేదు- పాదుకాసహస్రంలోని ప్రభావపద్ధతిలో గల **"జగతా మభిరక్షణే త్రయాణా మధికారం మణిపాదుకే వహంత్యోః"** (ముల్లోకాల రక్షణాధికారాన్ని వహించే పాదుకలు) అనే సూక్తి అనుసంధేయం. ఈ విశేషణంలో ఆళ్వార్ల విషయంగా చేసే అర్థయోజనలో వివరించవలసిన విశేషాలు అనేకం ఉన్నాయి. విస్తరభీతిచే విడువబడ్డాయి.

**(శ్రుతిశిరసి విదీప్తే)**- శ్రుతిశిరస్సు అంటే ఉపనిషత్తు. అందులో విశేషంగా ప్రకాశించేవారు ఆళ్వార్లు. ఏవిధంగా? అంటే, **"తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః**

సమింధతే" (విపులైన స్తుతిశీలురైన ఆ నిత్యులు నిత్యం జాగరూకులై ప్రకాశిస్తున్నారు.) ఇత్యాది ఉపనిషద్వాక్యాలు ఆళ్వార్లను కదా స్తుతిస్తున్నాయి. "విప్రాసః" అంటే, విప్రులు. "న శూద్రా భగవద్భక్తా విప్రా భాగవతాః స్మృతాః" (భగవద్భక్తులు శూద్రులు కారు, భాగవతులు విప్రులుగా చెప్పబడ్డారు. అనే రీతిలో విప్రత్వసిద్ధిని పొందినవారు ఆళ్వార్లు.

**(విపన్యవః)** **"పణ - స్తుతౌ"** అనే ధాతువునుండి పుట్టిన పదమైనందున, ఈ పదానికి - విశేషించి స్తుతికర్తలని అర్థం. **"తేవిఱ్చిఱన్న తిరుమాఱ్కు త్తక్క దెయ్వక్కవిఞన్ పావిఱ్చిఱన్న తిరువాయ్మొళ్ళి పకర్ పణ్డితనే"** (దేవతలలో గొప్పవాడైన శ్రియఃపతికి తగిన దివ్యకవి నమ్మాళ్వార్లు గొప్ప పాశురాలను కల తిరువాయ్మొళ్ళిని పల్కిన పండితుడు) అనే రీతిలో భగవానునకు తగిన స్తోత, ఆళ్వార్లు.

**(జాగృవాంసః) -"కణ్ణార క్కణ్డు కళ్ళివదోర్ కాదలుఱ్ఱార్క్కుమ్, ఉణ్డో కణ్గళ్ తుఞ్జుదలే?"** (భగవానుని కన్నులారా దర్శించి కాలం గడపాలనే ఆశను ప్రేమను కలవారికి కన్నులు మూయడం అనేది ఉన్నదా?) అని పల్కి ఆ స్థితిలో నిద్ర లేకుండా ఉన్నవారు, ఆళ్వార్లు. **"సమింధతే"** అనే చోట **"సమ్"** అనే ఉపసర్గను ఉద్దేశించియే ఇక్కడ **"విదీప్తే"** అని శ్లోకంలో ఉపసర్గపురస్సరంగా పలుకబడింది

ఈ విశేషణానికి ఇంకొక యోజన కూడా ఉన్నది **"శ్రుత్యాం దీప్తః, శ్రుతిశిరసి విదీప్తః"** అని గ్రహించాలి. ఇక్కడ **"శ్రుతి"** అంటే **"తిరువాయ్మొళ్ళి"** అందులో దీప్తులు - ప్రకాశించేవారు, ఆళ్వార్లు. ప్రతిదశకంలోని చివరి పాశురంలో **"కురుకూర్ శడగోపన్"** అని అంటూ తమ నామంతో ప్రకాశిస్తున్నారని భావం. ఇక, శ్రుతి శిరస్సు- అంటే కణ్ణినుణ్ శిఱుత్తాంబు దివ్యప్రబంధం. అది తిరువాయ్మొళ్ళి చివరలో నియతంగా అనుసంధింప బడుతున్నందువల్ల శ్రుతి శిరస్సు అయినది. అందులో విశేషంగా ప్రకాశిస్తున్నారు, ఆళ్వార్లు. ఆ ప్రబంధం పూర్తిగా ఆళ్వార్లకు సంబంధించినదే కనుక అందులో ఆళ్వార్లు **''విదీప్తులు''**- విశేషంగా ప్రకాశించేవారని అనడంలో లోటు లేదు.

**(బ్రహ్మణి) "సర్వత్ర బృహత్వగుణయోగేనః బ్రహ్మ శబ్దః"** (అంతటా బృహత్త్వ మనే గుణాన్ని కల్గి ఉన్నందువల్లకదా బ్రహ్మ శబ్దం ప్రయోగింపబడు తున్నది)

అనే శ్రీభాష్యసూక్తిప్రకారం బ్రహ్మమంటే చాలా పెద్ద వస్తువు- అని అర్థం. ఆళ్వార్లు పెరియతిరువన్దాది దివ్యప్రబంధంలో **"పువియుమ్ ఇరు విశుమ్బుమ్ నిన్నకత్త, నీ ఎన్శెవియిన్ వళి పుకున్దు ఎన్నుళ్ళాయ్, అవి ఇన్ఱి యాన్ పెరియన్ నీ పెరియై ఎన్బదనై యారఱివార్?"** (స్వామీ! భూలోకం, విశాలమైన పరమపదం నీలో అంతర్భవించి ఉన్నాయి. అటువంటి నీవు నా చెవిద్వారా ప్రవేశించి నాలో నిత్యంగా నిలిచి ఉన్నావు. అందువల్ల నీవు పెద్దవాడవా? లేక నేను గొప్పవాడనా? అనే విషయాన్ని ఎవరు తెలియగలరు?) అనే పాశురం ద్వారా చాలా గొప్పవాడైన భగవానుని కూడా తమలో ఒక మూల అంతర్భవింప జేసికొన్న గొప్పతనం వారికే ఉన్నదని వారే స్వయంగా సోపపత్తికంగా నిరూపించినందున, ఆళ్వార్లను బ్రహ్మమని అనడంలో అడ్డులేదు. ఆళ్వార్లు పరబ్రహ్మగా స్పష్టమైనందున ఇక్కడ **"పరస్మిన్ బ్రహ్మణి"** అనే ప్రయోగం ఆళ్వార్లకు చాలా చక్కగా పొసగుతుంది.

**(శ్రీనివాసే) "స తు నాగవరః శ్రీమాన్"** (కైంకర్య లక్ష్మిని కల్గిన ఆ గజేంద్రుడు), **"అంతరిక్షగతః శ్రీమాన్"** (కైంకర్యమనే సిరిని కల అంతరిక్షంలో నిలచిన విభీషణుడు) **"లక్ష్మణో లక్ష్మి సంపన్నః"** (కైంకర్యలక్ష్మిని కల్గిన లక్ష్మణుడు) ఇత్యాది ప్రయోగాలలో భగవత్కైంకర్య రుచి, భగవద్భక్తియే సంపదగా చెప్పబడినందున, ఆ సంపద ఆళ్వార్ల వద్ద నిండుగా మెండుగా ఉన్నందున, శ్రీనివాసత్వం ఆళ్వార్లకు కూడా నిరపాయంగా ఉన్నది. ఈవిధంగా ఉండే ఆళ్వార్ల విషయంలో నాకు భక్తిరూపాపన్న జ్ఞానం కలగాలని ప్రార్థించినట్లయినది.

ఇక, శ్రీభాష్యం ఉపసంహారంలో దివ్యప్రబంధార్థ విశేషం పరిమళించే క్రమం, ఆళ్వార్ల ప్రశంస పరిమళించే రీతి ఉపపాదించబడుతున్నాయి. **"అనావృత్తిః శబ్దాత్ అనావృత్తిః శబ్దాత్"** (ముక్తుడు తిరిగి ఈ లోకంలోకి వచ్చి జన్మించడం లేదు, ఆ విధంగా వేదం తెల్పుతున్నది కనుక) అనేది శారీరక మీమాంసలోని చివరి సూత్రం. ముక్తిని పొందినవానికి మళ్ళీ ఈ లోకంలోకి రావడం అనేది లేదు- అనే విషయాన్ని ఈ సూత్రం తెల్పుతున్నది. **"న చ పునరావర్తతే, న చ పునరావర్తతే"** అని వేదం తెల్పినందున, తిరిగి రావడం లేదు -అనేది మాత్రమే సూత్ర ప్రమేయం. శంకరాచార్యుల వారు తమ భాష్యంలో ఏతావన్మాత్రమే వివరించారు. దానిని శ్రీరామానుజులు కూడా శ్రీభాష్యంలో అనుగ్రహించిన తరువాత, విశేషించి ఇంకొక విషయాన్ని చాలా అపూర్వంగా తెలియజేశారు. అది ఆళ్వార్ల శ్రీసూక్తులనుండి

గ్రహించిన విషయం. అది ఏది? అంటే మూలంలో **"శబ్దాత్"** అనే పదానికి సంస్కృత భాషలోని ఉపనిషత్ ప్రేరణ ఏవిధంగా అర్థమో, అదే రీతిలో ద్రవిడోపని షత్ ప్రమాణం కూడా అర్థమని శ్రీరామానుజులు భావించి, ద్రవిడోపనిషత్ సిద్ధమైన ఒక అర్థాన్ని **"న చ పరమపురుషః సత్యసంకల్పః అత్యర్థప్రియం జ్ఞానినం లబ్ధ్వా కదా- చిదావర్తయిష్యతి"** (సత్యసంకల్పుడైన పరమపురుషుడు తనకు చాలా ప్రీతికరమైనవాడైన జ్ఞానిని పొంది తిరిగి అతనిని ఎప్పటికీ ఈ లోకంలోకి రానివ్వడు) అనే సూక్తిద్వారా తెలిపారు. ఈ సూక్తి అర్థం తరువాత వివరించబడు తుంది.

ఇటువంటి సూక్తిని శ్రీభాష్యకారులు తప్ప వేఱు ఏ భాష్యకారుల వద్ద గమనించలేము. తిరువాయ్‌మొ*ழ్రి*ని పైపైన అభ్యసించేవారికి ఈ అర్థం లభ్యం కాదు. భగవానుడు సృష్టి చేయడం, అవతారాలను ఎత్తడం - అనేది చేతన లాభం కోసమే (జీవులను పొందడంకోసమే) అని, చేతనలాభం, ఈశ్వరునకు పురుషార్థమని తెలుపబడం తిరువాయ్‌మొ*ழ్రి* ప్రబంధంలోని ప్రమేయం. ఆ ప్రబంధంలో **"వారిక్కొణ్డు ఉన్నై వి*ழு*ఙ్గువన్ కాణిలెన్ఱు ఆర్ వు*ర్ఱ* ఎన్నై యొ*ழி*య ఎన్నిల్ మున్నమ్ పారిత్తు త్తానెన్నై ము*ర్ఱ*ప్పరుకినాన్, కారొక్కుమ్ కాట్కరైయప్పన్ కడియనే"** (9-6-10) (నన్ను చూచిన వెంటనే నిన్ను చేతులారా గ్రహించి గ్రసించాలి- అని నేను ఆశపడ్డాను. ఆ విధంగా నేను ఆశతో ఉన్నప్పటికీ, నాకంటె ముందుగానే ఆ భగవానుడు తాను ముందడుగు వేసి, నన్ను పూర్తిగా గ్రహించి పానం చేశాడు. ఈ విధంగా చేసినవాడు, కారుమబ్బువంటి వర్ణాన్ని కల్గిన వాడైన తిరుక్కాట్కరై అనే దివ్యదేశంలోని స్వామి భగవానునిపట్ల నేను కల్గి ఉండే ప్రేమకంటే అతడు నాపట్ల కల్గి ఉండే ప్రేమ చాలా గొప్పది) అనే పాశురం తిరువాయ్‌మొ*ழ్రి*లోని వేయి పాశురాలలో సారమైనది. ఇందులో **"ఎన్నిల్ మున్నమ్ పారిత్తు త్తానెన్నై ము*ర్ఱ*ప్పరుకినాన్"** అనేది ఇక్కడ ప్రాణస్థానీయమైన సూక్తి. "భగవానుని చూస్తే అతనిని వెంటనే గ్రహించి గ్రసించాలి'' అని ఆ*ழ్వా*ర్లు ఆశపడ్డారని, తనకు ముందే చాలా కాలంగా భగవానుడు తమ పట్ల ఇటువంటి రీతిలో ఆశను కల్గి తన ఆశను నెరవేర్చుకొన్నాడని ఈ పాశురంలో తెలుపబడింది. ఇందువల్ల ఒక జీవుని పొందడంలో భగవానుడు చిరకాలంగా మనోరథిస్తున్నాడనే పరమార్థం వ్యక్తమయింది.

ముక్తునికి పునరావృతి లేదనే సిద్ధాంతం చేయడానికి ఈ పరమార్థాన్ని ప్రస్తావించి ఉపన్యసించడమే మంచిది- అని శ్రీరామానుజులు **"న చ పరమ పురుషః అత్యర్థ ప్రియం జ్ఞానినం లబ్ధ్వా"** అనిఅంటూ గంభీరోదార చతురమైన శ్రీసూక్తిని విన్యస్తం చేశారు. చాలాకాలంగా చేతనలాభం కోసం అపరిమిత కృషి చేసిన పరమపురుషుడు ఆ అరుదైన తనకి లీలగా తన వద్ద గల ముక్తాత్మను ఏవిధంగా తిప్పి పంపగలడు? ఏ కాలంలోను ఎప్పటికీ తిప్పి పంపడు- అని శిలాశాసనంగా స్వామి అనుగ్రహించడం తిరువాయ్‌మొ*ళ్ళి*ని అవలంబించియే అనేది నిస్సందేహం.

అయితే, శ్రీభాష్యంలో ఆ సందర్భంలోనే, **"య ఏవ మాహ"** అని ఆరంభించి గీతావచనాన్ని శ్రీరామానుజులు ఉట్టంకించారు కదా! అందువల్ల ఇది భగవద్గీతా సిద్ధమనేది స్పష్టంగా ప్రకాశిస్తూ ఉండగా, తిరువాయ్‌మొ*ళ్ళి*ని ఎందుకోసం ఇక్కడ ప్రస్తావన చేసి ప్రమాణీకరించాలి? అని కొందరు ప్రశ్నించవచ్చు. దీనికి సమాధానాన్ని వినండి. ఏ గీతా శ్లోకాన్ని శ్రీరామానుజులు ఇక్కడ ఉదహరించారో, ఆ శ్లోకం **"వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః"** (వాసుదేవుడే తనకు సమస్తం - అని భావించే మహాత్ముడు చాలా దుర్లభుడు) అనేది. దీనికి శంకరాచార్యులవారు చేసిన వివరణాన్ని కాదని, శ్రీరామానుజులు విస్తృతంగా అర్థనిర్ణయాన్ని చేశారు. దీనికి మూలం దివ్యప్రబంధమే- అనే విషయం తరువాత నిరూపింపబడుతున్నది. అందువల్ల శ్రీరామానుజులు శ్రీభాష్యంలో గీతా వచనాన్ని ఉదాహరించినా, దాని అర్థం కూడా శ్రీరామానుజులకు దివ్యప్రబంధాధీన ప్రాప్తికం కనుక, **"న చ పరమపురుషః"** ఇత్యాది శ్రీభాష్యసూక్తి తిరువాయ్‌మొ*ళ్ళి*లోని సూక్తినే ఆధారంగా కల్గి అవతరించినదనే విషయం అప్రధృష్యం.

శ్రీభాష్యంలోని ఉపసంహారంలో ఆ*ళ్వా*ర్ల ప్రశంస ఉన్నది- అనే విషయాన్ని ఇక ఉపపాదిస్తాను. శ్రీభాష్యాన్ని ఆరంభించేటపుడు **"అఖిలభువన జన్మస్థే మభంగాదిలీలే"** అని అన్నారు. ఇది భువన జన్మస్థేమభంగాది లీలుడైన భగవానుని అఖిలంగా -సర్వం అతడే అని- తలచినవారు, ఆ*ళ్వా*ర్లు- అనే అర్థవివక్షను చేసి క్రమం పూర్వమే వివరించబడింది. **"వాసుదేవ స్సర్వమ్"** అనే మహాత్ముడు మిక్కిలి దుర్లభుడని శ్రీకృష్ణుడు చాలా కొరతపడిన మనస్సుతో వెళ్ళిపోయాడు. వెంటనే నమ్మా*ళ్వా*ర్లు అవతరించి **"వాసుదేవ స్సర్వమ్"** అని తలచిన మహాత్ముడను

నేనే - అని తిరువాయ్‌మొౖళిలో పల్కినారు. ఆ విధంగా ఎక్కడ పలికినారు? అని అంటే, "ఉణ్ణుమ్ శోఱు పరుకుమ్ నీర్ తిణ్ణుమ్ వైట్ౖలైయుమ్ ఎల్లామ్ కణ్ణన్"- అని అంటూ తమకు అంతా భగవానుడైన శ్రీకృష్ణుడే అనే పాశురంలో (6-7-1) మాతృభావనతో కూడిన వచనాల రూపంగా పలికారు. అందువల్ల "వాసుదేవ సర్వమితి స మహాత్మా సుదుర్లభః" అనే గీతావచనం నమ్మాౖళ్వార్లను ఉద్దేశించినదే- అనేది సత్సంప్రదాయానికి చెందిన పూర్వాచార్యుల నిర్వాహం. ఈ శ్లోకంలో శ్రీభాష్యాన్ని పూర్తిచేయడం ఉపక్రమోప సంహారానుగుణమని తెలియాలి.

**"వాసుదేవ స్సర్వమ్" అనే గీతావచనం- ఆౖళ్వార్ల భావనను అనుసరించిన గీతాభాష్యం**

భగవద్గీతలోని **"బహూనాం జన్మనాం మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే, వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః"** (7-19) (పలు జన్మలు గడచిన తరువాత జ్ఞానియైనవాడు నన్ను శరణాగతి చేస్తాడు. వాసుదేవుడే సమస్తం, అని భావించే మహాత్ముడుమాత్రం చాలా దుర్లభుడు) అనే శ్లోకానికి గల శంకరభాష్యాన్ని, శ్రీరామానుజులు గీతాభాష్యాన్ని నిశితంగా గమనించాలి. పూర్వం **"ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ"** అనే సందర్భంలో **"జ్ఞానీ"** అనే పదానికి ఏవిధమైన అర్థాన్ని తెలిపారో, ఆ విధమైన అర్థమే **"జ్ఞానవాన్"** అనే పదానికి కూడా శంకరులు తెలిపారు. కాని, శ్రీరామానుజులు మాత్రం పూర్వం తెలిపిన రీతిలో ఇక్కడకూడా **"మచ్ఛేషతైకర సాత్మయాథాత్మ్యజ్ఞానవాన్"** (నాకు వేగంగా ఉండడంలోనే ఆనందాన్ని పొందడమనే ఆత్మస్వరూపం యొక్క యథార్థమైన జ్ఞానాన్ని కలవాడు) అని వివరించారు. ఈ శ్లోకంలో ఇది ముఖ్యమైన విషయం కాదు.

**"వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః"** (వాసుదేవుడే సమస్తమని భావించే ఆ మహాత్ముడు చాలా దుర్లభుడు) అనే ఉత్తరార్ధానికి శ్రీశంకరులు చేసిన వివరణం. "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఇత్యాది సందర్భాలలో వలె అద్వైత పరంగా చేయబడింది. **"మమ వాసుదేవ ఏవ సర్వమ్"** (నాకు సమస్తం వాసుదేవుడే) అనే రీతిలో చేయబడలేదు. పరబ్రహ్మకంటే వేఱయిన విషయం ఏమి లేనందువల్ల, అన్నీ పరబ్రహ్మమే. అని, నన్ను సేవించే మహాత్ముడు చాలా దుర్లభుడు - అని గీతాచార్యుడు పల్కుతున్నాడని శ్రీశంకరుల భాష్యప్రక్రియ. దీనిని శ్రీరామానుజులు ఖండించారనే విషయం. (**"వాసుదేవ స్సర్వమ్"** ఇత్యస్య అయమేవ శబ్దార్థః) అనే

శ్రీరామానుజ గీతాభాష్యసూక్తి వల్ల **"వాసుదేవ స్సర్వ మితి సామానాధికరణస్య పరాభిమతమర్థం ప్రతిస్తువన్ స్వోక్తం ద్రఢయతి- వాసుదేవ ఇతి"** ("వాసుదేవ స్సర్వమ్" అనే సామాన్యాధికరణ్య ప్రయోగానికి ఇతరులకు అభిమతమైన అర్థాన్ని నిరసిస్తూ, తాము పల్కిన అర్థాన్ని దృఢపరుస్తున్నారు. **"వాసుదేవ ఇతి"** అనే సందర్భంలోని గీతాభాష్య తాత్పర్య చంద్రికాసూక్తి వల్ల తెలియవచ్చును. ఈ సందర్భంలో శ్రీశంకరులు తెల్పిన అర్థం తప్పక ఖండించవలసినదేనా? అనే విషయాన్ని గమనించాలి. "సర్వవస్తు సామానాధికరణ్యార్హత్వరూప వస్తుపరిచ్ఛేద రాహిత్యాన్ని, అంటే -ఈ వస్తువు రూపంలో ఉన్నది, ఈ వస్తువురూపంలో లేదు - అనే పరిచ్ఛేదం లేకుండా ఉండే స్థితి అనే. సమస్త వస్తు రూపాన్ని కలిగి ఉండడమనే స్థితిని పరబ్రహ్మ విషయంలో విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని అంగీకరించే మనం కూడా ఒప్పుకున్నాము. కనుక, తాత్పర్యంలో భేదమే తప్ప శబ్దసందర్భంలో ఏ తేడా లేదు. ఇక్కడ శంకరులు చేసిన వివరణం అసంభావితం కాదు. **"స బ్రహ్మా స శివ స్సేంద్ర స్సోక్షరః పరమః స్వరాట్"** (ఆ పరమాత్మ చతుర్ముఖుని ప్రకారంగా కల్గి ఉన్నాడు. శివుని ప్రకారంగా కల్గి ఉన్నాడు, ఇంద్రుని ప్రకారంగా కల్గి ఉన్నాడు. అతడు నాశరహితుడు. నిస్సమాభ్యధికుడు) అనే సంస్కృత వేద సూక్తిని, **"అవనే యవను మవనుమ్, అవనే మ*గ్గి*ల్లాము మఱిన్దనమే"** (అతడే బ్రహ్మ, శివుడు, అతడే మిగిలినది అంతా. ఈ విషయాన్ని తెలిసికొన్నాము) అనే ద్రావిడ వేదసూక్తిని నిర్వహించే రీతిలో **"వాసుదేవ స్సర్వ"** మనే ఈ సూక్తిని కూడా శంకరులకు అభిమతమైన అర్థంలో సులభంగా నిర్వహించే వీలుండగా, ఇక్కడ ఖండించడం ఆవశ్యకం కాదు కదా- అని కొందరు సందేహించవచ్చు.

అయితే, ఇక్కడ ఈ విషయాన్ని గమనించాలి. శ్రీశంకరుల అద్వైతాభిప్రాయాన్ని శ్రీరామానుజులు పూర్వమే చాలా వివరంగా ఖండించారు (గీతలోని (2-12) శ్లోకభాష్యాన్ని (13-2) శ్లోక భాష్యాన్ని గమనించాలి) మళ్ళీ దానిని ఇక్కడ ఖండించే ఆవశ్యకత లేదు. ఇక్కడ ఖండించే రీతి వేఱు. ఈ అర్థం ఈ ప్రకరణానికి పొసగదు- అనే అభిప్రాయంతోనే ఈ సందర్భంలో నిరసింపబడింది. ఇక్కడ శ్రీరామానుజులు తెల్పిన అర్థమేమి? అనే విషయాన్ని కొంచెం గమనిద్దాం. **"వాసుదేవ ఏవ మమ పరమప్రాప్యం, ప్రాపకం చ, అన్యదపి యన్మనోరథవర్తి స ఏవ మమ తత్ సర్వమ్"** అనేది ప్రకృతంలోని గీతాభాష్యవివరణం. దీనిని శ్రీదేశికులు

తాత్పర్యచంద్రికలో వివరించేటపుడు "ద్వారక -పోషక -భోగ్యాలు అన్నీ భగవానుడే -అని భావించే మహాత్ముని ఉద్దేశించి పలుకడమే అసందర్భానికి పొసగుతుంది- అని స్పష్టంగా తెలిపారు. తిరువాయ్‌మొళ్ళిలోని **"ఉణ్ణుమ్ శోరు పరుకు నీర్ తిణ్ణుమ్ వెఱ్ఱిలైయుమ్ ఎల్లామ్ కణ్ణన్"** (భుజించే అన్నం, తాగే నీరు, ఆనందించే తాంబూలాది భోగ్యవస్తువులన్నీ భగవానుడే) అని ఆళ్వార్లు పల్కిన సూక్తి **"వాసుదేవ స్సర్వమ్"** అనే ఈ గీతాసూక్తిని అనుసరించినదే - అని ఆళవందార్ మొదలైన పూర్వాచార్యులు నిర్వహించారు. తిరువాయ్‌మొళ్ళిని వ్యాఖ్యానించిన పూర్వాచార్యులు అక్కడ ఈ గీతావచనాన్ని ఉదాహరించి వ్యాఖ్యానాన్ని చేశారు. శ్రీశంకరులకు తిరువాయ్‌మొళ్ళిలో ప్రవేశం లేనందువల్ల వారు వేఱు రీతిలో భాష్యాన్ని రచించినా, తిరువాయ్‌మొళ్ళి అనే అమృత సాగరంలో నిమగ్నులైన శ్రీరామానుజులు ఆ అర్థాన్ని ఏవిధంగా అంగీకరించగలరు?

**"వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః"** (వాసుదేవుడే సమస్తమని భావించే ఆ మహాత్ముడు చాలా దుర్లభుడు) అని పలికే గీతాచార్యుడు కూడా నమ్మాళ్వార్లను మనస్సులో పెట్టుకొనియే ఆ సూక్తిని పలుకగా, దానికి పొసగని రీతిలోని అర్థం శ్రీరామానుజుల భాష్యంలో ఏ విధంగా చోటు చేసుకుంటుంది? ఆ అర్థాన్ని శ్రీరామానుజులు ఏ విధంగా సహించగలరు? తమకు **"ఎల్లామ్ కణ్ణన్"** (సమస్తం శ్రీకృష్ణుడే) అని పలికే మహాత్ములైన నమ్మాళ్వార్లు అయ్యో! ఎందువల్ల నా కంటికి కనబడలేదు? అని బాధపడుతూ కదా గీతాచార్యుడు ఈ శ్లోకాన్ని పలికాడు. శ్రీకృష్ణుడు తన స్వస్థానమైన పరమపదానికి చేరిన తరువాత కొన్ని దినాలలో ఆళ్వార్లు అవతరించారు. శ్రీకృష్ణుడు ఆళ్వార్లను సేవించి, తన అవతారసమాప్తిని చేయాలని చాలా ఆశపడ్డాడు. ఆ భాగ్యం అతనికి దుర్లభమైనది. అది ఈ శ్లోకంలోని **'స మహాత్మా సుదుర్లభః"** అనే సూక్తివల్ల సూచితమైనది- అని పూర్వాచార్యులు అర్థ నిర్వాహాన్ని చేయడం సోపపత్తికమని గీతాభాష్యసూక్తివల్ల తెలియగలము.

**"జగత్ సర్వమ్ వాసుదేవః"** (జగత్తు అంతా వాసుదేవుడే) అనే అర్థాన్ని శంకరులు పలికారు. ఆ రీతిలో కాకుండా **"మమ సర్వం వాసుదేవః"** (నాకు అంతా వాసుదేవుడే) అని శ్రీరామానుజులు పొసగే అర్థాన్ని చెప్పారు. ఈ అర్థమే తిరువాయ్‌మొళ్ళి అనుగుణమైనది- అని, తిరువాయ్‌మొళ్ళినుండి గ్రహించి వ్యక్తం చేయబడిన అర్థమని గ్రహించాలి.

**జీవాత్మయొక్క అంతరంగ నిరూపకత్వాన్ని భాష్యకారులు తిరువాయ్‌మొழி ప్రబంధాన్ని ఆధారంగా చేసికొనే నిర్ణయించారు.**

భగవద్విషయవ్యాఖ్యానం ఈడు ముప్పత్తాఱాయిరప్పడి, శ్రీవచన భూషణ వ్యాఖ్యానం, గురుపరంపరా ప్రభావం మొదలైన గ్రంథాలలో కన్పించే ఒక ఇతిహాసాన్ని సంగ్రహంగా వినండి. భగవద్రామానుజులు ఉభయవేదాంత ప్రవచనాన్ని నిర్వహిస్తూ ఉండగా, "ఆత్మకు జ్ఞానానందాలు, శేషత్వం నిరూపకంగా చెప్పబడుతున్నాయి కదా! వీటిలో అంతరంగ నిరూపకం ఏది?" అనే ప్రస్తావం కాలక్షేపగోష్ఠిలో ఒకనాడు ప్రసక్తమైనది. భగవద్రామానుజులు సర్వజ్ఞులైనా, ఈ విషయాన్ని ఆచార్యులద్వారా ప్రకాశింపజేయాలని అభిప్రాయపడ్డారు. తిరుక్కోట్టియూర్‌నంబి సన్నిధికి పోయి, ఈ విషయాన్ని గూర్చి తెలుసకొని రావలసినదని కూరేశులను శ్రీరామానుజులు ఆజ్ఞాపించగా, ఆ రీతిలోనే తిరుక్కోట్టియూర్‌కు కూరేశులు వెళ్ళి తిరుక్కోట్టియూర్‌నంబి వద్ద ఆఱు నెలలు కాలం వేచి ఉండి, **"అడియేనుళ్ళాన్ ఉడలుళ్ళాన్"** అనే తిరువాయ్‌మొழி పాశుర **(8-8-2)** తునుకను సమాధానంగా పొంది శ్రీరామానుజుల దగ్గరకు తిరిగి వచ్చారు. తాము గ్రహించిన సమాధానాన్ని కూరేశులు శ్రీరామానుజులకు విజ్ఞాపించగా, మహానిధి అయిన ఈ సూక్తిలోని అంతరార్థాన్ని శ్రీరామానుజులు గోష్ఠిలో వివరించారు.

**"అడియేన్"** అనే పదం నాలాయిర దివ్యప్రబంధంలో వందలకొలది సందర్భాలలో కన్పిస్తుంది. నమ్మాழ்వార్లు పాశురం పాడడం ప్రారంభించిపుడే (మొదటి ప్రబంధంలోనే) **"అడియేన్ శెయ్యుమ్ విణ్ణప్పమే" (తిరువిరుత్తమ్-1)** (దాసుడనైన నేను చేసే విజ్ఞాపనం) అని అంటూ **"అడియేన్"** అనే పదాన్ని ప్రయోగించారు. ఈ విధంగా వందల సంఖ్యలోని సందర్భాలలో **"అడియేన్"** అనే పదం ఉన్నప్పటికీ, వాటిని అన్నిటినీ విడచిపెట్టి, తిరువాయ్‌మొழி ప్రబంధంలో ఒక మూల ఉండే ఒక పాశురఖండాన్ని తిరుక్కోట్టియూర్‌నంబి ఉట్టంకించి వివరించారు. ఈ పాశుర ఖండం ఎనిమిదవ శతకం ఎనిమిదవ దశకంలోని రెండవ పాశురం చివరలో కూడా **"ఒరువన్ అడియేనుళ్ళానే"** అని **"అడియేన్"** అనేపదం ఉన్నది. దానిని కూడా విడచి పెట్టి తరువాత పాశురంలో గల ఖండాన్ని ఉట్టంకించారు. ఇందులో ఏమి విశేషం? అనేది నిశితంగా పరిశీలించినవారి పదునైన బుద్ధికి గోచరించే విషయం. దానిని వినండి.

ఏ సందర్భంలో అయినా "అడియేన్" అనే పదానికి దేహవిశిష్టుడైన జీవాత్మయే అర్థం. "అడియేన్ శెయ్యుమ్ విణ్ణప్పమ్" (దాసుడు చేసే విన్నపం) అనే సందర్భాన్ని గమనిద్దాం. దేహం అనేది లేకుండా కేవలం ఆత్మ విన్నపం చేయలేదు కదా! దేహవిశిష్టుడైన ఆత్మయే విన్నపాన్ని చేయగలదు. కావున, ఇక్కడ దేహం లేని కేవలం ఆత్మను అర్థంగా గ్రహించే అవకాశం లేదు. "అడియేన్ శిఱియ ఞానత్తన్" (తిరువాయ్‌మొழி 1-5-7) అనే ఇంకొక సందర్భాన్ని గమనిద్దాం. ఇక్కడ "ఞానత్తన్" అని జ్ఞానాన్ని కలిగి ఉండడం తెలుపబడినందువల్ల, అది దేహానికి అసంభావితమై, కేవలం ఆత్మకే సంభావితమైనందున, ఇక్కడ "అడియేన్" అనే పదం కేవలం ఆత్మనే చెప్పవలసి ఉన్నది- అని కొందరు భ్రమించవచ్చు. కాని ఆ విధంగా కాదు. ఇక్కడ కూడా "అడియేన్" అనే పదం దేహవిశిష్టుడైన ఆత్మనే తెలుపుతున్నది. ఎందుకు? అంటే "కాణ్బాన్ అలత్తు వన్" (దర్శించాలని తత్తరపడుతున్నాను) అనే క్రమంలో ఆ పదాన్ని అన్వయించాలి. కేవలం ఆత్మ ఆ విధంగా ఆశ పడలేదు కనుక, అక్కడ కూడా దేహవిశిష్టుడైన ఆత్మనే "అడియేన్" అనే పదానికి అర్థంగా చెప్పవలసిన అవసరం ఉన్నది. ఈ రీతిలో ఏ చోట అయినా దేహ విశిష్టుడైన ఆత్మనే "అడియేన్" అనే పదం నిర్దేశిస్తుంది- అనే విషయం స్థిరపడింది. "ఒణ్ శఙ్గదై వాళాழியాన్ ఒరువన్ అడియేనుళ్ళానే" (అందమైన శంఖం, గద, ఖడ్గం చక్రాలను కలవాడొకడు దాసునిలో ఉన్నాడు కదా) అనే చోట కూడా ఆ విధంగానే దేహవిశిష్టుడైన ఆత్మనే "అడియేన్" అనే పదం తెల్పుతుంది.

ఇక, "అడియేనుళ్ళాన్ ఉడలుళ్ళాన్" (దాసునిలో ఉన్నాడు, శరీరంలో ఉన్నాడు) అనే చోట మాత్రం "అడియేన్" అనే పదానికి కేవలం ఆత్మకు అర్థం కావలసిన ఆవశ్యకత ఉన్నది. ఆత్మకు విశేషణభరితమైన దేహానికి వాచకమైన పదం "ఉడల్" అనేది ప్రత్యేకంగా ఉన్నందున, "అడియేన్" అనే పదంలో దేహాన్ని కూడా కలిపి, అర్థం గ్రహించవలసిన ఆవశ్యకత, నిర్బంధం లేదు. "భగవానుడు జీవాత్మను, అచిత్తులను అనుప్రవేశించి ఉంటాడు- అని తెలుపవలసి ఉండడం ఇక్కడ వివక్షితం. శరీరంలో ఉన్నాడు- అని పల్కినందువల్ల భగవానుడు అచేతనద్రవ్యాలను అనుప్రవేశించి ఉంటాడు- అనే విషయం తెలుపబడింది. "జీవాత్మను అనుప్రవేశించి ఉంటాడు'' అనే వివక్షితమైన (చెప్పదలచిన) అర్థానికి

**"అడియేనుళ్ళాన్"** అనే ప్రయోగం చేయబడింది. ఆత్మ అహమర్థం కనుక, **"ఎన్నుళ్ళాన్"** అని చెప్పి ఉండవచ్చు. అపుడు కూడా, ఆత్మలో ఉన్నాడు- అనే అర్థం వ్యక్తమవుతుంది. అయితే, ఆళ్వార్లు ఆ రీతిలో పలుకకుండా, **"అడియేనుళ్ళాన్ ఉడలుళ్ళాన్"** అని పల్కినందున, ఆత్మ అనేది **"అడియేన్"** అనేది పర్యాయపదాలు. అంటే - ఆత్మకు శేషత్వమే అంతరంగ నిరూపకం- అనేది ఆళ్వార్ల అభిప్రాయమని నిశ్చయించడానికి వీలయినది.

ఈ విధంగా భగవద్రామానుజులు నిర్ణయించినట్లు చెప్పే ఐతిహ్యం వాస్తవమైనది అయితే, అది శ్రీభాష్యకార దివ్యసూక్తిలో ఎక్కడైనా చోటు చేసికొని ఉండాలి. లేకపోతే, ఈ ఐతిహ్యానికి గౌరవం లేదు. శ్రీభాష్యంలో **"జ్ఞోఽత ఏవ"** అనే సూత్రం యొక్క భాష్యంలో ఇది తెలుపబడలేదు. ఇక్కడ **"అయ మాత్మా జ్ఞాతృస్వరూప ఏవ"** (ఈ ఆత్మ- జ్ఞాతృత్వాన్ని స్వరూపంగా కల్గినవాడే) అని ఏతావన్మాత్రమే తెలుపబడింది. అందువల్ల ఇంతకుముందు వివరించిన ఐతిహ్యం యథార్థమై ఉండడానికి తగిన అవకాశం లేదని గురుకుల వాసాదృష్టాన్ని లేని కొందరు అనవచ్చు. అటువంటివారిని **"ఎణ్ణాద మానిడత్తై ఎణ్ణాదపోదెల్లామ్ ఇనియవాఱే"** (స్మరించకూడని మానవులను స్మరించనపుడంతా మధురంగానే ఉంటుంది) అనే రీతిలో విడచిపెట్టి తత్త్వజిజ్ఞాసువులైన అదృష్టవంతులకు మర్మాన్ని తెల్పుతున్నాను. వినండి. ఈ మహార్థం భగవద్రామానుజుల మనస్సులో ఉన్నదై, గీతాభాష్యంలో తగిన చోట ప్రకాశింపజేయబడింది.

గీతలో **"చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినోఽర్జున!, ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ"** (గీత-7-16) (ఓ అర్జునా! నన్ను నాల్గు విధాలైన అదృష్టవంతులైన జనులు భజిస్తున్నారు. పురుషశ్రేష్ఠా ! వారు ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని- అనేవారు) అనే సందర్భంలో శ్రీశంకరాచార్యుల వారి భాష్యాన్ని గమనించండి. **"జ్ఞానీ- విష్ణోః తత్త్వవిత్"** (జ్ఞాని అంటే -విష్ణువు యొక్క తత్త్వాన్ని తెలిసినవాడు) అని శ్రీశంకరాచార్యులవారు వ్యాఖ్యానించారు. శ్రీరామానుజులు ఆ అర్థాన్ని స్వీకరించలేదు. **"భగవచ్ఛేషతైకరస ఆత్మస్వరూపవిత్ జ్ఞానీ"** (భగవానునకు శేషమై ఉండడం ఒక్కటే ఆనందకరమనే ఆత్మస్వరూపాన్ని తెలిసినవాడు జ్ఞాని) అని అనుగ్రహించారు. ఈ విధంగా ఈ ఒక్క సందర్భమే కాదు, **"జ్ఞానీ"** అనే పదం ప్రస్తుతమైనప్పుడు అంతటా ఆ రీతిలోనే వివరించారు.

జీవాత్మ యొక్క జ్ఞానానికి ప్రయోజనం తన శేషత్వాన్ని తెలుసుకోవడమే - అనేది శ్రీరామానుజుల అభిప్రాయమని తెలుస్తున్నది. ఆళ్వార్ల శ్రీసూక్తిలో అవగాహనం లేకుండా ఈ రీతిలో పలుకడం సాధ్యం కాదు.

## శరణాగతిగద్యలోని అరుదైన ఒక విషయం

శరణాగతి గద్యలో "అఖిలహేయ" ఇత్యాది అయిదవ చూర్ణికలో **"మహావిభూతే ! శ్రీమన్నారాయణ ! శ్రీవైకుంఠనాథ !** (గొప్ప విభూతులను కలవాడా, శ్రీమన్నారాయణా! శ్రీవైకుంఠానికి అధిపతీ!) అనే సంబోధనల పిమ్మట **"అపారకారుణ్య సౌశీల్య వాత్సల్యౌదార్యైశ్వర్య సౌందర్యమహోదధే!"** (అంతులేని కరుణ, సౌశీల్యం, వాత్సల్యం, ఔదార్యం, సౌందర్యం- అనే గుణాలకు సముద్రంవలె, ఆకరమైన వాడా!) అనే సంబోధనలో వాత్సల్యగుణం అంతర్భవించినప్పటికీ, మళ్ళీ ఇంకొక మాఱు ఆ సందర్భంలోనే, **"ఆశ్రిత వాత్సల్యైకజలధే!"** (ఆశ్రితుపట్ల వాత్సల్య గుణానికి అద్వితీయమైన సముద్రం వంటివాడా!) అని ఇంకొకమారు సంబోధన చేయబడింది. దీనికి పూర్వం చేయడిన సంబోధనలోనే వాత్సల్యగుణం కూడా చేరినది అయినా, మళ్ళీ వాత్సల్యాన్ని మాత్రం పురస్కరించుకొని ప్రత్యేకంగా ఒక సంబోధనను చేయడం ఎందుకోసం? అని విమర్శించి చూడాలి. పూర్వం చేయబడిన సంబోధనలో వాత్సల్యాన్ని ఇంకా పలు గుణాలతో కలిపి పల్కడంతో తృప్తి లేనందువలన వాత్సల్యాన్ని మాత్రం ప్రత్యేకంగా మరొక మాఱు పలకాలి- అని అభిప్రాయం కలిగి, శ్రీరామానుజులు ఈ రీతిలో ఇంకొకసారి సంబోధించి నట్లు స్పష్టంగా తెలుస్తుంది. చాలా దాహాన్ని పొందినవాడు నీటిలో నేరుగా దిగి, ఆ నీటిని పలు విధాలుగా ఉపయోగించుకునేటట్లుగా, భగవద్గుణాలనే కీర్తనంలో అద్వితీయమైన ఉత్కంఠాతిశయంచేత అనుగ్రహించే శ్రీసూక్తులకు మనం ఒక క్రమాన్ని అన్వేషించనక్కరలేకపోయినా, ఈ పునరుక్తి వాత్సల్యగుణంలో చేయడింది కనుక, మన పూర్వాచార్యులు ఈ విషయంలో శేషమైన అవధానాన్ని చేసి, వ్యక్తం చేసిన విశేషం ఇక్కడ తెలుపబడుతున్నది. ఇది చాలా సూక్ష్మమైన విషయం.

తిరువాయ్మొழி దివ్యప్రబంధంలో **"అకలకిల్లేన్ ఇఱైయుమెన్ఱు అలర్మేల్ మఙ్గైయుఱై మార్బా!"** (క్షణం కూడా విశ్లేషించలేను - అని అంటూ నిత్యవాసం చేసే లక్ష్మీదేవిని వక్షస్థలంలో కలవాడా!) (తిరువాయ్మొழி-6-10-10) అని అంటూ ఆழ్వార్లు లక్ష్మీదేవిని పురస్కరించుకొని శ్రీవేంకటేశ్వరుని దివ్యచరణాలలో

శరణాగతిని చేసేటప్పుడు భగవానుని, **"నికరిల్ పుక*ల్లా*య్ !"** (సాటి లేని వాత్సల్యమనే కల్యాణగుణాన్ని కలవాడా!) అని పాశురంలోని రెండవ పాదంలో సంబోధించినారు. ఆ కల్యాణగుణం ఏది? అయి ఉంటుంది? అని ఆలోచిస్తే, ప్రకరణాన్ని అనుసరించి చూస్తే, అది వాత్సల్యమే- అని భగవద్రామానుజులు భావించారు. దోషభూయిష్ఠుడైన చేతనుడు శ్రీలక్ష్మీదేవిని పురుషకారంగా వరించడం ఎందుకోసం? అని అంటే, తన దోషాలను చూచి, భగవానుడు తనను నిగ్రహించ కుండా ఉండడంకోసం కదా! ఆ లక్ష్మీదేవియొక్క పురుషకారబలంవల్ల భగవానుని వద్ద మొట్టమొదటిగా ఏ కల్యాణగుణం వికాసాన్ని పొందుతుంది? అని అంటే, అది వాత్సల్యమే - అనే విషయం నిర్వివాదం.

వాత్సల్యమంటే దోషదర్శిత్వమా? దోష భోగ్యత్వమా? అనే విచారం ఈ సందర్భంలో కొంచెం కూడా చేయబడడం లేదు. ఏదయినా కానివ్వండి. దోషాదర్శనమే (దోషాలను గమనించకపోవడమే) వాత్సల్యమని భావిద్దాం. ఆ గుణం భగవానునిలో ఉన్నదని భావించినా, చేతనుని (జీవుని) అపరాధాల బాహుళ్యంచేత అది తల ఎత్తుతున్నది. ఈ విషయాన్ని శ్రీదేశికులు కూడా రహస్యత్రయ సారమనే గ్రంథంలోను ద్వయాధికారంలోను, ఇంకా కొన్ని చిన్న గ్రంథాలలోను స్పష్టంగా వ్యక్తం చేశారు. **"నికరిల్ పుక*ల్లా*య్!"** అనే ఆ*ళ్వా*ర్ల శ్రీసూక్తిలో వివక్షితమైన గుణం వాత్సల్యమే- అని శ్రీపిళ్ళైలోకాచార్యులవారి రహస్యాలలో) శ్రీదేశికులు రహస్యాలలో ఏ భేదం లేకుండా అన్నిటిలోను స్పష్టంగా తెలుపబడింది. అందువల్ల ఈ వాత్సల్యగుణాన్ని ఆ*ళ్వా*ర్లు సాటిలేనిదని భావించి నందువల్ల, స్వామి శ్రీరామానుజులు దీనిని మిగిలిన కల్యాణ గుణాలతో చేర్చి పల్కినంత మాత్రంలో తృప్తి చెందక, ప్రత్యేకంగా ఒక చూర్ణిక దీనికోసం అనుగ్రహించారు. ఇందువల్ల ఆ*ళ్వా*ర్ల శ్రీసూక్తులలో శ్రీరామానుజులు కల్గి ఉండే గౌరవాతిశయం విశదమవుతున్నది.

### "తుష్యంతి చ రమంతి చ" - దివ్యప్రబంధవిశేషం

భగవద్గీతలోని దశమాధ్యాయంలోని తొమ్మిదివ శ్లోకం **"మచ్చిత్తా మద్గత ప్రాణాః బోధయంతః పరస్పరమ్, కథయంత శ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ"** (నాలో చిత్తాన్ని కలవారు, నాలోనే ప్రాణాలను కలవారై పరస్పరం పలికేవారు నా గుణాలను గూర్చి, లీలలనుగూర్చి, అనన్యప్రయోజనంగా భావించి

పల్కుతూ ఆనందిస్తున్నారు. వినేవారుకూడా, వాటిని అంతులేని గొప్ప ప్రీతితో విని ఆనందిస్తున్నారు) అని ఉన్నది. ఈ శ్లోకం భాగవత శిఖామణి యొక్క అందమైన కాలక్షేపాన్నిగూర్చి గీతాచార్యుడు గొప్ప సంతోషం పెల్లుబకగా పల్కినది. భాగవతులు ఏవిధంగా కాలక్షేపం చేయాలి? అనే విషయాన్ని బోధిస్తున్న రీతిలో కూడా ఈ శ్లోకం ఉన్నది. ఈ శ్లోకాన్ని మనస్సులో మాటిమాటికి స్మరిస్తే విలక్షణమైన, ఒక అద్వితీయమైన ఆనందం భక్తులకు తప్పక కలుగుతుంది. గీతకు పలు వ్యాఖ్యానాలు అవతరించినప్పటికీ, శ్రీరామానుజులు అనుగ్రహించిన భాష్యం యొక్క మాధుర్యం, గాంభీర్యం సాటి లేనిది. అధికమైన విస్తృతి లేకుండా సంక్షిప్తంగానే ఉన్నా, అర్థపుష్టి అనన్యాదృశమనే విషయం అనుభవరసికులకు తెలుస్తుంది. దానికి ముఖ్యమైన హేతువు స్వామికి గల దివ్యప్రబంధావగాహనమే అనే దానిలో అడ్డులేదు. ఇక్కడ ప్రస్తావించిన శ్లోకం చివరలో **"తుష్యంతి చ రమంతి చ"** అని ఉన్నది. ఈ క్రియా పదాలు రెండింటికి "సంతోషిస్తున్నారు" అనేది అర్థంగా తోస్తుంది. ఈ పునరుక్తి ఎందుకోసం? అని గమనించినపుడు గీతావ్యాఖ్యానాలను గమనించాలనే కోరిక కల్గుతుంది.

శ్రీశంకరాచార్యులవారి భాష్యాన్ని గమనిస్తే అందులో **"తుష్యంతి- పరితోష ముపయాంతి, రమంతి చ - రతిం చ ప్రాప్నువంతి, ప్రియసంగత్యా ఇవ"** (**"తుష్యంతి"**- పూర్ణమైన సంతోషాన్ని పొందుతున్నారు) అని ఉన్నది. పరితోషం అంటే ఏమి? రతి అంటే ఏమి? అనే విషయాన్ని సూక్ష్మగ్రాహులైనవారు, సూక్ష్మంగా (నిశితంగా) తెలియగలరు. ఇక, మధ్వభాష్యాన్ని చూస్తే, ఈ సందర్భంలో 8,9,10,11 అనే శ్లోకాలకు భాష్యమే లేదు. **"సంతి చ భజంతః కేచిదిత్యాహ- అహ మిత్యాదినా"** అని ఎనిమిదవ శ్లోకానికి అవతారికను తెలిపి, తరువాత 11వ శ్లోకం వరకు **"స్పష్టార్థమ్"** అని ముగించారు. ఈ భాష్యప్రక్రియ ఇంచుమించుగా ఈ రీతిలోనిదే.

ఇక శ్రీరామానుజుల భాష్యంలోనిదే. శ్రీసూక్తిని గమనించండి. **(తుష్యంతి చ రమంతి చ) "వక్తారః తద్వచనేన అనన్యప్రయోజనేన తుష్యంతి" శ్రోతారశ్చ తచ్ఛ్రవణేన అనవధికాతిశయప్రియ ఏవ రమంతే"** (పలికేవారు అనన్య ప్రయోజనంగా ఆ వచనాలను పల్కుతూ ఆనందిస్తున్నారు. వినేవారు కూడా అంతులేని గొప్పదైన ప్రీతితో వాటిని వింటూ ఆనందిస్తున్నారు) అని ఉన్నది. భగవత్కథలను గూర్చి పలికి ఆనందించేవారు కొందరు. వాటిని విని ఆనందించే వారు కొందఱు ఈ

విధమైన భేదాన్ని పురస్కరించుకొని క్రియాపద భేదాన్ని ప్రయోగించినట్లుగా శ్రీరామానుజులు భావించారు. మూలంలో **"బోధయంతః పరస్పరమ్"** (పరస్పరం తెల్పుకొంటున్నవారై) అని ఉన్నందువల్ల వక్తలు, శ్రోతలు - అనే రెండిటిని గీతాచార్యుడు ప్రయోగించాడని శ్రీరామానుజులు వ్యాఖ్యానించారు దీనిని శ్రీదేశికులు తాత్పర్య చంద్రికలో వివరించేటప్పుడు, రెండు క్రియాపదాలు అన్వయించడంకోసం వ్యక్తిభేదాన్ని గ్రహిస్తే, శ్లోకాన్ని అన్వయించడంలో శ్రమపడతారు - అని భావించి **"కథనశ్రవణయోరేకస్మిన్నేవ కాలభేదన సంభావి తత్వాత్"** (పలకడం, వినడం - అనే రెండు ఒకే వ్యక్తిలో కాలభేదంతో సంభవిస్తాయి కనుక) ఇత్యాదిగా పల్కుతూ, ఒకే అధికారి (వక్త) ఒక సమయంలో ప్రవచనం చేసి సంతోషించడం, అదే వ్యక్తి వేఱొక కాలంలో శ్రవణం చేసి సంతోషించడం లోకంలో సంభావితమేనని చూసి అన్వయక్లేశాన్ని తీర్చారు. వాస్తవానికి, భాష్యకారులకుకూడా ఇదే అభిప్రాయమనే విషయం సులభంగా తెలియగల్గినదే. ఒక వ్యక్తికే ఒక సమయంలో వ్యక్తృత్వం, వేఱొక సమయంలో శ్రోతృత్వం సంభావితమే కదా! తాము పలికే కాలంలో కలిగే ఆనందం ఒక విధం, తాము వినే కాలంలో ఆనందం ఇంకొక విధం. ఈ విధంగా రెండు రీతులలోని ఆనందాన్ని చూపడం కోసమే **"తుష్యంతి, రమంతి"** అనే విషయం ఇతర భాష్యకారులలో స్ఫురించకుండా, భాష్యకారులకు మాత్రం స్ఫురించడానికి కారణం వారి దివ్యప్రబంధావగాహనమే.

ఏవిధంగా? అంటే, తిరుమ*ళ్ళి*శైప్పిరాన్ నాన్ముకన్ తిరువన్దాది అనే ప్రబంధంలో **"తెరిత్తె*ళు*ది వాశిత్తుమ్ వేట్టుమ్ వణజ్గి వ*ళి*పట్టుమ్ పూశిత్తుమ్ పోక్కినేన్ పోదు"** (63) (తెలిపి వ్రాసి, చదివి విని, నమస్కరించి, అదే యాత్రయై ఆరాధించి కాలక్షేపాన్ని చేశాను) అని అన్నారు. ఇందులో వక్తృత్వం, శ్రోతృత్వం- అనే రెండు కాలభేదాన్నిబట్టి ఉన్నవి- అని తెలుపబడింది. ఏవిధంగా? అంటే **"తెరిత్తె*ళు*ది వాశిత్తుమ్ కేట్టుమ్"** అనే ఈ సూక్తిలో **"తెరిత్తె*ళు*ది"** అంటే తెలుపడం. అంటే -ప్రవచనం చేయడం. అది ఒక కాలంలో, ఇంకొక సమయంలో ఇతరులు ప్రవచనం చేయగా వినడం- ఇది **"కేట్టుమ్"** అనే పదం ద్వారా ఆ*ళ్వా*ర్లు తెలిపారు.

ఒకే వ్యక్తికి వక్తృత్వం, శ్రోతృత్వం కాలభేదాన్ని అనుసరించి సంభవిస్తాయి- అనే విషయాన్ని తెలుపడానికి ఆ*ళ్వా*ర్ల పాశురం కావాలా? ఇది అందరికి

సహజంగానే తెలియగల్గినది కదా! అని మీరు అడగవచ్చు. ఇక్కడ ముఖ్యమైన విషయం ఏమి? అంటే, ఆళ్వార్లు ఆ పాశురాన్ని ప్రారంభించేటపుడే **"తరిత్తిరున్దే నాకవే"** అని ఆరంభం చేశారు. **"తెరిత్తుమ్ కేట్టుమ్ పోదు పోక్కువదు"** (ప్రవచనం చేసి, విని కాలక్షేపం చేయడం) తన ఆత్మను ధరించడంకోసమే అని, లేకపోతే తన ఆత్మను ధరించడం దుర్లభమని తెలియజేశారు. దీనినే శ్రీరామానుజులు సంస్కృతభాషలో తెలిపారు. ఆ సూక్తి ఏమంటే **"మయా వినా ఆత్మధారణ మలభ మానాః"** (నేను లేకుండా ఆత్మధారణను పొందినవారై) అనేది. **"మద్గతప్రాణాః"** అనే మూలంలోని ప్రయోగానికి **"మయా వినా ఆత్మధారణ మలభమానాః"** అనే అర్థాన్ని తెలియజేయడం. **'తెరిత్తిరున్దే నాకవే"** అనే తిరుమఙ్గై ఆళ్వార్ల పాశురం తమ మనస్సులో ధ్వజంగా నాటుకొన్న కారణం వల్లనే- అనే విషయంలో సందేహమున్నదా! శ్రీశంకరాచార్యులవారికి ఈ అర్థం స్ఫురించలేదుకదా. వారు వ్రాసిన అర్థం ఆళ్వార్ల శ్రీసూక్తి అనే సుధాసముద్రంలో అవగాహించిన శ్రీరామానుజుల మనస్సుకు రుచించలేదు.

### గీతాభాష్యసారం

శ్రీరామానుజుల గీతాభాష్యాన్ని గాఢంగా అవలోకిస్తే, అందులోని శ్రీసూక్తులు ఇంచుమించుగా దివ్యప్రబంధ సూక్తులను పురస్కరించుకొని అనుగ్రహింప బడినవని నిశ్చయించవచ్చు. గ్రంథవిస్తరభీతిచేత గీతాభాష్యంనుండి ఇపుడు సారతరంగా ఒక్కటిమాత్రం ప్రస్తావింపబడుతున్నది.

భగవద్గీతలో **"తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్, దదామి బుద్ధియోగం తమ్"** (మనస్సులో నాతో సదా కూడినవారై, నన్ను భజించేవారికి ఆ బుద్ధియోగాన్ని ప్రీతితో అనుగ్రహిస్తాను) అనేచోట శ్రీశంకరులు **"ప్రీతిపూర్వకం భజతామ్"** అనే అన్వయాన్ని చూపి, **"ప్రీతిః స్నేహః, తత్ పూర్వకం మాం భజతామ్- ఇత్యర్థః"** (ప్రీతిః - అంటే స్నేహం, స్నేహంతో నన్ను భజించేవారికి - అని అర్థం) అని వివరించారు. ఈ అర్థంలో ఏమి లోటు చెప్పగలం? అయినా, శ్రీరామానుజులు **"ప్రీతిపూర్వకం దదామి"** అనే అన్వయాన్ని చూపారు. చేతనుడు చేసే భజనలో ప్రీతిపూర్వకత్వాన్ని అన్వయించకుండా, భగవానుడు చేసే అనుగ్రహంలో దానిని శ్రీరామానుజులు అన్వయించారు. దీనికి నిజమైన కారణమేమి? అంటే, తిరువాయ్ మొழிలోని **"ఎన్నై యాళుమ్ పిరానార్ వెఱిదే అరుల్ శెయ్‌వర్ ఉకన్దు"** (నన్ను

పాలించే స్వామి నిర్హేతుకంగా (ప్రీతితో అనుగ్రహిస్తాడు) అని ఉన్నది. భగవానుడు తాను జీవుని అనుగ్రహించదలచినపుడు అవ్యాజంగా చేసే కృపను ప్రీతితో (ఉకన్దు) చేస్తాడని ఆళ్వార్లు పలికారు. ఈ విధంగా పల్కిన ఆళ్వార్లకు పూర్వం ప్రస్తావించిన గీతశ్లోకంలో **"ప్రీతిపూర్వకం దదామి"** అనే అన్వయమే మనస్సులో ఉన్నదని శ్రీరామానుజులు నిశ్చయించుకొని, దానికి అనుగుణంగా భాష్యాన్ని రచించారు. ఈ రీతిలో గీతాభాష్యాన్ని లోతుగా చూస్తే మహానిధులు కుప్పలు తెప్పలుగా దొరుకుతాయి.

## తిరువాయ్‌మొళి - మూర్తీభవించిన బ్రహ్మసూత్రభాష్యం

శారీరకమీమాంసా ద్వితీయాధ్యాయ ద్వితీయపాదంలోని సర్వథాను పపత్త్యధికరణంలో సర్వశూన్యవాది అయిన, బౌద్ధులలోని ఏకదేశి వాదించే పక్షం నిరసింపబడింది. పరబ్రహ్మమే జగత్కారణమని సుస్థిరం చేయడంకోసం ఆవిర్భవించిన ఈ అధ్యాయంలో సర్వశూన్యత్వవాదాన్ని నిరసించే ప్రసక్తి ఏమి? అని కొందఱు భావించవచ్చు. జగత్కారణవస్తువు ప్రధానమా? పరమాణువులా? పరబ్రహ్మమా?- అనే విచారం ఎపుడు పొసగుతుంది? అంటే, నిజానికి జగదుత్పత్తి అనేది ఒకటి నిరూపించడానికి సాధ్యమైనది అయితేనే పొసగుతుంది. పూర్తిగా, బొత్తిగా లేని కుఱ్ఱవాని తల్లిదండ్రులను గూర్చిన విచారం చేస్తారా? జగదుత్పత్తియే నిరూపించడానికి సాధ్యం కానపుడు, ఏది జగత్కారణం? అనే చర్చ ఎందుకోసం? ఉత్పత్తి అనేది భావం నుండి అంగీకరింపబడుతున్నదా? అని భావంనుండి అంగీకరింపబడుతున్నదా? అని ప్రశ్నిస్తున్నాము. భావం నుండి అంగీకరింపబడు తున్నది- అని అనడం కుదరదు. మృత్పిండంనుండి బాన మొదలైనవి పుడుతున్నవి అంటే -మృత్పిండాన్ని అవి ఉపమర్దించికదా పుడుతున్నవి. ఏకార్యవస్తువులైనా, కారణవస్తువులను ఉపమర్దించకుండా (వికారాన్ని పొందించకుండా) పుట్టవు- అనేది ప్రత్యక్షసిద్ధం. కారణవస్తువు యొక్క వినాశమే కదా ఉపమర్దనమంటే. అది అభావమే. అందువల్ల భావంనుండి ఉత్పత్తి జరుగదు- అని తేలింది. అభావం నుండికూడ ఉత్పత్తి లేదు- అనేది అనాయాసంగా బోధపడుతుంది. అభావంనుండి భావమనేది సంభవించదు కదా! కనుక, ఉత్పత్తి అనేదే నిరూపించడానికి వీలుకానపుడు ఉత్పత్తికి అనంతరం కలిగే వికారాలు ఏమీ లేవు - అనేది సిద్ధం. కనుక లోకవ్యవహారాలన్నీ భ్రమమూలకాలే. ఇది సర్వశూన్యవాది వాదప్రక్రియ.

ఈ విధంగా శూన్యమే తత్త్వం- అని పలికే వారు ప్రకృతంలో సర్వథా నుపపత్త్యధికరణంలో నిరసింపబడుతున్నారు. **"సర్వథానుపపత్తేశ్చ"** అనేది సూత్రం. ప్రమేయాలుగాని, ప్రమాణాలుగాని, అవి ఉండనీ, లేకపోనీ. పూర్వపక్షికి అభిమతమైన సర్వశూన్యత్వం ఏ రీతిలోను సిద్ధించదు కనుక, మాధ్యమిక సిద్ధాంతం అసమంజసం. **"సర్వం శూన్యమ్"** అని వాదించేవారు తమకు అభిమతమైన ఈ సిద్ధాంతాన్ని సాధించే ప్రమాణం అనేది ఒకటి ఉన్నదని అంగీకరించే పక్షంలో ఆ ప్రమాణసద్భావాన్ని అంగీకరించినపుడే సర్వశూన్యత్వ వాదం ఖండింపబడి నట్లయినది. అటువంటి ప్రమాణం- ఏమీ లేదనే పక్షంలో, ప్రమాణం లేనందువల్ల తమకు అభిమతమైన సర్వశూన్యత్వవాదం అసిద్ధమైనది. ఇంతేకాక, **"సర్వం శూన్యమ్"** అనే ఈ వాదం ద్వారా నాస్తికత్వం కదా వివక్షితం కావాలి. ఒక రూపాన్ని విడచి ఇంకొక రూపాన్ని పొందడమే నాస్తిపదార్థం కనుక, రూపాంతరంతో అస్తిత్వమే చెప్పబడినదిగా పర్యవసిస్తుంది. మృత్పిండం నుండి బాన పుట్టినపుడు ఆ మట్టిముద్ద నశిస్తుంది. అది నశించగానే **"మృత్పిండో నాస్తి"** (మట్టిముద్ద లేదు) అని వ్యవహారం ఏర్పడుతుంది. ఈ వ్యవహారంలో బాన అనే అవస్థకదా విషయమవుతున్నది.

లోకంలో అస్తిత్వ- నాస్తిత్వాలను వ్యవహరించేవారు "ఇపుడు మట్టిముద్ద ఉన్నది; ఇపుడు మట్టిముద్ద లేదు. ఇక్కడ మట్టిముద్ద ఉన్నది. ఇక్కడ మట్టి ముద్ద లేదు'' అని ఈ రీతిలో దేశకాలాలను పురస్కరించుకొనియే వ్యవహరిస్తున్నారు. దేశకాలాలను నిర్దేశించకుండా ఊరకనే "మట్టిముద్ద లేదు'' అనే ప్రతీతి కాని, వ్యవహారం కాని ఎక్కడా కన్పించదు. "ఇపుడు మట్టిముద్ద ఉన్నది'' అని కాని, "ఇక్కడ మట్టిముద్ద ఉన్నది'' అని కాని ఒకడు వ్యవహరిస్తే మన్ను అనే ద్రవ్యానికి పిండత్వావస్థ (ముద్దరూపంలో ఉండే స్థితి) వివక్షితం. "ఇపుడు మృత్పిండం లేదు'' అని కాని, "ఇక్కడ మృత్పిండం లేదు'' అని కాని వ్యవహరిస్తే పిండత్వావస్థయొక్క నాశమైన ఘటత్వావస్థ విషయం. అందువల్ల నాస్తిత్వవ్యవహారాన్ని చేసినా, వేఱొక ఆకారంతో అస్తిత్వమే సిద్ధిస్తుంది- అనేది సర్వానుభవ సాక్షికం. "ఈ వస్తువు ఇక్కడ లేదు''- అని అంటే, ఇంకొక చోట అది ఉన్నదని సిద్ధిస్తుంది. ఇపుడు లేదంటే ఇంకొక సమయంలో ఉన్నదని సిద్ధిస్తుంది. అందుచేత ఏవిధంగాను సర్వశూన్యత్వం సిద్ధించదు- అని తేలింది. **"సర్వథా"**-పూర్వం ప్రస్తావించిన సూత్రార్థాన్ని అన్ని రీతులలోను, **"అనుపపత్తేః"** - స్వాభిమతమైన సర్వశూన్యత్వవాదం

ఉపపన్నం కానందున- అని అర్థం. అన్ని రీతులలో- అనేదానిని శ్రీరామానుజులు శ్రీభాష్యంలో వివరించేటపుడు "సదితి ప్రతిజ్ఞాయామ్, అసదితి ప్రతిజ్ఞాయాం చ" అని పలికారు.

శ్రీశంకరుల భాష్యంలో ఈ విధమైన అర్థం తెలుపబడలేదు. "దేవదత్తః సర్వథా అయోగ్యః, యజ్ఞదత్తః సర్వథా మూర్ఖః" అని అంటే ఈ వ్యవహారాలకు ఏవిధమైన అర్థాన్ని గ్రహిస్తామో, ఆ రీతిలోనే శంకరులు అర్థాన్ని గ్రహించారు. శ్రీరామానుజులు పల్కిన అర్థం సర్వథా సమంజసమైనది. వారికి ఈ విధమైన అర్థం స్ఫురించడానికి కారణం ఏది? అంటే, తిరువాయ్‌మొழிలోని **"ఉళన్ ఎనిల్ ఉళన్ అవనురువమ్ ఇవ్వురువుకళ్, ఉళనలన్ ఎనిల్ అవనరువ మివ్వురువుకళ్, ఉళన్ ఇలన్ ఎన ఇవై కుణముడైమైయిన్ ఉళన్ ఇరు తకైమైయోడు ఒழிవిలన్ పరన్దే"** (1-1-9) అనే పాశురాన్ని పురస్కరించుకొనే నిశ్చయించారనేది నిస్సందేహం. ఆ పాశురానికి గల ఆఱాయిరప్పడి వ్యాఖ్యను సేవిస్తే ఈ విషయం సులభంగా బోధపడుతుంది. ఆ పాశురానికి ద్రావిడభాషలో వ్రాయబడిన అర్థమే శ్రీభాష్యంలో సంస్కృతభాషలో వ్రాయబడినది- అనేది విశదంగా నిరూపింపబడుతున్నది.

**తిరువాయ్‌మొழி సూక్తి : (1) ఉళన్ ఎనిల్ ఉళన్ (2) అవనురువమ్ ఇవ్వురువుకళ్ (3) ఉళనలన్ ఎనిల్ ఉళన్ అవనరువ మివ్వురువుకళ్ ఇరు తకైమైయోడు ఉళన్.**

**శ్రీభాష్యసూక్తి : (1) కిం భవాన్ సర్వం సదితి ప్రతిజానీతే? (తథా సతి) తవాభిప్రేతం తుచ్ఛత్వం న సిద్ధ్యతి. (2) కిం భవాన్ అసదితి ప్రతిజానీతే? (తదాపి) తుచ్ఛత్వం న సంభవతి. శూన్యమితి ప్రతిజానతా సదితి ప్రతిజానతేవ సర్వస్య విద్య మానస్య అవస్థావిశేషయోగితైవ ప్రతిజ్ఞాతా భవతీతి తుచ్ఛతా న కుతశ్చిదపి సిద్ధ్యతి.**

వేదాంతదీపంలోను, సారంలోను సంక్షేపంగా పల్కిన సూక్తులను గమనించినా అవి తిరువాయ్‌మొழிకి, సాక్షాదనువాదమనే సంగతి బోధపడుతుంది. ఇతరభాష్య కారులు ఈ రీతిలో సూత్రార్థాన్ని నిర్వహించకపోవడం దివ్యప్రబంధంలో వారికి ప్రవేశం లేనందువల్ల - అనేది దృఢంగా భావించదగిన అంశం.

## నిత్యగ్రంథం నుండి నిధివంటి సూక్తి

భగవద్రామానుజులు అనుగ్రహించిన నవరత్నాలుగా చెప్పదగిన తొమ్మిది దివ్యగ్రంథాలలో చరమమని చెప్పబడే నిత్యగ్రంథం నుండి ఒక నిధిని వెలికితీసి

ఇక్కడ చూపిస్తాను. శ్రీవైష్ణవులు ప్రతిదినం చేసే తిరువారాధనాన్ని ఆళ్వార్ల శ్రీసూక్తులను అనుసరించడంతోనే పూర్తిచేయాలని, దివ్యసూరులు అనుగ్రహించిన శ్రీసూక్తులు అనుసంధానం లేని తిరువారాధనంతో భగవానుని మనస్సును తృప్తి కలుగదని సత్సంప్రదాయవృద్ధుల అధ్యవసాయం. అనుష్ఠానం కూడ ఈ రీతిలోనే అనాదికాలంగా అంతటా చేయబడుతున్నది. దీనిని గూర్చి, శ్రీభగవద్రామానుజులు అనుగ్రహించిన తిరువారాధన ప్రయోగాలలో (నిత్యగ్రంథంలో) దీని గూర్చి ఏమీ చెప్పబడలేదని, వారి కాలంలో ఈ విధంగా అనుష్ఠానం ఉంటే దీనిని శ్రీరామానుజులు అనుగ్రహించకుండా ఉంటారా? అని కొందరు సందేహపడి పలుకవచ్చు.

అర్చావతారం శాస్త్రీయమై ఉంటే, దీనినిగూర్చి వేదంలో చెప్పబడకుండా ఉంటుందా ? వేదంలో ఏచోట అర్చావతార ప్రస్తావమే లేదు కదా? ఆ విధంగా ఉన్నపుడు అర్చావతార ప్రామాణ్యాన్ని ఏ విధంగా అంగీకరించాలి ? అని కొందరు కోలాహలం చేస్తారు. వీరు వేదాలను పూర్తిగా గమనించినట్లు, అధ్యయనం చేసినట్లు తలచికదా ఈవిధంగా సంభ్రమాన్ని పొందుతున్నారు. ఈవిధంగా పలు పలు విషయాలుంటాయి. దేనిని లోతుగా గమనించకుండా పైపైన చూచి పలికే కొందరి మాటలనే వేదంగా నమ్మి "అందులో ఇది లేదు; ఇందులో అది లేదు'' అని అంటూ సర్వజ్ఞులవలె మాట్లాడుతూ కొందరు పామరులు మోసం చేసేవారు అంతటా ఉంటారు. అదేరీతిలో శ్రీరామానుజుల నిత్యగ్రంథాన్ని లోతుగా గమనించకుండా ఎవరో కొందరు పలికే మాట ఇది.

నిత్యగ్రంథంలో **"శ్రుతిసుఖైః స్తోత్రై రభిష్టూయ"** అనే ఒక ప్రయోగం ఉన్నది. ఆళ్వార్ల శ్రీసూక్తులకు **"శెవిక్కినియ శెఞ్జొల్"** (చెవులకు ఇంపైన ఋజువైన అందమైన సూక్తులు) అని పేరు **"కేట్టారార్ వానవర్కళ్ శెవిక్కినియ శెఞ్జొల్"** (తిరువాయ్మొళి-10-6-11) (కర్ణామృతాలైన, ఋజువైన సూక్తులను విని నిత్యసూరులు ఎన్నటికీ చాలు అనే తృప్తి చెందరు) అని నమ్మాళ్వార్లు స్వయంగా అన్నారు. **"శెవిక్కినియ"** అనే ప్రయోగానికి పర్యాయంగానే శ్రీరామానుజులు **"శ్రుతిసుఖైః"** అని అన్నారు. **"వైదికసూక్తైః"** అని గాని, వేఱు రీతిలో గాని పలుకకుండా ఈవిధంగా పల్కడం వారికే అసాధారణమైన, గంభీరమైన శైలి. **"శ్రుతిసుఖైః సూక్తైః"** అని కూడా కొన్ని దశలలో పాఠం కన్పిస్తున్నది. అదికూడా చాలా పొసగుతుంది.

భగవద్రామానుజుల గంభీరమైనసూక్తిసరణిని గూర్చి తరువాత వ్యాసంలో అవగాహించి ఆనందించవచ్చు.

### భగవద్రామానుజ శ్రీసూక్తి శైలి

ఇంతవరకు చేసిన నిరూపణలను నిశితంగా గమనించి చూచేవారు, భగవద్రామానుజులు దివ్యప్రబంధామృతసాగరంలో అవగాహించినవారే -అనే విషయాన్ని అంతరంగ సాక్షికంగా నిశ్చయించుకుంటారు - అనే అంశంలో సందేహం లేదు. అయినా, కొందరి మనస్సులలో ఒక ప్రశ్న స్ఫురించే అవకాశం ఉన్నది. (అది ఏమంటే) ఈ విధంగా సూక్ష్మంగా ఎత్తి చూపవలసినట్లుగా గహనంగా, రహస్యంగా పల్కడం ఎందుకు? సువ్యక్తంగానే కూరేశులు, భట్టర్ మొదలైనవారివలె అనుగ్రహించి ఉండకూడదా? అనేది ఆ సందేహం.

ఈ సందేహం తగినదే. ఇది కొందరికి మాత్రమే కాదు. పలువురికి కలుగవచ్చు. శ్రీభాష్య ప్రవచన ప్రవీణులైన మహాత్ములలోకూడా ఈ విధంగా భావించేవారున్నారు. శ్రీరామానుజులను పరమాదరణీయులైన ఆళవందార్ **"మాతా పితా"** ఇత్యాదిశ్లోకాన్ని అనుగ్రహించారు. కూరేశులు, భట్టర్ మొదలైనవారు. ఆఝ్వార్లనుగూర్చి అపరిమితంగా పలికారు. ఆ రీతిలో శ్రీరామానుజులు ఎందుకు పలుకకూడదు? అని ప్రశ్నించేవారు పలువురు ఉండవచ్చు. దీనికి పెద్దలు చెప్పే సమాధానం ఇంతమాత్రమే. ఒక్కొక్కరి ఉక్తిశైలి ఒక్కొక్క రీతిలో ఉంటుంది. ఆళవందార్ **"వకుళాభిరామమ్"** అనే ఒక విలక్షణమైన ఉక్తి ద్వారా ప్రకాశింపజేశారే తప్ప వేఱేమి లేదు. వారి ఉక్తి చాతుర్యం కంటే కూడా భగవద్రామానుజ ఉక్తిచాతుర్యం విలక్షణమైనది. వీరు **"పంచాచార్యపదాశ్రితులు"** (అయిదుగురు ఆచార్యుల పాదాలను ఆశ్రయించినవారు) అనేది సుప్రసిద్ధం. ఆ అయిదుగురు ఆచార్యుల తిరునామాలను శ్రీదేశికులు ప్రస్తావించినందువల్లనే స్వామి పంచాచార్య పదాశ్రితులు - అనే విషయంలో ఎవరికీ సంశయం గానీ, వివాదం గాని ఉండే ప్రసక్తి లేదు. ఆ ఆచార్యులను గూర్చి శ్రీరామానుజులు ఏవిధమైన స్తుతులను అయినా రచించారా? అని గమనించాలి. ఆ ఆచార్యులకు అనాది నుండి ఈనాటివరకు వ్యవహరింపబడే తనియన్‌లు శ్రీరామానుజులచే అనుగ్రహింప బడినవే - అని కొందరు అంటారు. ఇది వివాదగ్రస్తం కనుక వదలిపెడతాను. ఆళవందార్ తనియన్ అయిన **"యత్పదాంభోరుహ"** ఇత్యాది తనియన్ శ్లోకం

శ్రీరామానుజులచే రచింపబడింది- అనేది నిర్వివాదం ఇది గీతాభాష్యంలోనే చేరినది కనుక, శ్రీరామానుజులచే రచింపబడినది- అనే విషయంలో వివాదలేశమైనా లేదు. ఈ శ్లోకసన్నివేశంలోని అందాన్ని గమనిస్తే శ్రీరామానుజుల ఉక్తిసరణి లోకవిలక్షణ మైనది - అనే విషయాన్ని అల్పప్రజ్ఞ కలవారు కూడా నిశ్చయించుకోవచ్చు. ఆ శ్లోకానికి పెద్దలు పరంపరగా ఉపదేశించే అర్థ విశేషాలను ఆత్మీయులకు తెలియజేస్తాను.

**యత్పదాంభోరుహధ్యాన విధ్వస్తాశేషకల్మషః ।**
**వస్తుతా ముపయాతోఽహం యామునేయం నమామి తమ్ ॥**

ఇది ఆళవందార్‌యొక్క రెండు శ్రీ చరణాలను మాత్రం ధ్యానిస్తున్నట్లుగా మాత్రమే తెలుపడం లేదు. **"యత్పదాంభోరుహ"** పదంతో పధ్నాలుగు శ్రీ చరణాలు ఉద్దేశింపబడ్డాయి. **"యత్పదాంభోరుహ"** అనే ఆఱు అక్షరాలను వర్ణక్రమాన్ని పల్కితే పధ్నాలుగా అక్షరాలు వస్తాయి. అవి యకార, అకార, తకార, పకార, అకార, దకార, ఆకార, మకార, భకార, ఓకార, రేఫకార, ఉకార, హకార, ఉకారాలు, ఈవిధంగా వచ్చే పద్నాలుగు అక్షరాలు పధ్నాలుగు శ్రీచరణాలను నిర్దేశిస్తాయి. అవి ఏవి? అంటే, ఆళవందార్ యొక్క శ్రీచరణాలు రెండు అందరికి తెలిసినవే. ఆ యామునులు తమలో గొప్పనిధిగా భావించిన **"శ్రీమత్తదంఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా"** (అందమైన ఆ నమ్మాళ్వార్ల శ్రీచరణాలను రెండిటిని శిరసా నమస్కరిస్తున్నాను - అనే నమ్మాళ్వార్ల శ్రీచరణాలు రెండు, ఈ విధంగా నాల్గు శ్రీచరణాలు. ఆ ఆళవందార్‌ను ఆశ్రయించి శ్రీరామానుజులను ఆచార్యులైన అయిదుగురు ఆచార్యుల శ్రీచరణాలు పది. ఈ రీతిలో ఈ పధ్నాలుగు శ్రీచరణాలను ధ్యానించి సత్తను పొందినట్లుగా ఈ శ్లోకం తెల్పుతున్నది. దీనిని వివరించి తెలియజేస్తాను చూడండి.

**"యస్య పదాంభోరుహే యత్పదాంభోరుహే"** అని సమాసం. ఇక్కడ సంబంధ సామాన్యంలో షష్ఠీవిభక్తిగా గ్రహించాలి. శ్రీయామునుల తిరుమేనిలోని శ్రీచరణారవిందాలను ఇది తెల్పుతుంది. తిరిగి, **"యత్పదాంభోరుహే"** -అని అంటే ఆళవందార్ తాము **"మాతా పితా యువతయః"** అనే శ్లోకంలో **"ఆద్యస్య నః కులపతేః వకుళాభిరామమ్ శ్రీమత్తదంఘ్రియుళం ప్రణమామి మూర్ధ్నా"** అని

అంటూ తమ శిరస్సుకు ఆభరణంగా పరిగ్రహించిన నమ్మాళ్వార్ల రెండు పాదాలు **"యత్పదాంభోరుహ"** శబ్దంతోనే సులభంగా తెలుపబడతాయి. ఇపుడు షష్ఠీవిభక్తికి అర్థం. పరిగ్రాహ్యపరిగ్రాహక రూప సంబంధం. మళ్ళీ **"యస్య పదాంభోరుహాణి యత్పదాంభోరుహాణి"** అని గ్రహించాలి. లోకంలో శిష్యులను శ్రీచరణాలుగానే (శ్రీచరణస్థానీయులుగానే) సంప్రదాయజ్ఞులు వ్యవహరిస్తారు కనుక, ఆళవందార్ యొక్క అయిదుగురు శిష్యులే ఆళవందార్‌యొక్క శ్రీచరణాలుగా ఇక్కడ తెలుపబడ్డారు. **"పదాంభోరుహ"** అనే సమస్త పదంలో రెండు పదాలున్నాయి కదా! **(పద- అని, అంభోరుహ- అని)** శ్రీచరణాలను వాచకమైన పదశబ్దం వారి శిష్యులకు తెల్పి, తామరపూవుకు వాచకమైన అంభోరుహశబ్దం వారి శ్రీచరణాలను తెల్పుతున్నదని కూడా చెప్పవచ్చు. అంభోరుహమనే పదం శ్రీచరణాలను తెల్పుతుందా? అని అంటే **"తావి వైయమ్ కొణ్డతడమ్ తామరైకట్కే"** (తిరువాయ్ మొழி-6-9-9) (స్పృశించి భూమిని అంతటినీ గ్రహించిన విశాలమైన తామరలకే) అనే నమ్మాళ్వార్ల ప్రయోగాన్ని తెలిసినవారు ఇందులో విప్రతిపత్తిని పొందరు. **"తాది వైయమ్ కొణ్డ తడమ్ తాళిణై"** అని చెప్పవలసిన చోట శ్రీచరణాలను పర్యాయంగా తామరలనే పల్కడం గమనించాలి. ఈ సరణి సంస్కృతభాషలో కూడా ఉన్నది. దీనిని అపహ్నుత్యలంకారమని అంటారు. రూపకాతిశయోక్తి కూడా కావచ్చు. దీనికి ఉదాహరణం **"పశ్య నీలోత్పల ద్వంద్వాన్నిస్సరంతి శితా శ్శరాః"** (నల్లకలువల జంట నుండి పదునైన బాణాలు వెలువడుతున్నాయి, చూడు) అనేది.

ఈ రీతిలో పరమాచార్యులైన నమ్మాళ్వార్లను, ప్రాచార్యులైన ఆళవందార్‌ను, స్వాచార్యులైన అయిదుగురు ఆచార్యులను ప్రకాశింపజేసే తనియన్ శ్లోకాన్ని శ్రీరామానుజులు అనుగ్రహించిన అందం సహృదయ హృదయంగమం. **"గురుం ప్రకాశయేత్ శిష్యః"** (శిష్యుడు గురువు వైభవాన్ని ప్రకాశింపజేయాలి) అని కాకుండా **"గురుం ప్రకాశయేద్ధీమాన్"** (బుద్ధిమంతుడు గురువు వైభవాన్ని ప్రకాశింపజేయాలి) అని ప్రమాణవచనం ఉన్నందువల్ల మహామేధావులు ఏవిధంగా ఆచార్యప్రకాశనం చేయవచ్చునో, ఆవిధంగానే శ్రీరామానుజులు తాముకూడా తమ మేథావైభవం ప్రకాశించేటట్లు ఈ విధంగా శ్లోకార్థాన్ని కూర్చడం చాలా అద్భుతం. మహాత్ముల వాక్ సామర్థ్యం ఈ విధంగా కదా! ఉంటుంది. ఈ రీతిలో సూక్ష్మంగా తెలియ వలసినట్లుగా ఎందుకు శ్లోకాన్ని రచించాలి? అందరు సుస్పష్టంగా చక్కగా

గ్రహించేటట్లుగా రచించకూడదా? అని అడిగే వారు యావజ్జీవం ఆ విధంగా అడుగుతూ ఉండవలసిందే.

**"యత్పదాంభోరుహ"** ఇత్యాదిగా పూర్వం ప్రస్తావించిన తనియన్‌లో ఇంకొక విశేషార్థం కూడా సూక్ష్మంగా గ్రహించవలసినది ఉన్నది. అది ఏమంటే- **"పదాంభోరుహ"** అని అయిదు అక్షరాలను ప్రయోగించి ఆళవందార్ శ్రీచరణాలను నిర్దేశించడం ద్వారా ఆళవందార్ యొక్క అయిదుగురు శిష్యులు తమ ధ్యానానికి లక్ష్యభూతులు- అని తెలుపబడినట్లయినది. అందులోను, మొదట పకారాన్ని ప్రయోగించడం ఆ అయిదుగురు ఆచార్యులలో ప్రధానులైన ఆచార్యులే తమను ప్రధానాచార్యులుగా అయ్యారు - అనే దానికి సూచకం. ఏవిధంగా? అంటే శ్రీరామానుజుల ఆచార్యులలో ప్రధానాచార్యులు పెరియనంబి. వారిని జన్మనామధేయం పరాంకుశదాసులు- అని వాక్యగురుపరంపరలో **"శ్రీమతే రామానుజాయ నమః", "శ్రీమద్యామున మునయే నమః"** అనే వాక్యాల మధ్య **"శ్రీపరాంకుశదాసాయ నమః"** అని ఉన్నందువల్ల కూడా పెరియనంబి తిరునామం పరాంకుశదాసులని తెలియవచ్చు. **"పదాంభోరుహ"** అనే పదంలో మొదట ఉండే పకారం పరాంకుశదాసులనే తనకు మొదటి ఆచార్యులను ప్రత్యభిజ్ఞాపకం- అని గ్రహించాలి. ఇంతకుమించి, ఇంకొక విషయాన్ని ఇక్కడ అడగవచ్చు మొదటి అక్షరంతో పెరియనంబి సూచింపబడినట్లే, మిగిలిన నాల్గు అక్షరాలతోను మిగిలిన నాల్గు ఆచార్యులు సూచింపబడే రీతిని చూపవద్దా! అని వినండి. ప్రధానులైన ఆచార్యులను సూచించినంతమాత్రంలోనే చాలు. ఒక్కొక్క ఆచార్యులను ఈ రీతిలో సూచింపజేయాలి- అనే నిర్బంధం లేదు. మహావివేకులైన చతురులు ఇంకా లోపల అవగాహించి, పరిశీలించి చూస్తే, ఆ మార్గం కూడా కన్పించవచ్చు. దానిని కూడా ఇంకొక సారి మేము చూపిస్తాము.

ఈవిధంగా ఈ ఉపపాదన ప్రక్రియద్వారా శ్రీరామానుజులు అరుదైన, గొప్ప విశేషాలను చాలా సూక్ష్మంగానే సూచించే స్వభావాన్ని కలవారు - అనే దానిని వివేకులు నిర్ణయించడంలో కొఱత లేదు. తిరుమాలైయాణ్డాన్ సన్నిధిలో శ్రీరామానుజులు తిరువాయ్‌మొழి ప్రబంధార్థాన్ని ఆలకించే సమయంలో "ద్రోణాచార్యులను ఏకలవ్యునివలె ఆళవందార్‌కు నేను ఏకలవ్య శిష్యుడను'' అని అన్నారని చరిత్ర గ్రంథాలలో ప్రసిద్ధంగా ఉన్నది. దీనిని శ్రీదేశికులు యథాతథంగా

సంస్కృతీకరించి "ద్రోణాచర్యస్య ఏకలవ్య ఇవ యామునాచార్యస్య అహ మిత్యభి ప్రాయేణ" అని అంటూ "యత్పదాంభోరుహ" శ్లోక వ్యాఖ్యానంలో పలికారు. ఆళ్వార్ల శ్రీచరణాలలోని ప్రావణ్యమే మూర్తీభవించిన ఆళవందార్ యొక్క శ్రీచరణాలను ధ్యానించి తాము సత్తను పొందినట్లు పలికే శ్రీరామానుజులు ఆళ్వార్ల శ్రీచరణాలలోను, వారి దివ్యసూక్తులలోను ఆళవందార్‌కంటే అతిశయించిన ప్రావణ్యాన్ని కలవారనే విషయం శిలాలిఖితం.

**ప్రధానప్రతితంత్రార్థంకూడా దివ్యప్రబంధాలనుండే గ్రహింపబడింది.**

మన విశిష్టాద్వైత సిద్ధాంతంలో శరీరాత్మభావమనేది ప్రధాన ప్రతితంత్రార్థ మని గొప్పగా చెప్పబడుతున్నది. ఉపనిషత్తులలో, చేతనాచేతనేశ్వరులకు అభేదం కొన్ని చోట్ల, భేదం పలు చోట్ల తెలుపబడింది. ఆ భేదం తెలుపబడిన సందర్భాలను మాత్రం అద్వైతులు ప్రధానంగా గ్రహించి, భేదం తెలుపబడిన సందర్భాలను గౌణంగా పల్కి తమ సిద్ధాంత నిర్వాహాన్ని చేశారు. ద్వైతులు అయితే, భేదం తెలుపబడిన సందర్భాలను మాత్రం ముఖ్యంగా గ్రహించి, అభేదశ్రుతులను గౌణంగా పల్కి తమ సిద్ధాంత నిర్వాహాన్ని చేశారు. శ్రీవైష్ణవులమైన మనం ఆ రీతిలో కాకుండా, ఉభయశ్రుతులను సమప్రధానాలుగానే గ్రహించి, నిర్వహించి విశిష్టాద్వైతులనే పేరును పొందినవారమయ్యాము. భేదం, అభేదం - అనే రెండింటిని తెలిపే ఉభయశ్రుతులను సమప్రధానంగా ఏవిధంగా నిర్వహిస్తున్నాము? అని అంటే, శరీరాత్మభావాన్ని పురస్కరించుకొని నిర్వహిస్తున్నాము.

దీనిని ఇక్కడ వివరంగా తెలుపవలసిన అక్కరలేదు. సుబాలోపనిషత్తు, అంతర్యామి బ్రాహ్మణం మొదలైన ఉపనిషత్తులను పురస్కరించుకొనే ఆళవన్దార్, భగవద్రామానుజులు మొదలైన ఆచార్యులు ఆ నిర్వాహప్రక్రియలను ఆదరణలో రక్షిస్తూ వచ్చారు - అని మన పెద్దలు అంటున్నారు. దీనిని కాదని అనడం లేదు అయితే, ఇక్కడ మనం ఒక విషయాన్ని ఆలోచించాలి. అంతర్యామి బ్రాహ్మణాదులు మనము మాత్రమే బాషించేవి కావు మతాంతరులకు కూడా అవి ఉన్నాయి కదా. అయినా, వారు ఆ ఉపనిషద్భాగాలలో ఆదరం లేకుండా ఉన్నారు. ఆళవందార్, ఎంబెరుమానార్ మొదలైన మన పూర్వాచార్యులు మాత్రమే వాటిలో విశేషమైన దృష్టిని సారించారు. దీనికి ఏమి కారణం? అని అంటే, "అరుళినాన్ అవ్వఋ

మఱైయన్ పొరుళ్ అరుళ్కొణ్డు ఆయిరమ్ ఇన్దమిழ் పాడినాన్, అరుళ్ కణ్డీర్ ఇవ్వులకినిల్ మిక్కదే" (ఆ అరుదైన వేదాల అర్థాన్ని శఠకోపముని అనుగ్రహించారు. దయతో వేయి తీయని ద్రావిడ పాశురాలను పాడారు. శఠకోపులు కరుణను చూడండి. ఈ లోకంలో అది చాలా గొప్పదికదా) అని అన్నారు, మధురకవులు. "శడకోపనరుళినాలే" (శఠకోపుల దయతో) అని దేశికులు అన్నారు. "తదాదౌ గాథాభిః ముని రధికవింశాభి రిహ నః కృతీ సారగ్రాహం వ్యతరదిహ సంగృహ్య కృపయా" (శఠకోపముని, కృపతో వేద ప్రతిపాద్యార్థాన్ని సంగ్రహించి, ముందుగా ఇరవైకి మించిన పాశురాలతో అనుగ్రహించారు) ఇత్యాది సూక్తులలో ద్రవిడోపనిషత్ సారం, తాత్పర్య రత్నావళి మొదలైనవానిలో విస్తృతంగా తెలిపారు కదా. ఇక్కడ "ఇరవై పాశురాలతో'' అని అనకుండా "అధికవింశాభిః గాథాభిః" (ఇరవైకి మించిన పాశురాలతో) అని, ద్రావిడోపనిషత్ తాత్పర్య రత్నావళితో "వింశతిర్వ్యక్తి సాగ్రా" అని (ఇరవైకంటే మించిన) అని పల్కినందువల్ల, తిరువాయ్మొழிలోని మొదటి రెండు దశకాలు, మూడవ దశకంలోని రెండు పాశురాలు భాష్యకారుల వేదాంతార్థ నిష్కర్షకు చాలా చేదోడు అయినవి- అని మన ఆచార్యగోష్ఠిలో, ప్రసిద్ధంగా పల్కడం శ్రీదేశికుల సూక్తి వల్ల సుస్పష్టమవు తున్నది. ఆచార్యులందరు ఇందులో ఏకకంఠులు కదా!

ముఖ్యంగా భేదాభేదశ్రుతులను శరీరశరీరిభావంతో మన ఆచార్యులు పొసగేటట్లు చేయడం ఆழ்వార్ల శ్రీసూక్తులను పురస్కరించుకొనే- అనే విషయంలో ఏ సందేహం లేదు. తిరువాయ్మొழிలో "ఉడన్మిశై ఉయిరెన క్కరన్దెఙ్గుమ్ పరన్దుళన్" (1-1-7) (శరీరంలో ఆత్మవలె, కఱిగి (అంతటా వ్యాపించిఉన్నాడు) అనే పాశురం నుండే అర్థనిధిని పొంది, నిర్మల హృదయులయ్యారు, మన పూర్వాచార్యులు. ఆ పాశురానికి పిళ్ళాన్ (కూరేశులు) ఆఱాయిరప్పడివ్యాఖ్యానం చాలా విస్తృతంగా అవతరించింది. అంతటి విస్తృతి ఇక, తిరువాయ్మొழிలోని ఏ పాశురానికి లేదు. శ్రీభాష్యకారులకు ఆ పాశురం అర్థనిధిని దర్శింపజేసింది అనే విషయాన్ని పిళ్ళాన్ తమ విశద వ్యాఖ్యానం ద్వారా స్పష్టం చేశారు.

ఈ విషయంవలెనే, నిర్గుణశ్రుతులకు హేయగుణరాహిత్య ప్రతిపాదనంలో దృష్టి -అని పల్కి, భగవానుని అనంతకళ్యాణగుణ మహోదధిగా భగవద్యామునులు, భగవద్రామానుజులు నిష్కర్షించడం ఆழ்వార్ల ఈ సూక్తిని దృష్టిలో పెట్టుకొనియే.

శారీరక మీమాంసలోని మొదటి సూత్రం **"అథాతో బ్రహ్మజిజ్ఞాసా"** అనేది. ఇందులో, బ్రహ్మశబ్దానికి శ్రీశంకరాచార్యులవారు అర్థాన్ని చెప్పారు; మన శ్రీభాష్యకారులు వివరించారు. ఈ రెండిటిని గమనిద్దాం. **"బ్రహ్మ చ వక్ష్యమాణలక్షణం- జన్మాద్యస్య యత- ఇతి"** (బ్రహ్మ ఏతావన్మాత్రమే శంకర భాష్యంలో వివరింపబడింది. ఇక, భగవద్రామానుజుల శ్రీభాష్యసూక్తి- **"బ్రహ్మశబ్దేన స్వభావతో నిరస్తనిఖిలదోషః అనవధికాతిశయా సంఖ్యేయకల్యాణగుణగణః పురుషోత్తమోఽభిధీయతే"** (బ్రహ్మశబ్దం చేత సహజంగా ఏ దోషాన్ని లేనివాడు, అంతులేని గొప్పతనాన్ని కల్గిన, లెక్కలేనన్ని కల్యాణగుణగణాలను కల్గినవాడైన పురుషోత్తముడు చెప్పబడుతున్నాడు) అని ఉన్నది. ఆ*ఝ్వా*ర్లు తిరువాయ్మొ*ఝి* ప్రబంధాన్ని ప్రారంభించేటపుడే **"ఉయర్వఱ ఉయర్నల ముడైయవన్"** (నిస్సమాభ్యధికమైన లెక్కలేనన్ని కల్యాణగుణాలను కలవాడు) అని పలికిన సూక్తినే శ్రీరామానుజులు అనువదించారు. **ఉయర్వఱ** = అనవధికాతిశయమైన, **ఉయర్** = లెక్కలేనన్ని, **నలమ్ ఉడైయవన్** = కల్యాణ గుణాలను కలవాడు, **ఎవన్ అవన్** = ఎవడో అతడు (పురుషోత్తముడు).

ఆ*ఝ్వా*ర్ల శ్రీసూక్తులన్నీ భగవద్గుణగణమయాలే కనుక, ఆ అమృత సాగరంలో ఊరిన శ్రీరామానుజులు దానికి తగిన రీతిలోనే పలికారు. ద్రావిడంలో **"మాల్"** అని, **"నెడుమాల్"** అని ఈ విధమైన సూక్తులకు ఏ రీతిలోని అర్థాలను మనం భగవద్విషయంలో అనుభవిస్తున్నామో, ఆ అర్థాలనే బ్రహ్మశబ్దార్థంగా శ్రీరామానుజులు ఉపపాదించే రీతిని అనుభవించే అదృష్టానికి పెట్టిపుట్టినవారే భాగ్యాన్ని కలవారు.



# అనుబంధం-1

# భగవద్రామానుజాష్టోత్తర శతనామాలు

(వివరణంతో)

1. రామానుజః - (రామానుజులనే పేరు కలవారు)
2. పుష్కరాక్షః - (తామరపూవులవంటి అందమైన కన్నులను కలవారు)
3. యతీంద్రః - (వరదరాజస్వామిచే యతీంద్రులనే పేరును పొందినవారు)
4. కరుణాకరః - (కరుణ అనే గుణానికి జన్మస్థానమైనవారు)
5. కాంతిమత్యాత్మజః - (కాంతిమతీదేవికి పుత్రులు)
6. శ్రీమాన్ - (అందమైనవారు, కైంకర్య సంపదను కలవారు, జ్ఞానభక్తి వైరాగ్యాలను కలవారు)
7. లీలామానుషవిగ్రహః - (లీలార్థం మానవరూపాన్ని పొందినవారు)
8. సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞః - (అన్ని శాస్త్రాల అర్థతత్త్వాన్ని తెలిసినవారు)
9. సర్వజ్ఞః - (అన్నిటిని తెలిసినవారు, లేదా, భగవంతుని అభిప్రాయాన్న గ్రహించిన వారు)
10. సజ్జనప్రియః - (మంచివారికి ఇష్టమైనవారు, మంచివారిని ఇష్టపడేవారు)
11. నారాయణ కృపాపాత్రమ్ - (వరదరాజస్వామి కృపకు పాత్రులు)
12. శ్రీభూతపురనాయకః - (భూతపురికి నాథులు)
13. అనఘః - (కళంకరహితులు)
14. భక్తమందారః - (భక్తులకు కల్పవృక్షంవంటివారు)
15. కేశవానందవర్ధనః - (తండ్రియైన కేశవసోమయాజికి ఆనందాన్ని కల్గించిన వారు, లేక కేశవుడనబడే భగవంతుని ఆనందాన్ని వృద్ధి చేసినవారు)
16. కాంచీపూర్ణప్రియసఖః - (తిరుక్కచ్చినంబికి స్నేహితులు)
17. ప్రణతార్తివినాశనః - (తమను కొలిచేవారి ఆర్తిని తీర్చేవారు)
18. పుణ్యసంకీర్తనః - (సద్గతిని పొందించే తిరునామాన్ని కలవారు)

19. **పుణ్యః** - (పుణ్యస్వరూపులు)
20. **బ్రహ్మరాక్షసమోచకః** - (కాంచీనగర ప్రభువుకుమార్తెను బ్రహ్మరక్షస్సు నుండి విడిపించినవారు)
21. **యాదవపాదితాపార్థవృక్షచ్ఛేద కుఠారకః** - (యాదవప్రకాశులు పలికే అపార్థాలనే వృక్షాలను ఛేదించే గొడ్డలివంటివారు - ఆ అపార్థాలను నిరసించేవారు)
22. **అమోఘః** - (వ్యర్థం కాని ప్రయత్నాలను, జ్ఞానాన్ని కలవారు)
23. **లక్ష్మణమునిః**- (రామానుజ (లక్ష్మణ) ముని అనే పేరును కలవారు)
24. **శారదాశోకనాశనః** - (శ్రీభాష్యరచనద్వారా శారదాదేవి శోకాన్ని పోగొట్టినవారు)
25. **నిరంతరజనాజ్ఞాన నిర్మోచనవిచక్షణః** - (నిరంతరం జనుల అజ్ఞానాన్ని పోగొట్టడంలో సమర్థులు)
26. **వేదాంతద్వయసారజ్ఞః** - (ఉభయ వేదాంతాల సారాన్ని తెలిసినవారు)
27. **వరదాంబుప్రదాయకః** - (కాంచీపురంలో వరదరాజస్వామికి **"శాలక్కిణఱు"** అనే బావినుండి నీటిని సమర్పించినవారు)
28. **పరేఙ్గితజ్ఞః** - (ఇతరుల అభిప్రాయాన్ని గ్రహించేవారు)
29. **నీతిజ్ఞః** - (నీతిశాస్త్ర కోవిదులు)
30. **యామునాంగుళిమోచకః** - (యామునుల చరమశరీరంలో ముడుచుకొని ఉన్న మూడువేళ్ళను విడిపించినవారు)
31. **దేవరాజకృపాలబ్ధ షడ్వాక్యార్థమహోదధిః** - (వరదరాజస్వామి కృపవల్ల గొప్పసముద్రంవలె గంభీరమైన అర్థాన్ని కల ఆఱు వార్తలను పొందినవారు)
32. **పూర్ణార్యలబ్ధసన్మంత్రః** - (పెరియనంబి వల్ల రహస్యత్రయోపదేశాన్ని పొందినవారు)
33. **శౌరిపాదాబ్జషట్పదః** - (శ్రీమన్నారాయణుని పాదాలనే తామరపూవులలో నిలచి ఉండే తుమ్మెదవంటివారు.)
34. **త్రిదండధారీ** - (త్రిదండాన్ని ధరించేవాడు)
35. **బ్రహ్మజ్ఞః** - (పరమాత్మను తెలిసినవారు, లేక, వేదాన్ని తెలిసినవారు)

36. బ్రహ్మధ్యానపరాయణః - (పరతత్త్వమైన శ్రీమన్నారాయణుని సదా ధ్యానించేవారు)

37. రంగేశకైంకర్యరతః - (శ్రీరంగనాతుని సేవలో ఆసక్తికలవారు)

38. విభూతిద్వయనాయకః - (ఉభయ విభూతులను నిర్వహించేవారు)

39. గోష్ఠీపూర్ణకృపాలబ్ధమంత్రరాజప్రకాశకః - (తిరుక్కచ్చినంబి కృపవల్ల లభించిన మంత్రరాజమనే అష్టాక్షరియొక్క అర్థాన్ని ఆశను కలవారందఱికి తెలిసినవారు)

40. వరరంగానుకంపాత్తద్రావిడామ్నాయసాగరః - (తిరువరంగప్పెరుమాళ్ అరైయర్ అనే ఆచార్యుల కృప వల్ల ద్రావిడవేద సాగరాన్ని పొందినవారు - ద్రావిడవేదం యొక్క అర్థాన్ని గ్రహించినవారు.)

41. మాలాధరార్యసుజ్ఞాత ద్రావిడామ్నాయతత్త్వధీః - (తిరుమాలైయాణ్డాన్ అనే ఆచార్యులవల్ల ద్రావిడవేదంలో అర్థతత్త్వాన్ని చక్కగా తెలిసినవారు)

42. చతుస్సప్తతి శిష్యాఢ్యః - (74 మంది సింహాసనాధిపతులను శిష్యులుగా కలవారు)

43. పంచాచార్యపదాశ్రయః - (అయిదుగురు ఆచార్యుల పాదాలను ఆశ్రయించినవారు.)

44. ప్రపీతవిషతీర్థాంభః ప్రకటీకృతవైభవః - (విషం కలిసిన నీటిని తాగిన తర్వాత కూడా ఏవిధమైన హాని పొందనందున వ్యక్తమైన ప్రభావాన్ని కలవారు)

45. ప్రణతార్తిహరాచార్య దత్తభిక్షైకభోజనః - ప్రణతార్తిహరాచార్యులనే కిడాంబి ఆచ్చాన్ సమర్పించే భిక్షను మాత్రమే భోజనంగా కలవారు)

46. పవిత్రీకృతకూరేశః - (కూరేశులను పవిత్రంగా పవిత్రస్థానీయులుగా చేసికొన్నవారు)

47. భాగినేయత్రిదండకః - (మేనల్లుడైన ముదలియాణ్డాన్‌ను త్రిదండంగా చేసికొన్నవారు)

48. కూరేశదాశరథ్యాది చరమార్థ ప్రదాయకః - (కూరేశులు, దాశరథి మొదలైన వారికి తిరుక్కోట్టియూర్‌నంబి వల్ల తాము గ్రహించిన చరమశ్లోకార్థాన్ని ఉపదేశించినవారు)

**49.** **రంగేశవేంకటాధీశప్రకటీకృతవైభవః** - శ్రీరంగనాథునిచే, శ్రీవేంకటేశ్వరునిచే వ్యక్తం చేయబడిన వైభవాన్ని కలవారు)

**50.** **దేవరాజార్చనరతః** - (వరదరాజస్వామి మూర్తిని తమ తిరువారాధన మూర్తిగా కలవారు)

**51.** **మూకముక్తిప్రదాయకః** - (మూగకు మోక్షాన్ని ప్రసాదించినవారు.)

**52.** **యజ్ఞమూర్తిప్రతిష్ఠాతా** - (అద్వైతి అయిన యజ్ఞమూర్తిని విశిష్టాద్వైత సిద్ధాంతంలో నిలిపినవారు)

**53.** **మన్నాథః** - (ఎమ్బెరుమానార్ తిరుమంత్రార్థాన్ని ఆశను కలవారికి అందఱికి అనుగ్రహించి ఎమ్బెరుమానార్ అనే నామాన్ని పొందినవారు)

**54.** **ధరణీధరః** - (భూమిని ధరించే ఆదిశేషుల అవతారరూపులు)

**55.** **వరదాచార్యసద్భక్తః** - (వరదాచార్యులనే పరుత్తిక్కొల్లై యమ్మాళ్ అనే గొప్ప భక్తుని కలవారు.)

**56.** **యజ్ఞేశార్తివినాశకః** - (తమను శ్రీరామానుజులు ఉపేక్షించినందున యజ్ఞేశులు ఆర్తిని పొందగా, ఆ ఆర్తిని తీర్చినవారు)

**57.** **అనంతాభీష్టఫలదః** - (అనంతార్యులకు వారు కోరిన రీతిలో తిరుమలలో పుష్పకైంకర్యాన్ని అనుగ్రహించినవారు, లేక శిష్యులకు అంతులేని కోరిన ఫలాన్ని ఇచ్చేవారు)

**58.** **విట్టలేశ ప్రపూజితః** - (తిరుమల ప్రాంతాన్ని పాలించే విట్టలదేవునిచే ఆరాధింపబడినవారు.)

**59.** **శ్రీశైలపూర్ణకరుణాలబ్ధ రామాయణార్థకః** - (పెరియతిరుమల నంబి కరుణవల్ల శ్రీరామాయణంలోని రహస్యార్థాలను ఉపదేశంగా పొందినవారు)

**60.** **ప్రపత్తిధర్మైకరతః** - (శరణాగతి ధర్మంలో నిష్ఠను కలవారు)

**61.** **గోవిందాచార్యప్రియానుజః** - (గోవిందులనే ఎమ్బార్‌ను ప్రియమైన తమ్మునిగా కలవారు)

**62.** **వ్యాససూత్రార్థ తత్త్వజ్ఞః** - (బాదరాయణ బ్రహ్మసూత్రాల అర్థతత్త్వాన్ని తెలిసినవారు)

63. బోధాయనమతానుగః - (బోధాయనమహర్షి రచించిన వృత్తిగ్రంథంలో తెలుపబడిన విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని అనుసరించినవారు)

64. శ్రీభాష్యాదిమహాగ్రంథకారకః -(శ్రీభాష్యం, వేదార్థసంగ్రహం, గీతాభాష్యం, వేదాంతదీపం, వేదాంతసారం, గద్యత్రయం, నిత్యగ్రంథం- అనే తొమ్మిది మహాగ్రంథాలను రచించినవారు)

65. కలినాశనః - ("కలియుమ్ కెడుమ్ కణ్డుకొణ్మిన్" అనే రీతిలో కలిదోషాన్ని పోగొట్టినవారు)

66. అద్వైతమతవిచ్ఛేత్తా - (శ్రీభాష్యాది గ్రంథాలలో అద్వైతమతాన్ని నిరసించిన వారు, ఖండిచినవారు)

67. విశిష్టాద్వైతపాలకః - (పరమవైదిక సిద్ధాంతమైన విశిష్టాద్వైతాన్ని రక్షించినవారు)

68. కురంగనగరీపూర్ణమంత్ర రత్నోపదేశికః - (తిరుక్కుఱుఙ్గుడి నంబికి మంత్రరత్నమైన ద్వయాన్ని ఉపదేశించినవారు)

69. వినాశితాఖిలమతః - (అప్రామాణికాలైన అన్ని సిద్ధాంతాలను ఖండించినవారు.)

70. శేషీకృతరమాపతిః - (శ్రీమన్నారాయణుని సర్వశేషిగా నిరూపించి పల్కినవారు)

71. పుత్రీకృతశఠారాతిః - (తిరుక్కురుకైప్పిళ్ళాన్‌ను పుత్రులుగా అభిమానించినవారు.)

72. శఠజిత్ ఋణమోచకః - (తమ అభిమానపుత్రులైన పిళ్ళాన్‌కు నమ్మాழ்వార్ల నామాన్ని పెట్టడం ద్వారా నమ్మాழ்వార్ల పట్ల ఉండే ఋణాన్ని తీర్చినవాడు)

73. భాషాదత్తహయగ్రీవః - కాశ్మీరంలో సరస్వతీదేవిచే హయగ్రీవుల అర్చామూర్తిని పొందినవారు.

74. భాష్యకారః - (శ్రీభాష్యకారులనే బిరుదును సరస్వతీ దేవివల్ల పొందినవారు.)

75. మహాయశాః - (గొప్పకీర్తిని కలవారు)

76. పవిత్రీకృతభూభాగః - (భూమండలాన్ని తమ పాదన్యాసంతో పవిత్రం చేసినవారు)

77. కూర్మనాథప్రకాశకః - (శ్రీకూర్మనాథుని వ్యక్తం చేసినవారు)

78. శ్రీవేంకటాచలాధీశ శంకచక్రప్రదాయకః - (శ్రీవేంకటేశ్వరునకు శంఖచక్ర ప్రదానాన్ని చేసినవారు)

79. శ్రీవేంకటేశశ్వశురః - (శ్రీవేంకటేశ్వరునకు వక్షఃస్థలంలో వ్యూహలక్ష్మిని సమర్పించి, ఆ స్వామిని మామగారైనవారు.)

80. శ్రీరమాసఖదేశికః - (పద్మావతీజాని అయిన శ్రీవేంకటేశునకు శంఖచక్రాలను ప్రసాదించడం ద్వారా ఆస్వామికి ఆచార్యులు)

81. కృపామాత్రప్రసన్నాచార్యః - (ఆశనుకలవారందఱికి మంత్రార్థాన్ని ప్రసాదించి కృపామాత్ర ప్రసన్నాచార్యులైనవారు. అంతకుముందున్న వారు అనువృత్తి ప్రసన్నాచార్యులు)

82. గోపికామోక్షదాయకః - (తిరుమలలో గోపవనితకు మోక్షాన్ని ఇచ్చినవారు.)

83. సమీచీనార్యసచ్ఛిష్య సత్కృతః - (తిరుమలైనల్లాన్ అనే గొప్ప శిష్యునిచే సత్కరింపబడినవారు.)

84. శ్రీవైష్ణవప్రియః - (వైష్ణవులపట్ల గొప్ప ఆదరాన్ని కలవారు లేక, శ్రీవైష్ణవులకు ప్రియులు.)

85. కృమికంఠనృపధ్వంసీ - (కృమికంఠచోళుని నశింపచేసినవారు)

86. సర్వమంత్రమహోదధిః - (రత్నాలకు నిలయమైన సముద్రంవలె అన్ని మంత్రాలకు చోటయినవారు)

87. అంగీకృతాంధ్రపూర్ణార్యః - (ఆంధ్రపూర్ణులనే వడుగనంబిని శిష్యులుగా స్వీకరించినవారు)

88. సాలగ్రామప్రతిష్ఠితః - ("ప్రతిష్ఠితసాలగ్రామః" అని అర్థం. సాలగ్రామమనే ఊరును ప్రతిష్ఠించినవారు.)

89. శ్రీభక్తగ్రామపూర్ణేశః - (తొండనూర్ నంబికి ఆచార్యులు)

90. విష్ణువర్ధన రక్షకః - (విష్ణువర్ధనుడనే ప్రభువును రక్షించినవారు ఆచార్యులు)

91. బౌద్ధధ్వాంతసహస్రాంశుః - (బౌద్ధమతమనే కటికచీకటిని పోగొట్టే వేయి కిరణాలను కల సూర్యుని వంటివారు)

92. శేషరూపప్రదర్శకః - (తొండనూర్‌లో నూఱుమంది జైనులతో వాదించేటపుడు తెరవెనక ఉండి వేయి శిరస్సులను కల ఆదిశేషరూపాన్ని ధరించినవారు.)

93. నగరీకృతవేదాద్రిః - (అరణ్య ప్రాంతంగా ఉండే వేదాద్రిని, అంటే - తిరునారాయణపురాన్ని నగరంగా తీర్చిదిద్దినవారు)

94. **దిల్లీశ్వరసమర్చితః** - (దిల్లీనగర ప్రభువుచే గౌరవింపబడినవారు)

95. **నారాయణప్రతిష్ఠాతా** - (తిరునారాయణపురంలో తిరునారాయణ స్వామిని ప్రతిష్ఠించినవారు.)

96. **సంపత్పుత్రవిమోచనః** - (తిరునారాయణపురంలోని ఉత్సవవిగ్రహం శెల్వపిళ్ళైను ఢిల్లీనగరం నుండి తీసికొనివచ్చినవారు.)

97. **సంపత్కుమారజనకః** - (శెల్వపిళ్ళైకు తండ్రి)

98. **సాధులోకశిఖామణిః** - (సత్పురుషులు శిరసావహించే శిఖామణి వంటివారు.)

99. **సుప్రతిష్ఠితగోవిందరాజః** - (తిల్లైగోవిందరాజ స్వామిని తిరుపతి నగరంలో ప్రతిష్ఠించినవారు)

100. **పూర్ణమనోరథః** - (కూరేశుల కుదృష్టిని తిరిగిపొందించడం ద్వారా మనోరథం నెఱవేరినవారు)

101. **గోదాగ్రజః** - (గోదాదేవికి అన్నగారు)

102. **దిగ్విజేతా** - (అన్నిదిక్కులలో ప్రతివాదులను గెలిచి దిగ్విజయాన్ని పొందినవారు)

103. **గోదాభీష్ట ప్రపూరకః** - (తిరుమాలిరుమ్ శోలైక్షేత్రంలో సుందరబాహుస్వామికి నూఱు గంగాళాల వెన్నను, నూఱు గంగాళాల పాయసాన్ని సమర్పించి గోదాదేవి కోరికను తీర్చినవారు)

104. **సర్వసంశయవిచ్ఛేత్తా** - (శిష్యుల అన్ని సందేహాలను తీర్చేవారు)

105. **విష్ణులోకప్రదాయకః** - (విష్ణులోకమనే పరమపదాన్ని అనుగ్రహించేవారు)

106. **అవ్యాహతమహావర్త్మా** - (మోక్షాన్ని పొందడానికి ఏ ఆటంకం లేని గొప్ప మార్గమైన (సాధనమై)నవారు)

107. **యతిరాజః** - (యతులకు ప్రభువు)

108. **జగద్గురుః** - (అన్నిలోకాలకు ఆచార్యులు)



## అనుబంధం-2

# శ్రీరామానుజాష్టోత్తర శతనామావళి

(ఇరామానుశ నూఱ్ఱన్దాది ప్రబంధంలోని ఒక్కొక్క పాశురంలో ఉండే మొదటి అక్షరాలను వరుసగా నామాల ఆరంభంలో కూర్చి రచింపబడిన శతనామస్తుతి ఇది. దీనిని కాంచీమహావిద్వాన్ ప్ర.భ. అణ్ణంగరాచార్యస్వామివారు రచించారు.)

1. ఓమ్ పూజిత శ్రీశఠారాతయే నమః
2. ఓమ్ కలిజిత్ సూక్తి సేవకాయ నమః
3. ఓమ్ భేదశ్రుత్యర్థతత్త్వజ్ఞాయ నమః
4. ఓమ్ ఏనఃపుంజనివారణాయ నమః
5. ఓమ్ ఏధమానయశోరాశయే నమః
6. ఓమ్ ఇందిరాపాంగ వీక్షితాయ నమః
7. ఓమ్ మోక్షదాయకపాదాబ్జాయ నమః
8. ఓమ్ వందారు జనరక్షకాయ నమః
9. ఓమ్ ఇష్టసర్వార్థసందాత్రే నమః
10. ఓమ్ మహాపూర్ణ పదాశ్రితాయ నమః
11. ఓమ్ శీధుతుల్యవచోరాశయే నమః
12. ఓమ్ ఇంధానగురుభక్తికాయ నమః
13. ఓమ్ శేవధీభూతవాగ్దాత్రే నమః
14. ఓమ్ గహనార్థప్రదర్శకాయ నమః
15. ఓమ్ శోకహర్షవిదూరస్థాయ నమః
16. ఓమ్ తారకేశసమాననాయ నమః
17. ఓమ్ ముకుందపాదభక్తాగ్ర్యాయ నమః

18. ఓమ్ ఏధమాన మహామతయే నమః
19. ఓమ్ ఉపప్లవౌఘశమనాయ నమః
20. ఓమ్ ఆనందఘనమానసాయ నమః
21. ఓమ్ నిధికల్పవచః పుంజాయ నమః
22. ఓమ్ కారుణ్యామృత సాగరాయ నమః
23. ఓమ్ వైరాగ్యభక్తి భూషాఢ్యాయ నమః
24. ఓమ్ మోఘీకృతమతాంతరాయ నమః
25. ఓమ్ కాంతోపయంతృమున్యాత్మనే నమః
26. ఓమ్ దిగంతోజ్జ్వల కీర్తికాయ నమః
27. ఓమ్ కోవిదస్తుత్యవాగ్గుంభాయ నమః
28. ఓమ్ నేత్రానందదవిగ్రహాయ నమః
29. ఓమ్ కూరనాథగురుస్తుత్యాయ నమః
30. ఓమ్ ఇంద్రలోకవిరక్తధియే నమః
31. ఓమ్ ఆంధ్రపూర్ణగురుస్తుత్యాయ నమః
32. ఓమ్ పోషితానేక శిష్యకాయ నమః
33. ఓమ్ అత్యాశ్చర్యగుణస్తోమాయ నమః
34. ఓమ్ నిత్యముక్తమహాకృతయే నమః
35. ఓమ్ నక్షత్రేశసమశ్రీమతే నమః
36. ఓమ్ అప్రమేయగుణోదధయే నమః
37. ఓమ్ పవిత్రీకృతసచ్ఛిష్యాయ నమః
38. ఓమ్ ఆత్మలక్షణబోధకాయ నమః
39. ఓమ్ ప్రేక్షితాశేషసత్క్షేత్రాయ నమః
40. ఓమ్ క్షేమదాయక వాక్పతయే నమః
41. ఓమ్ మహనీయగుణస్తోమాయ నమః

42. ఓమ్ ఆర్తారిహరవాక్యదాయ నమః
43. ఓమ్ శుష్కీకృతభవాంబోధయే నమః
44. ఓమ్ శోకమోహవిదూరగాయ నమః
45. ఓమ్ భేదవాక్యరిపుధ్వంసినే నమః
46. ఓమ్ కూరేశసుతసంస్తుతాయ నమః
47. ఓమ్ ఇందిరాపతిసద్భక్తాయ నమః
48. ఓమ్ నిషేవితమహాగురవే నమః
49. ఓమ్ ఆశ్చర్యవైభవస్తోమాయ నమః
50. ఓమ్ ఉద్యద్భానుసమప్రభాయ నమః
51. ఓమ్ అచ్యుత ప్రేమభరితాయ నమః
52. ఓమ్ పారాశర్యవచోర్థదాయ నమః
53. ఓమ్ అద్భుతప్రజ్ఞశిష్యాఢ్యాయ నమః
54. ఓమ్ నారాయణపరాయణాయ నమః
55. ఓమ్ కంఠీరవసమాకారాయ నమః
56. ఓమ్ కోమలాకృతి శోభితాయ నమః
57. ఓమ్ మంత్రమంత్రార్థవిజ్ఞాత్రే నమః
58. ఓమ్ భేదదర్శనపాలకాయ నమః
59. ఓమ్ కలికోలాహలధ్వంసాయ నమః
60. ఓమ్ ఉద్వేలకరుణోదధయే నమః
61. ఓమ్ ఘోరసంసారతాపఘ్నాయ నమః
62. ఓమ్ ఇహభోగవిరక్తధియే నమః
63. ఓమ్ పింగళాబ్దసముద్భూతయే నమః
64. ఓమ్ పండితోత్తమసేవితాయ నమః
65. ఓమ్ వాదిమత్తేభపంచాస్యాయ నమః

66. ఓమ్ జ్ఞానదీపప్రదాయకాయ నమః
67. ఓమ్ శరణాగతితత్త్వజ్ఞాయ నమః
68. ఓమ్ ఆచార్యగుణసంభూతాయ నమః
69. ఓమ్ చింతాతీత ప్రభావాఢ్యాయ నమః
70. ఓమ్ ఏవస్సంచయదాహకాయ నమః
71. ఓమ్ చార్వాకబౌద్ధధ్వంసినే నమః
72. ఓమ్ కైంకర్యకరణోత్సుకాయ నమః
73. ఓమ్ వక్రదుర్మతిదూరస్థాయ నమః
74. ఓమ్ తేజఃపుంజాస్పదాయ నమః
75. ఓమ్ శేషత్వకాష్ఠానిష్ఠాత్మనే నమః
76. ఓమ్ నిర్మలజ్ఞానదేశికాయ నమః
77. ఓమ్ ఈక్షితాశేషసద్గ్రంథాయ నమః
78. ఓమ్ కపిలాదిమతాంతకాయ నమః
79. ఓమ్ పరమార్థపరిత్రాత్రే నమః
80. ఓమ్ నశ్వరార్థవిదూరగాయ నమః
81. ఓమ్ శోచనీయమతధ్వంసినే నమః
82. ఓమ్ తేజోరాశివదుజ్జ్వలాయ నమః
83. ఓమ్ శ్రీమద్యామున సందృష్టాయ నమః
84. ఓమ్ కటాక్షాధీనవైభవాయ నమః
85. ఓమ్ ఓంకారార్థపరిత్రాత్రే నమః
86. ఓమ్ పరమైకాంతసేవితాయ నమః
87. ఓమ్ పరిరక్షితవేదార్థాయ నమః
88. ఓమ్ కలిజిత్ సూక్తి వర్ధనాయ నమః
89. ఓమ్ పోష్యవర్గపరిత్రాత్రే నమః

90. ఓమ్ నిశ్చితార్థవిలేఖకాయ నమః
91. ఓమ్ మనీషిగణసంమాన్యాయ నమః
92. ఓమ్ పుణ్యతీర్థాటనోత్సుకాయ నమః
93. ఓమ్ క్లిష్టార్థఖండనోత్సాహినే నమః
94. ఓమ్ తపఃస్వాధ్యాయ నిష్ఠితాయ నమః
95. ఓమ్ ఉత్తుంగార్థపరిత్రాత్రే నమః
96. ఓమ్ వరిష్ఠార్థవిబోధకాయ నమః
97. ఓమ్ తరుణాదిత్యసంకాశాయ నమః
98. ఓమ్ ఇందుజైత్రముఖాంబుజాయ నమః
99. ఓమ్ తర్కవ్యాకరణాదిజ్ఞాయ నమః
100. ఓమ్ బోధితాశేషసత్కృతయే నమః
101. ఓమ్ మహిష్ఠజ్ఞాన సంపన్నాయ నమః
102. ఓమ్ నైష్ఠికాగ్రేసరాంచితాయ నమః
103. ఓమ్ వర్ధమానయశోరాశయే నమః
104. ఓమ్ కైతవాదివిదూరగాయ నమః
105. ఓమ్ శిష్టాగ్రగణ్యసంసేవ్యాయ నమః
106. ఓమ్ ఇష్టైశ్వర్య ప్రదాయకాయ నమః
107. ఓమ్ ఇతిహాసపురాణజ్ఞాయ నమః
108. ఓమ్ అంగీకృతమదుక్తికాయ నమః










పద్మనాభంలోని శ్రీకుంతీమాధవస్వామి వారిని సేవించే
ఉ.వే. శ్రీమాన్ కందాళి వేంకటాచార్యస్వామి,
శ్రీమతి చిత్రావళి దంపతులు